

# శ్రీవేదాంతదేశిక స్తోత్రమాలిక-1

## ఆంధ్రవివరణంతో

వివరణకర్త

శ్రీమాన్ డా॥ ఈ.ఏ. శింగరాచార్యస్వామి



ప్రచురణ

ఆళ్వార్ దివ్యప్రబంధ ప్రాజెక్ట్

**తిరుమల తిరుపతి దేవస్థానములు**

**తిరుపతి - 2015**

# శ్రీ వేదాంతదేశిక స్తోత్రమాలిక - 1
## ఆంధ్రవివరణంతో

వివరణకర్త : శ్రీమాన్ డా॥ ఈ.ఏ.
శింగరాచార్యస్వామి

ప్రచురణ : ఆళ్వార్ దివ్యప్రబంధ ప్రాజెక్ట్, తి.తి.దే., తిరుపతి

వెల :

మొదటి ముద్రణ : 2015

ప్రతులు : 500

ప్రకాశకులు :

శ్రీ డి. సాంబశివరావు, ఐ.ఏ.ఎస్.
కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి - 517 507

ముద్రణ :
తి.తి.దే. ముద్రణాలయం
తిరుపతి-517 507



# ముందుమాట

శ్రీవైష్ణవ పూర్వాచార్యపరంపరలో శ్రీవేదాంత దేశికుల స్థానం విశిష్టమైనది. తిరుమలలోని శ్రీవేంకటేశ్వర ఆలయంలో గల గంట అంశతో అవతరించినట్లుగా ఆరాధింపబడే ఈ మహాకవి శతాధిక గ్రంథకర్త. సంస్కృత, ప్రాకృత, ద్రావిడ, మణిప్రవాళ భాషలలో వీరు పలు ప్రక్రియలలో ఎన్నో కృతులను రచించారు. వీటిలో కొన్ని స్వతంత్రగ్రంథాలు, కొన్ని వ్యాఖ్యానాలు, మరికొన్ని వాదగ్రంథాలు. కొన్ని కావ్యాలు, కొన్ని శాస్త్ర గ్రంథాలు. ఎంతటి గంభీరమైన విషయాన్ని అయినా అలవోకగా, అందంగా మనస్సుకు హత్తుకునేటట్లు తెలుపగల్గడం వీరి సొత్తు.

స్తుతి అనేది ప్రపంచ వాఙ్మయంలోనే ప్రాచీనమైన ప్రక్రియ. దీని ఆవిర్భావాన్ని వేదాలలో దర్శించవచ్చు. ఋగ్వేదం పలుదేవతల స్తుతుల యొక్క సమాహారం. ఋక్ అంటే స్తుతి అని అర్థం. ఈ స్తుతిప్రక్రియ క్రమంగా పరిణతిని పొంది, ఆయా సిద్ధాంతాల లోని తత్త్వాలను ఆవిష్కరించే వైఖరిని కూడా సంతరించుకొన్నది . ఇటువంటి స్తుతులే వేదాంతదేశికుల స్తోత్రాలు. ఇవి అన్ని శ్రీమన్నారాయణుని వైభవాన్ని, విశిష్టాద్వైత సిద్ధాంతాన్ని అందంగా అందిస్తాయి. దివ్యసూరుల భావాలు వీటిలో పరిమళించడం ఇంకొక విశేషం.

తి.తి. దేవస్థానంవారిద్వారా నిర్వహింపబడే ధర్మప్రచారసంస్థలలో ఒకటి అయిన ఆళ్వార్ దివ్యప్రబంధ ప్రాజెక్టు తన ప్రచారకార్యక్రమంలో భాగంగా ధార్మిక గ్రంథాలకు, ఆళ్వారుల, ఆచార్యుల సాహిత్యాన్ని వ్యావహారికభాషలో చిన్న చిన్న గ్రంథాల రూపంలో ప్రచురించి సహృదయపాఠకులకు అందించాలని ప్రయత్నిస్తున్నది. ఆ ప్రయత్నంలో భాగమే ఈ వేదాంతదేశిక స్తోత్రమాలిక గ్రంథ ప్రచురణం. వేదాంతదేశికులు అందించిన స్తోత్రాలలోని కొన్నిటిని టీకా వివరణలతో చక్కగా అందించిన శ్రీమాన్ ఈ.ఏ. శింగరాచార్యులు గారిని (మాజీ. స్పెషల్ ఆఫీసర్, ఆళ్వార్ దివ్యప్రబంధ ప్రాజెక్ట్), ఈ గ్రంథప్రచురణలో తగిన ప్రయత్నాన్ని చేసిన ప్రాజెక్టు స్పెషల్ఆఫీసర్ వి.జి. చొక్కలింగంగారిని అభినందిస్తూ, ఈ గ్రంథప్రచురణను ఆదరించి ఆనందింపజేయవలసినదిగా ఆస్తిక లోకాన్ని అభ్యర్థిస్తున్నాను.

సాంబశివరావు, ఐ.ఏ.ఎస్.
కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి-517 507

# నివేదిక

తిరుమల తిరుపతి దేవస్థానాల యాజమాన్యం పలు ధార్మిక ప్రచార విభాగాలను ఏర్పాటుచేసి, వాటిద్వారా సనాతనధర్మ ప్రచార పరిరక్షణలను నిర్వహిస్తున్నది. ఈవిధంగా తి.తి.దేవస్థానం నిర్వహించే ధార్మిక ప్రచార శాఖలలో ఆళ్వార్ దివ్యప్రబంధ ప్రాజెక్ట్ ఒకటి. క్రీ.శ.1991 సంవత్సరంలో ఈ ప్రాజెక్ట్ ఆవిర్భవించింది.

వైదిక సిద్ధాంతాలను, తత్త్వాలను, సందేశాలను, ప్రత్యేకించి, మధురభక్తిని ద్రావిడప్రబంధాల రూపంలో లోకానికి అందించి జాగృతంచేసిన మహానుభావులు ఆళ్వార్లు. వీరు శ్రీమన్నారాయణుడే పరదైవమని నమ్మి, ఆ సిద్ధాంతాన్ని తమ ప్రబంధాలలో చాటిచెప్పారు. వీరికి దివ్యసూరులని, వీర ప్రబంధాలకు దివ్య ప్రబంధాలని, వీరు కీర్తించిన విష్ణు క్షేత్రాలకు దివ్య దేశాలని ప్రసిద్ధమైన వ్యవహారం ఏర్పడింది. దివ్యమంటే అలౌకికమైన అర్థం. వీరు సరోయోగి (పొయ్గై ఆళ్వార్లు), భూతయోగి (పూదత్తాళ్వార్లు), మహాయోగి (పేయాళ్వార్లు), భక్తిసారయోగి (తిరుమళిశైప్పిరాన్), శఠకోపయోగి (నమ్మాళ్వార్లు), కులశేఖరయోగి (కులశేఖర పెరుమాళ్), భట్టనాథయోగి (పెరియాళ్వార్లు), భక్తాంఘ్రిరేణుయోగి (తొండరడిప్పొడిఆళ్వార్లు), మునివాహనసూరి (తిరుప్పాణ్ పెరుమాళ్), పరకాలయోగి (తిరుమంగై మన్నన్) అని ఆళ్వార్లు పదిమంది. వీరితోపాటు నమ్మాళ్వార్ల సమకాలీనులు అయిన మధుర కవులు, భట్టనాథుల ప్రియపుత్రిక అయిన గోదాదేవి - అనే ఇద్దరిని కలిపి మొత్తం 12 మంది ఆళ్వార్లు అనే లెక్క కూడా ఉన్నది. వీరందరూ లోకానికి అందించిన ప్రబంధాల సంఖ్య 24. ఈ దివ్య ప్రబంధాలలోని పాశురాల సంఖ్య సుమారు 4000 అయినందున, ఈ భక్తి సాహిత్యానికి నాలాయిర దివ్యప్రబంధమనే ప్రసిద్ధికల్గింది. నాలాయిరమంటే నాలుగు వేలు. మహర్షుల వైదిక భాషలో దర్శించిన విజ్ఞానం సంస్కృత వేదమని, ఆళ్వార్లు ద్రావిడభాషలో వెలయించిన ప్రబంధాలు ద్రావిడవేదమని వ్యవహరింపు బడుతున్నది. ఈ రెండూ కలిపి శ్రీవైష్ణవసంప్రదాయంలో ఉభయవేదాలుగా ప్రసిద్ధి చెందాయి.



మహర్షులు వేదంలో వ్యక్తం చేసిన తత్త్వాలనే ఆళ్వార్లు తమ ప్రబంధాలలో ద్రావిడభాషలో వ్యక్తం చేసినందున ఈ రెండు వేదాలు ఒకే విధమైన సిద్ధాంతాలను, తత్త్వాలను వ్యక్తం చేస్తున్నవి.

ఆళ్వార్ల దివ్యప్రబంధాలలోని వైదిక తత్త్వాలను, సందేశాలను లోకానికి వివరిస్తూ నంజీయర్, నంబిళ్ళై, శ్రీకృష్ణసూరి, వేదాంత దేశికులు, శ్రీవరవర మునులు మొదలైన పలువురు పూర్వాచార్యులు మణిప్రవాళశైలిలో అద్భుతాలైన, రస్యరహస్యార్థపూర్ణాలైన వ్యాఖ్యానాలను వెలయించారు. మణిప్రవాళ శైలి అంటే- సంస్కృత ద్రావిడ భాషాపదాల కలయికతో కూడిన శైలి. ఈశైలి ఆవిర్భావం కూడా అద్భుతమైనది. నాన్యతో దర్శనీయమైనది.

ఆళ్వారుల దివ్యప్రబంధాలను వ్యాఖ్యానించిన పూర్వాచార్యులు, ఆళ్వార్ల ప్రబంధాలలోని తత్త్వాలను సంస్కృతవేదాంతంలోని, పురాణేతిహాసాగమాదుల లోని తత్త్వాలతో సమన్వయం చేసి వ్యాఖ్యానించడమే కాక, స్వయంగా ఎన్నో స్వతంత్ర గ్రంథాలను మణిప్రవాళశైలిలో, సంస్కృతభాషలో, ద్రావిడభాషలో రచించారు. ఆళ్వార్ల దివ్యప్రబంధాలకు పూర్వాచార్యులు రచించిన వ్యాఖ్యలకు టిప్పణులు (అరుబందాలు) వెలిశాయి. ఈవిధంగా ఉభయవేదాంత సంప్రదాయ వాఙ్మయం విశాలంగా విస్తరించింది, విస్తరిస్తూవున్నది కూడా. ఇంతటి అపూర్వమైన, అపారమైన జ్ఞానసంపదను పరిరక్షించి లోకానికి అందించాలనే మహదాశయంతో ఆళ్వార్ దివ్యప్రబంధ ప్రాజెక్ట్‌ను టి.టి. దేవస్థానం ప్రారంభించింది.

ఇంతకాలంగా ప్రాజెక్ట్ దేశంలో పలుచోట్ల ఆళ్వార్ల, పూర్వాచార్యుల జన్మదినోత్సవాలను జరిపి, ఆ సందర్భాలలో ప్రసిద్ధపండితుల ఉపన్యాస కార్యక్రమా లను ఏర్పాటుచేయడం ద్వారా ప్రచార కార్యక్రమాన్ని సాగించింది. తర్వాత గత మూడేళ్ళుగా ప్రాజెక్ట్ ఆళ్వార్ల, పూర్వాచార్యుల సాహిత్యాన్ని చిన్న చిన్న గ్రంథాల రూపంలో ప్రచురించి, ఉచితంగా భక్తులకు, ఆస్తికులకు అందచేసి ప్రచార కార్యక్రమాన్ని మరింత విస్తృతం చేసింది.

ప్రస్తుతం ఆళ్వార్ల, పూర్వాచార్యుల ప్రబంధాలకు సులభమైన తెలుగులో టీకా వివరణలను ముద్రించి, ప్రచారం చేసే వేఱొక ప్రయత్నాన్ని ప్రాజెక్ట్

ప్రారంభించింది. అందులో భాగంగా ఇపుడు వేదాంతదేశికులు రచించిన స్తోత్రాలలో కొన్ని స్తోత్రాలు టీకాతాత్పర్యసహితంగా "వేదాంతదేశిక స్తోత్రమాలిక-1" అనే పేరుతో ముద్రింపబడుతున్నాయి. ఈ గ్రంథంలో గరుడదండకం, అష్టభుజాష్టకం, యథోక్తకారిస్తోత్రం, హయగ్రీవ స్తోత్రం, సుదర్శనాష్టకమ్, షోడశాయుధ స్తోత్రం, గోదాస్తుతి అనే స్తుతుల వివరణం ముద్రింపబడింది. త్వరలో మరిన్ని వేదాంతదేశిక స్తోత్రాలు ఈ పద్ధతిలోనే ప్రచురింప బడతాయి. ప్రాజెక్టు కార్యకలాపాలకు అన్నివిధాలుగా చేయూత నిస్తున్న తి.తి. దేవస్థానాల కార్యనిర్వహణాధికారి శ్రీ ఎం.జి. గోపాల్ గారికి, సహాయకార్య నిర్వహణాధికారి శ్రీ వెంకట్రామిరెడ్డి గారికి, తదితర ఉన్నతాధి కారులకు హృదయపూర్వకంగా కృతజ్ఞతలను తెలియజేసు కొంటున్నాను. అడిగిన వెంటనే కాదనకుండా వేదాంతదేశికుల స్తోత్రాలకు టీకా తాత్పర్యా లను వ్యావ హారిక ఆంధ్రభాషలో అందించిన మిత్రులు శ్రీమాన్ డా॥ ఈ.ఏ. శింగరాచార్యులుగారికి ధన్యవాదాలను తెలుపు కుంటున్నాను. ఈ గ్రంథ ముద్రణ విషయంలో సహృదయతతో సహకరించిన టిటిడి ప్రెస్ మేనేజరుకు, వారి సిబ్బందికి నా హార్దిక కృతజ్ఞతలు. ఆస్తికులైన పాఠకులు ఈ ప్రచురణను ఆదరించి ఆమోదిస్తారని నమ్ముతున్నాను.

ఇట్లు

**వి.జి. చొక్కలింగం**

స్పెషల్ ఆఫీసర్, ఆళ్వార్‌దివ్యప్రబంధ ప్రాజెక్ట్

తి.తి.దే, తిరుపతి



# నమ్రనివేదనము

కుంకుమాంకితవర్ణాయ కుందేందుధవళాయ చ ।
విష్ణువాహ! నమ స్తుభ్యం పక్షిరాజాయ తే నమః ॥

"వైకుంఠే తు పరే లోకే శ్రియా సార్ధం జగత్పతిః, ఆస్తే విష్ణు రచింత్యాత్మా భక్తై ర్భాగవతై స్సహ" అనునట్లు భగవానుడగు శ్రీమన్నారాయణుడు లక్ష్మీదేవితో, నిత్యముక్తులతో కలసి దివ్యవైకుంఠనగరమున పేరోలగమును నిర్వహించు చుండును. త్రిపాద్విభూతి అనబడు పరమపదమున భగవానుని పలువురు నిత్యులు, ముక్తులును అనేక విధముల సేవించుచుందురు. నిత్యవర్గమునకు చెందిన భగవానుని సేవకులలో గరుత్మంతుడు అగ్రగణ్యుడు. కావుననే శ్రీవైష్ణవ సంప్రదాయమున గరుడునకు "పెరియతిరువడి" అని పేరు. ద్రావిడభాషలో "అడి" అనగా దాసుడు అని, పాదములు అని అర్థములు కలవు. భగవానుని పాదములను మోయుచు ఎల్లప్పుడు వాహనమగుటచే, ఆ స్వామికి పలు విధములైన సేవలను చేయు దాసుడగుటచే ఈ పేరు గరుడునకు వచ్చెనని పెద్దలందురు. "పెరియ" అనగా పెద్ద అని అర్థము. భగవానుని పాదములను మోయు భాగ్యము శ్రీరామావతారసందర్భమున హనుమానునికి మాత్రము కల్గెను. కాని, గరుత్మంతు నకు ఆ అదృష్టము నిత్యము కలదు. కావున ఈ విశేషణము అతనియందు మిక్కిలి సార్థకము అని అభిజ్ఞుల వివరణము.

ఈ పరమభక్తునకు అన్వర్థములైన పలు పేర్లు కలవు. గరుత్మత్, సుపర్ణ శబ్దములు ఇతని రెక్కల శక్తిని తెలుపును. గరుడశబ్దము జ్ఞానానుష్ఠానములను వచించును. పక్షీంద్రశబ్దము ఇంద్రసామ్యమును తెలుపును. పన్నగాశనుడను పేరు సర్పములకు శత్రువు అనుటను తెలియజేయును. వైనతేయుడు అనుట వినతాసుతత్వమును సూచించును. ఆ యా పేర్లలోని స్వారస్యములు వ్యాఖ్యలో యథావకాశముగా ప్రస్తుతములు. **"సుష్ఠు పారం నయతీతి సుపర్ణః"** అనుచు విష్ణుసహస్రనామములోని సుపర్ణశబ్దమునకు భట్టరుచేసిన వివరణమును గరుడుని యందును అన్వయింపవచ్చును. భగవానుడు భక్తులను పరమపదమునకు గరుడునిపై నిడికొని కొనిపోవుననికదా ప్రసిద్ధి! **"వారిజవిలోచన! మదంతి మదశాయాం క్లేశవివశీకృత సమస్తకరణాయామ్, ఏహి రమయా సహ శరణ్య! విహగానాం నాథ మధిరుహ్య నరసింహ! నరసింహ!"** అని కదా పూర్వాచార్య ప్రార్థన.

**"పిపర్తీతి పర్ణమ్ -పౄ పాలన పూరణయోః"** అని, **"పృణతి ఇతి పర్ణమ్ - పృణ ప్రీణనే"** అనియు పర్ణశబ్దము అమరసుధలో వివరింపబడినది. కావున సుపర్ణుడనుటకు భక్తులను పాలించువాడని, భగవానుని ఆశను పూరించువాడని, భగవానుని, భక్తులను సంతోషింపచేయువాడనియు అర్థములను చెప్పవచ్చును. అట్లే, విష్ణురథ నామస్వారస్యము వ్యాఖ్యలో తెలుపబడినది.

భగవద్యామునులు స్తోత్రరత్నమునందు- **"దాస స్సఖా వాహన మాసనం ధ్వజో య స్తే వితానం వ్యజనం త్రయీమయః"** అనుచు భగవానునకు దాసుడై, సఖుడై, వాహనమై, ఆసనమై, ధ్వజమై, మేలుకట్టై, విసనకర్రయై- ఇంకనూ పలు విధముల గరుడుడు సేవచేయు ననిరి. ఈ సూక్తిని ఆచార్యులు వ్యాఖ్యానించిన తీరు అత్యద్భుతము. అదలి విశేషములు కొలదిగా ప్రస్తావింపబడుచున్నవి.

దాసః :- స్వామికి అతిశయమును కల్గించుట అను శేషత్వము సార్థకమగుట దాసత్వములోనే. శేషత్వము అచేతనమునకును ఉండవచ్చును. కాని, దాసత్వము మాత్రము చేతనునకే సాధ్యము. సఖిత్వము మొదలగు స్థితులయందును స్వాభావికమైన దాసత్వము అనువర్తించును. **"లోకనాథస్య రామస్య సఖా దాసోఽస్మి రావణ"** అను శ్రీరామాయణ సూక్తి ఇందులకు ప్రమాణము - అని దేశికుల సూక్తి. అట్టి దాసులలో ముఖ్యుడు గరుడుడు.

సఖా :- గరుడుని సఖిత్వము **'సఖే రాఘవ ధర్మజ్ఞ"** ఇత్యాది శ్రీరామాయణ సూక్తిలో స్పష్టము. ఇట్టి సఖిత్వము కాదాచిత్కము, అభినయప్రయుక్తము - అని దేశికులు వ్యాఖ్యానించిరి. సఖిత్వ మనుటకు సమానచిత్తవృత్తిత్వము, అనగా ఒకే విధమైన అభిప్రాయమును కల్గియుండుట అనియు చెప్పవచ్చును. జగద్వ్యాపారములలో ఈశ్వరుడు తనతో సంప్రదించు గొప్పతనమును కల్గినవాడు గరుడుడు - అని కృష్ణసూరి ఇచట వ్యాఖ్యానించిరి. **"సమానం ఖ్యాయతే ఇతి సఖా"** అను వ్యుత్పత్తి ఇచట వివక్షితము.

ఆసనమ్ :- ఏ కార్యము లేనపుడు ప్రభువు సింహాసనముపై కూర్చుండి సేదదీరునట్లు స్వామి తన వైభవమునకు తగిన విధముగా గరుడుని ఆసనముగా చేసికొని కూర్చుండును. **"గరుడాసనా"** అని లక్ష్మీసహస్రనామస్తోత్రమున గల నామమును బట్టి గరుడుడు లక్ష్మీదేవికి ఆసనమగును అని తెలియుచున్నది. అనగా- దివ్యదంపతులకి ఇద్దరికిని అతడు ఆసనమేకదా ! **"శయ్యాసనం వాహనం వేదాత్మా విహగేశ్వరః"** అని స్తోత్రరత్నసూక్తి.



ధ్వజః :- భగవానుడు వేంచేయుటకు ముందే ఆ స్వామి రాకను భక్తులకు తెలియజేయు, ప్రీతిహేతువైన ధ్వజము గరుడుడు. భగవానుని రక్షకత్వమునకు హేతువు, సూచకమును అనియు చెప్పవచ్చును.

**వాహనమ్** :- ఆశ్రితుల ఆపదలలో వారిని రక్షించుటకు స్వామిని కొనివచ్చి సహాయపడు వాహన మితడు. భగవానుడు గరుడుని అధిరోహించుటకు రమణీయము లైన హేతువులను కొన్నిటిని ఆచార్యులు తెలిపిరి. గరుడుని కైంకర్యమనోరథము తీరుటకు, గరుడుని అధిరోహింపవలెను అను స్వామి ఆశ తీరుటకు, అతనిని అధిరోహించిన స్వామిని సేవింపవలెను- అను భక్తుల ఆశ సఫలమగుటకు, ఆశ్రితుల రక్షణముకొరకును. భగవానుడు అధిరోహించుట స్వామియొక్క వేదప్రతిపాద్యత్వము నకు చిహ్నము. కావుననే గరుడ వాహనోత్సవమునకు లోకమున అంతటి ప్రశస్తి కలదు. మఱియు, బంగారు వన్నె కల గరుడునిపై నీలమేఘవర్ణుడగు స్వామి ఉన్నపడు **"సువర్ణపృష్ఠే ప్రబభౌ శ్యామః పీతాంబరో హరిః, కాంచనస్య గిరేః శృంగే సతటిత్తోయదో యథా", "పొన్‌మలైయిన్ మీమిశై క్కార్‌ముకిల్ పోల"** అను విధముగా మేరుపర్వతముపై నీలమేఘము అమరియున్నట్లు శోభిల్లుటయు ఇంతటి ప్రసిద్ధికి వేఱొక కారణము.

వితానమ్ :- **"వినతై శిఱువన్ శిఱకెన్నుమ్ మేలాప్పిన్ కీழ் వరువాన్"** అనునట్లు ఆతపవర్షనివారణముగ గరుడుడు స్వామిని సేవించును. **"గరుడం చ దదర్శోచ్చైరంతర్ధానం గతం ద్విజః, కృతచ్ఛాయం హరే ర్మూర్ధ్ని పక్షాభ్యాం పక్షిపుంగవమ్"** అనుచు పరాశరమహర్షి విష్ణుపురాణమున పల్కిరికదా !

వ్యజనమ్ :- తనను అధిరోహించి భగవానుడు పయనించునపుడు చామరములవలె ఱెక్కలతో వీచి సేవించును. **"తిరునెడున్దాణ్డకమ్"** అను పరకాలసూరి ప్రబంధములోని ఆఱవ పాశురమున గల **"అమ్ శిఱైప్పుళ్"** అను ప్రయోగమును ఆచార్యులు వ్యాఖ్యానించుచు స్వామి తనపై అధిరోహించి ఊరేగునపుడు కలిగిన ఆయాసము తీరుటకై గరుడుడు తన ఱెక్కలను విసనకర్రలుగా చేసి విసరును అని పల్కుట ఇచట స్మరణీయము. అచట ప్రస్తుత స్తోత్రరత్న సూక్తిని ఉట్టంకించుటయు గమనార్హము. నరకాసురవధ సందర్భమున శ్రీకృష్ణభగవానుడు యుద్ధమున సొమ్మసిల్లినపుడు గరుడుడు తన ఱెక్కలతో వీచి, శ్రమ తీర్చెనని నాచనసోమన ఉత్తరహరివంశమున **"భుజగాంతపు ఱెక్కల**

కొక్కలాగునన్ తోడుగ తాళవృంతముల తూకొని చల్లని గాలి చల్లె" అనుచు పలికెను.

ఈ రీతిలో పలు విధముల భగవానునకు సేవచేయు గరుడుని మహిమ వర్ణనాతీతము. గరుడుడు వేదస్వరూపుడు. వేదము "వేదై శ్చ సర్వై రహ మేవ వేద్యః" అనునట్లు భగవానుని తత్త్వమును నిరూపించును. కావున అందు స్వామియొక్క స్వరూపరూప గుణవిభూతులు ప్రతిఫలించును. అట్లే గరుడుని యందును స్వామి స్వరూపరూపగుణవిభూతులు ప్రకాశించును. కావున అతడు తనకెదురుగానున్న వస్తువుల రూపమును తనయందు ప్రతిఫలింపచేయు స్వచ్ఛమైన దర్పణమువంటివాడు. ఇట్టి గరుడునియందు శ్రీరంగనాథుడు తన స్వరూపరూపాదులను దర్శించుచు, మురియుచున్నాడు- అని భట్టరు శ్రీరంగరాజస్తవపూర్వశతకమున మనోహరముగా వర్ణించిరి.

గరుడుని జన్మవృత్తాంతము పరమాద్భుతము. వ్యాఖ్యానములలో అది ప్రస్తుతింప బడుటచే ఇచట ప్రస్తావింపబడుటలేదు. గరుడుడు పుట్టినపుడు అతని దివ్యతేజో విశేషణము చూచి దేవతలందరు అగ్నియే అని భ్రమించిరి. అతని తేజస్సు అంత గొప్పది. అతడు మహాకాయులైన గజకచ్ఛపములను అవలీలగా మోసిన బలశాలి. కావుననే గరుడుడను పేరు అతనికి కల్గెనని భారతము పేర్కొనుచున్నది. ఇతడు మాతృదాస్యమును పోగొట్టుటకై స్వర్గమునకు పోయి అమృతమును సాధించి తెచ్చి మహాసాహసి. వజ్రాయుధ ప్రహారమును సైతము లక్ష్యము చేయని మహా శక్తిమంతుడు. దేవలోకముననున్న గంగానది పాతాళమువరకును ప్రవహించుటలో కారణభూతు డితడు. దేశికులు గరుడుని భగవానుని సన్నాహరూపిగా పల్కిరి.

గరుడుడు ప్రతిష్ఠింపబడని విష్ణ్వాలయములు ఉండవు. స్వామి బ్రహ్మోత్సవ ములు గరుడాత్మకమైన ధ్వజపటారోహణముతో ప్రారంభమై, దాని అవరోహణ ముతో పూర్తి అగును. శ్రీరంగము, తిరుపతి, అహోబిలము, తిరునారాయణ పురము (మేల్కోటై) మొదలగు పలు క్షేత్రములతో గరుడునకు అవినాభావసంబంధము కలదు - అని పురాణములు తెలుపుచున్నది. శ్రీరంగములోని ప్రాకారమండ పాదులన్నియు గరుడాత్మకములేనని భట్టరు వర్ణించిరి. పూర్వము తిరుపతి నగరము గరుడాకారమున నిర్మింపబడెనని పెద్దలందురు. గరుడోపాసన వలన సర్ప, దుష్టజంతు పీడలు, సకలారిష్టములు తొలగుటయేకాక సర్వశుభములు కలుగును.



ఇట్టి గరుత్మంతుని స్తుతించు పలు స్తోత్రములలో దేశికకృతములైన గరుడ **దండకము, గరుడపంచాశత్** అను రెండు స్తోత్రములు కలవు. వీనిలో మొదటిది దండకమను విశిష్టమైన ఛందస్సులో కూర్పబడినది. కమనీయమైన ఈ స్తుతికి భారద్వాజ రాజగోపాలాచార్యకృతమైన విపులవ్యాఖ్య సంస్కృతమున కలదు. దేశికులు ఈ దండకమును సంకల్పసూర్యోదయము అను తమ నాటకమునందు యథాతథముగా గైకొనిరి. అందుచే సంకల్పసూర్యోదయవ్యాఖ్యాతలచేకూడ ఈ దండకము వ్యాఖ్యానింప బడినది. వీనిలో శ్రీభాష్యనారాయణ వ్యాఖ్య ఇంతవరకు ప్రచురింపబడలేదు. మిగిలిన పూర్వము ప్రచురింపబడినను ప్రస్తుతము దుర్లభములు. ఈ వాఖ్యానములను అన్నిటిని దృష్టిలో ఉంచుకొని ప్రస్తుతం రచింపబడిన టీకా వివరణలను సాహిత్య మర్మజ్ఞులు, ఆస్తికులు ఆదరిస్తారని నమ్ముతున్నాను.

ఇట్లు, నివేదించు
సహృదయ నియోజ్యుడు
**ఈ.ఏ. శింగరాచార్యులు**

# గరుడదండకము

శ్రీమాన్ వేంకటనాథార్యః కవితార్కికకేసరీ ।
వేదాంతాచార్యవర్యో మే సన్నిధత్తాం సదా హృది ॥

నమః పన్నగనద్ధాయ వైకుంఠవశవర్తినే ।
శ్రుతిసింధుసుధోత్పాదమందరాయ గరుత్మతే ॥

(1) గరుడ మఖిలవేదనీడాధిరూఢం, ద్విషత్పీడనోత్కంఠితాకుంఠవైకుంఠ పీఠీకృతస్కంధ మీడే స్వనీడాగతిప్రీతరుద్రాసుకీర్తి స్తనాభోగగాఢోపగూఢం, స్ఫురత్కంటకవ్రాతవేధవ్యథా వేపమానద్విజిహ్వాధిపాకల్పవిష్పార్యమాణ స్ఫటావాటికా రత్నరోచిశ్ఛటారాజినీరాజితం, కాంతికల్లోల్లినీరాజితమ్.

(2) జయ గరుడ!, సుపర్ణ!, దర్వీకరాహార!, దేవాధిపాహారహారిన్!, దివౌకస్పతిక్షిప్త దంభోళిధారాకణాకల్ప! కల్పాంతవాతూలకల్పోదయానల్ప వీరాయితో ద్యచ్చమ త్కార! దైత్యారిజైత్రధ్వజారోహనిర్ధారితోత్కర్ష! సంకర్షణాత్మన్! గరుత్మన్! మరు త్పంచకాధీశ! సత్యాదిమూర్తే! న కశ్చిత్ సమ స్తే నమ స్తే పున స్తే నమః.

(3) నమ ఇద మజహత్సపర్యాయ, పర్యాయనిర్యాత పక్షానిలాస్ఫాలనో ద్వేలపాథో వీచీచపేటాహతాగాధపాతాళ భాంకారసంక్రుద్ధ నాగేంద్ర పీడాసృణీ భావ భాస్వన్నఖ శ్రేణయే, చండతుండాయ, నృత్యద్భుజం గభ్రువే, వజ్రిణే దంష్ట్రయా, తుభ్య మధ్యాత్మవిద్యా విధేయా విధేయా భవద్దాస్య మాపాదయేథాః దయేథాశ్చ మే.

(4) మనురనుగతపక్షివక్త్రస్ఫురత్తారక స్తావక శ్చిత్రభానుప్రియాశేఖర స్త్రాయతాం న స్త్రివర్గాపవర్గప్రసూతిః పరవ్యోమధామన్! బలద్వేషి దర్పజ్వలద్వాల ఖిల్య ప్రతిజ్ఞావతీర్ణ! స్థిరాం తత్త్వబుద్ధిం పరాం భక్తిధేనుం జగన్మూలకందే ముకుందే మహానందదోగ్ధ్రీం దధీథా ముధాకామహీనా మహీనా మహీనాంతక!

షట్త్రింశత్గణచరణో నరపరిపాటీనవీనగుంభగుణః ।
విష్ణురథదండకోఽసౌ విఘయతు విపక్షవాహినీ వ్యూహమ్ ॥

విచిత్రసిద్ధిద స్సోఽయం వేంకటేశవిపశ్చితా ।
గరుడధ్వజతోషాయ గీతో గరుడదండకః ॥



వేదాంతదేశికప్రణీతము

# గరుడదండకము

## హృద్యార్థదీపికావ్యాఖ్య

శ్రీమాన్ వేంకటనాథార్యః కవితార్కికకేసరీ ।
వేదాంతాచార్యవర్యో మే సన్నిధత్తాం సదా హృది ॥

నమః పన్నగనద్ధాయ వైకుంఠవశవర్తినే ।
శ్రుతిసింధుసుధోత్పాదమందరాయ గరుత్మతే ॥

పన్నగనద్ధాయ = సర్పములచే బద్ధమైనవాడు (అలంకరింపబడినవాడు), వైకుంఠవశవర్తినే = విష్ణువుయొక్క అధీనమున నుండువాడు, శ్రుతిసింధు = వేదములు అను సముద్రమునుండి, సుధ + ఉత్పాద = అమృతము పుట్టుటలో, మందరాయ = మందరపర్వతమువంటివాడు అగు (మందరపర్వతపక్షమున క్రమముగా దారముగా చేయబడిన వాసుకిచే బంధింపబడినది, భగవానుడగు విష్ణువును ఆధారముగా కల్గినది అని అర్థము), గరుత్మతే = అందమైన రెక్కలను గల గరుత్మంతునకు, నమః = నమస్కారము.

భగవద్రామానుజులకు పిమ్మట విశిష్టాద్వైతసిద్ధాంతమును ప్రచార మొనర్చిన మహనీయులగు ఆచార్యులలో వేదాంతదేశికులు అగ్రగణ్యులు. శ్రీవేంకటేశ్వరుని ఘంటావతారులుగా ప్రసిద్ధిచెందిన వీరు ఆ స్వామి పేరున వేంకటనాథులుగా పిలువబడిరి. తమకు మేనమామ అగు అప్పుళ్ళార్ (ఆత్రేయ రామానుజాచార్యుల వారు) సన్నిధిలో సకలశాస్త్రములను అభ్యసించిరి. శ్రీరంగనాథుడు స్వయముగా వీరికి వేదాంతదేశికులను బిరుదమును, శ్రీరంగనాయకి సర్వతంత్రస్వతంత్రులను బిరుదమును అనుగ్రహించిరి. మహాత్ములగు విద్వాంసులును వీరిని కవితార్కిక సింహ మను బిరుదముతో సమ్మానించిరి. వీరు రచించిన కృతులు సంఖ్యలోనే కాక విషయవైవిధ్యములోకూడ నిరూపమానమైనవి. వానిలో పలు స్తోత్రములును కలవు. అట్టి స్తోత్రములలో గరుడదండకమను ప్రస్తుతస్తోత్ర మొకటి. భగవానునకు

---

**గమనిక :** ద్రావిడ వర్ణమాలలోని 'ழ' అనే అక్షరాన్ని తెలుగులోని 'ళ' అక్షరంతో సమానంగా, 'ற்ற' అనే సంయుక్తాక్షరాన్ని 'ట్ర' అనే సంయుక్తాక్షరంతో సమానంగా, 'ற' అనే అక్షరాన్ని 'ఱ' అనే అక్షరంతో సమానంగా ఉచ్చరించవచ్చును.

కల పరివారములో "పెరియతిరువడి"గా ప్రసిద్ధి చెందిన గరుత్మంతుని దండక మను ఛందోవిశేషప్రక్రియద్వారా స్తుతించుట ఇందలి విషయము.

ఈ స్తోత్రమును దేశికులు రచించుటకు గల కారణమును సంస్కృత వ్యాఖ్యాత ఇట్లు వివరించెను. కాంచీపురమున శ్రీదేశికులు నివసించు కాలమున ఒకానొక సమయమున దేశికుల ప్రసిద్ధిని చూచి సహింపలేని కొందు వ్యక్తులు అహంకారి అగు ఒక పాములవానిని ప్రోత్సహించి, అతనిని దేశికులపైకి పంపిరి. అతడు తనవద్దగల భయంకరవిషసర్పములను దేశికులపై ప్రయోగించెను. అపుడు దేశికులు గరుడుని ధ్యానించి, తదనుగ్రహమువలన ఆ సర్పములను, పాముల వానిని నిగ్రహించి, తమనట్లు అనుగ్రహించిన గరుడుని ఒక శ్లోకముతో కూడిన దండకముతో స్తుతించిరి.

మణిప్రవాళవ్యాఖ్యాత వివరణమున కొంచెము భేదము కనుపించుచున్నది. శత్రువులచే పంపబడిన సర్పజీవి తనవద్దగల విషసర్పములను ప్రయోగించినను అవి దేశికులను చేరలేకపోయినవి. అపుడతడు శంఖపాలుడను అత్యంత శక్తివంతమైన సర్పమును దేశికులపై ప్రయోగింపగా, ఆ సర్పము తనను సమీపించుటను చూచిన దేశికులు రక్షణకొఱకు గరుడుని ప్రస్తుత దండకరూప మున స్తుతించిరి. తత్ఫలితముగా గరుడుడు ప్రత్యక్షమై ఆ శంఖపాలుని పట్టి కొనిపోయెను. దానిని చూచిన సర్పజీవి భయభ్రాంతుడై, దేశికుల పాదములపై పడి క్షమింపవేడెను. పరుల ప్రోత్సాహమువలన తానట్లు చేసితినే కాని, స్వయముగా కాదని, తన జీవితమునకు ఆధారమగు ఆ సర్పమును తనకు మరల అనుగ్రహింపవలసినదని ప్రార్థించెను. దేశికులు అతనిపై దయ చూపి, మరల గరుడుని ప్రార్థించి, శంఖపాలుని అతనికి తిరిగి ఇచ్చిరి.

దేశికులు తాము చేయదలచిన దండకస్తుతి నిర్విఘ్నముగా పరిసమాప్తము అగుటకై గరుడునకు నమస్కరించుట ప్రస్తుతశ్లోకములోని విషయము. ఇందు కవి గరుడుని మందర పర్వతమునగా రూపించుట విశేషము.

సర్పములచే అలంకరింపబడినవాడు, భగవానుని అధీనమున నున్నవాడు అగు గరుడుడు వాసుకి అను త్రాటిచే చుట్టబడిన, కూర్మరూపి అగు భగవానుని ఆధారముగా గల మందరపర్వతమువలె నున్నాడు. మందరపర్వతము పాల సముద్రము నుండి అమృతము పుట్టుటకు కారణమైనట్లే, వేదములను క్షీర సముద్రమునుండి అమృతమువంటి అర్థవిశేషములు ప్రకాశించుటకు గరుడుడు కారణము. అట్టి మహిమ గల గరుడునకు నమస్కారము.



గరుడుని మందరపర్వతముతో రూపించుటకు అనుగుణముగా కవి శ్లోకములోని మొదటి పాదమున రెండు శ్లిష్ట విశేషణములను ప్రయోగించిరి.

**(పన్నగనద్ధాయ)** - పన్నగమనగా పాము అని, నద్ధ మనగా చుట్టబడినది అని అర్థము. సర్పభూషితుడని భావము. గరుడునకు కర్కోటక, పద్మ, మహాపద్మాది సర్పములు భూషణము లనుటను **"వామే వైకుంఠశయ్యాఫణి పతికటకో....."** ఇత్యాది గరుడపంచాశత్ శ్లోకమున దేశికులు అభివర్ణించిరి. పాంచరాత్రమును **"అనంతో వామకటకో యజ్ఞసూత్రం తు వాసుకిః, తక్షకః కటిసూత్రం తు హారః కార్కోటక స్తథా, పద్మో దక్షిణకర్ణే తు మహాపద్మ స్తు వామతః, శంఖః శిరఃప్రదేశే తు గుళిక స్తు భుజాంతరే, ఏతై రష్టవిధై ర్నాగైః భూషితం భుజగోత్తమైః"** అని తెల్పినది. మందరపర్వతపక్షమున సర్పముచే చుట్టబడినది- అని అర్థము. దేవతలు, రాక్షసులు పాలసముద్రమును చిలుకుటకై మందర పర్వతమును కవ్వముగా, వాసుకి అను సర్పరాజును దారముగా చేసికొనిన పౌరాణికగాథ ఇచటి స్మరణీయము. **"మంథానం మందరం కృత్వా యోక్త్రం కృత్వా చ వాసుకిమ్"** అను సుప్రసిద్ధ శ్లోక మిచట స్మరణార్హము.

**(వైకుంఠవశవర్తినే)** **"విగతా కుంఠా నాశః అస్య, వికుంఠం జ్ఞానం స్థానం వా అస్తి స్వరూపత్వేన ఆశ్రయత్వేన నా అస్య, యద్వా, కుంఠానాం జీవానామ్ అయం నియంతా జ్ఞానదో వా"** అని అమరసుధ వైకుంఠశబ్దమును నిర్వచించుచున్నది. ఇట్లు సమస్తజీవులకు నియంతయు, జ్ఞానప్రదాయకుడును అను అర్థ మిచ్చు వైకుంఠ శబ్దముయొక్క ప్రయోగము ఇచటి సాభిప్రాయకము అనవచ్చును. **"సర్వేషాం సంశ్లేషయితృతయా వికుంఠానాం విగతసంశ్లేషవిఘాతానామ్ అయ మితి వైకుంఠః"** అని నిరుక్తము ఈ శబ్దమును నిర్వచించినది. గరుడుడు భగవానుని అధీనమునుండు స్వభావమును కలవాడు అనుటను **"వర్తినే"** అను పదములోని **"ఇన్"** ప్రత్యయము తెలుపును. **"దాస స్సఖా వాహన మాసనం ధ్వజో య స్తే వితానం వ్యజనం త్రయీ మయః"** అను శ్రీయామునసూక్తి చొప్పున గరుడుడు భగవానునకు వశుడై, దాసుడై, సఖుడై, వాహనమై, ఆసనమై, ధ్వజమై, మేలుకట్టై, విసనకఱ్ఱయై మారి సకలవిధసేవలను సర్వకాలములయందు చేయును కదా!

మందరపర్వతపక్షమున భగవానుని ఆశ్రయముగా గల స్థితిని కలదని భావము. మందరపర్వతము బరువువలన పాలసముద్రములో మునిగిపోవుటను చూచిన దేవతలు భగవానుని సహాయపడవలసినదిగా ప్రార్థింపగా, స్వామి కూర్మ

రూపమును దాల్చి, తన వీపుపై మందరపర్వతమును ధరించి, దానిని సముద్రమున మునగ కుండునట్లు చేసెను. ఆ ఉదంత మిచట వివక్షితము. **"ప్రవివేశాథ పాతాళం మంథానః పర్వతోఽనఘ, తతో దేవాః సగంధర్వాః తుష్టువుః మధు సూదనమ్", "శ్రుత్వా హృషీకేశః కమఠం రూప మాస్థితః, పర్వతం పృష్ఠతః కృత్వా శిశ్యే తత్రోదధౌ హరిః"** అను శ్రీరామాయణవచనము ఇచట స్మరణీయము. అంతియేగాక, సముద్రమున మందరపర్వతభ్రమణమును భగవదధీనమేనని ఇచట ధ్వనించుచున్నది. **"మందరాద్రే రథిష్ఠానం భ్రమతోఽభూ న్మహామునే!"** అని విష్ణుపురాణము తెలుపుచున్నది.

**(శ్రుతిసింధు ..... మందరాయ)** - గరుడుని పర్వముగా రూపించినట్లే వేదములను సముద్రముగా కవి రూపణము చేసిరి. దీనివలన వేదార్థమలు అమృతము వలె స్వాదువులు, సుమనోభోగ్యములను విశేషము ధ్వనించుచున్నది. ఇంకను పలు విధములైన సామ్యములను ఇచట చెప్పనగును. సముద్రములోని లోతు తెలియనట్లే, వేదములు అర్థములోని లోతును తెలియరానిది. సముద్రము అవధి లేనిదైనట్లే, వేదములును **"అనంతా వై వేదాః"** అనునట్లు అపరిమితములు. **"శ్రూయతే నిత్యమ్"** అను వ్యుత్పత్తివలన వేదముయొక్క అవిచ్ఛిన్నత్వము సూచితము. ఈ గుణము సింధువునకు కలదు. గరుత్మంతుని మందర పర్వతముగా నిరూపించుటవలన, జ్ఞానమును సుధగా నిరూపించుటవలన భగవానుడు గరుత్మంతునిద్వారా వేదాంత జ్ఞానమును లోకమున ప్రవర్తింప చేసెనని ధ్వనించుచున్నది.

**(మందరాయ)** - కవ్వముగా నున్న మందరమని తాత్పర్యము.

**(గరుత్మతే)**- ఱెక్కలను కలవాడను అర్థము సామాన్యమైనది. ఇచటి ప్రశంసార్థక మైన **"మతుప్"** ప్రత్యయమువలన అతిశయమును తెలియుచున్నది. **"భూమ నిందాప్రశంసాసు నిత్యయోగేఽతిశాయనే, సంసర్గేఽస్తి వివక్షాయాం భవంతి మతుబాదయః"** అను సూక్తి ఇచట స్మరింపతగినది. మఱియు, గరుత్మత్ శబ్దము వలన **"సుపర్ణోఽసి గరుత్మాన్ త్రివృత్తే శిరః"** ఇత్యాదిగా శ్రుతులయందు వర్ణింప బడిన వైభవము స్మారిత మగుచున్నది. ఆంధ్రమహాభారతములోని ఆదిపర్వమునను **"ఆతతపక్షమారుతరయః ప్రవికంపిత ఘూర్ణితాచలవ్రాతమహోర్ణవుండు"** ఇత్యాదిగా గరుత్మంతుని ఱెక్కల శక్తి వర్ణింపబడుటను గమనింపనగును. **"గిరతి గగనమ్ ఇతి గరుత్, గౄ-నిగరణే"** అను వ్యుత్పత్తినిబట్టి ఆకాశమును



గ్రసించునది - అను అర్థమును గరుచ్ఛబ్ద మిచ్చును. అట్టి శక్తి ఒక్క గరుత్మంతుని రెక్కలకే కలదు. మరియు వజ్రాయుధము దెబ్బకుకూడ చలింపనివి కదా ఆ ఱెక్కలు. **"ఉభాభ్యా మేవ పక్షాభ్యాం యథా ఖే పక్షిణాం గతిః, తథైవ జ్ఞానకర్మభ్యాం ప్రాప్యతే పురుషోత్తమః"** అను సూక్తివలన తత్త్వజ్ఞాని అను పక్షికి గల రెండు ఱెక్కలు జ్ఞానము, కర్మము- అని తెలియుచున్నది. వేదాత్మకుడగుటచే గరుడుని జ్ఞానవైభవము, భగవానునకు అన్ని విధముల సేవ చేయు దాసులలో అగ్రగణ్యుడగుటచే కైంకర్యవైభవమును స్పష్టము. ఇట్లు ఈ విధముగా కూడ గరుడుడు ప్రసస్తమైన రెక్కలను గలవాడు. కావుననే తన రెక్కలనిన గరుత్మంతునకు మిక్కిలి ఇష్టమట. **"తార్క్ష్యపక్షతివదస్య వల్లభామ్"** అని పరాశరభట్టర్ పల్కిరికదా! పూర్వము పర్వతము లన్నిటికి రెక్కలుండెడివి. ఈ విధముగా కూడ మందరపర్వతము గరుత్మంతులమధ్య సామ్యము కలదు. ఇట్లు గరుత్మత్ శబ్దము శ్లిష్టమగుటచే విశేష్యమును శ్లిష్టము.

**(నమః)** ఈ పదము స్తోత్రకర్తచే వివక్షితమగు ఆకించన్య, అనన్యగతిత్వాది స్వరూపపూర్తిని తెలుపును. భాగవతములోని **"ద్వ్యక్షరస్తు భవేత్ మృత్యుః త్ర్యక్షరం బ్రహ్మణః పదమ్, మమేతి ద్వ్యక్షరో మృత్యుః న మమేతి చ శాశ్వతమ్"** అను సూక్తి ఇచట స్మరణీయము. పైన వర్ణింపబడిన వైభవమును కల గరుత్మంతుని ఇష్టార్థసిద్ధి కొఱకు నమస్కరింతునని తాత్పర్యము. ఇచటి ఇష్టార్థసిద్ధి పారమార్థికమే, భౌతికము కాదు. నమశ్శబ్ద ప్రయోగముద్వారా దేశికులు ఈ స్తోత్రప్రారంభములో మంగళా చరణమును చేసినట్లయినది. దీనివలన **"మంగళాదీని మంగళమధ్యాని మంగళాం తానిచ శాస్త్రాణి ప్రథంతే"** ఇత్యాది శాస్త్రమర్యాద పాటింపబడినట్లయినది.

ఈ శ్లోకమున మందరపర్వతముగా గరుత్మంతుని రూపించుట సముద్రముగా వేదములను రూపించుటపై ఆధారపడుటచే సమస్తవస్తు విషయకమైన సావయవ రూపకాలంకారము కలదు. శ్రుత్యర్థము అమృతముగా నిగీర్యాధ్యవసిత మగుటచే రూపకాతిశయోక్తియు కలదు. ఈ అతిశయోక్తివలన పైన పేర్కొనబడిన రూపకము అనుప్రాణితమగుచున్నది. కావున ఈ రెండింటి యొక్క సంకరము ఇందు కలదు. అంతియేగాక, శ్లోకమున కవికి గరుత్మంతునిపై గల భక్తిరూపము ధ్వనించుటచే భావధ్వనియు కలదు. వృత్తము పథ్యావక్త్ర మను అనుష్టుప్ భేదము. **"యుజో ర్జ్యేన సరిద్భర్తుః పథ్యావక్త్రం ప్రకీర్తితమ్"** అని లక్షణము.

మణిప్రవాళవ్యాఖ్యలో సర్పమువలన తమకు ఎట్టి ఆపద రాకుండుటకై కవి "పన్నగనద్ధాయ" అని, ఆ సర్పములు తమను స్పృశించినను విషమువలన ఎట్టి అపాయము ఏర్పడకుండుటకై "సుధోత్పాదమందరాయ" అనియు దేశికులు పల్కెరని తెలుపబడినది.

**(1) గరుడ మఖిలవేదనీడాధిరూఢం, ద్విషత్పీడనోత్కంఠితాకుంఠవైకుంఠ పీఠీకృతస్కంధ మీడే స్వనీడాగతిప్రీతరుద్రాసుకీర్తి స్తనాభోగగాఢోపగూఢం, స్ఫురత్కంటకవ్రాతవేధవ్యథా వేపమానద్విజిహ్వాధిపాకల్పవిష్ఫార్యమాణ స్ఫటావాటికా రత్నరోచిశ్ఛటారాజినీరాజితం, కాంతికల్లోలినీరాజితమ్.**

అఖిలవేద = సమస్తవేదములు అను, నీడ +అధిరూఢం = గూటిలో నివసించు, ద్విషత్పీడన = శత్రువులను పీడించుటలో, ఉత్కంఠిత = మిక్కిలి ఆసక్తిని కల, అకుంఠ= అడ్డు లేని సామర్థ్యమును కల, వైకుంఠ= విష్ణువునకు, పీఠీకృత = ఆసనముగా చేయబడిన, స్కంధం = రెండు ప్రక్కలను (పార్శ్వములను) కలవానిని, స్వనీడాగతి = తన గూటికి వచ్చుటచే, ప్రీత = సంతోషించిన, రుద్రాసుకీర్తి = రుద్ర, సుకీర్తి అను భార్యలయొక్క, స్తన+అభోగ= స్తనభారముల, గాఢ+ఉపగూఢం = గాఢమైన ఆలింగనములను కలవానిని, స్ఫురత్కంటక = స్ఫుటముగా కనపడు పులకలయొక్క, వ్రాత = సమూహము యొక్క, వేధవ్యథా = గుచ్చుకొనుటచే కల్గిన బాధచే, వేపమాన = కంపించు, ద్విజిహ్వ+అధిప = సర్పరాజులు అను, అకల్పః = ఆభరణములచేత, విష్ఫార్యమాణ = విస్తృతముగా చేయబడిన, స్ఫటావాటికా = పడగల వరుసలోని, రత్న = రత్నముల, రోచిస్ = కాంతులయొక్క, ఛటా = ప్రరోహములయొక్క, రాజి = రేఖలచే, నీరాజితం = హారతి ఇవ్వబడినవానిని, కాంతికల్లోలినీ = కాంతి అను నదిచే, రాజితం = ప్రకాశింప చేయబడినవానిని అగు, గరుడం = గరుడుని, ఈడే = స్తుతింతును.

గరుడదండక మను ఈ స్తోత్రములోని మొదటి చరణమిది. ఇందు దేశికులు గరుడుని శక్తిని, శత్రువులను సంహరించు సామర్థ్యమును, భక్తుల కష్టములను పోగొట్టు కరుణను స్తుతించుచు, తన పత్నులను ఆలింగనము చేసికొనుటచే కల్గిన ఆనందసందోహముతో నిండిన మనస్సును కలవాడగుటచే గరుడుడు తమ అభీష్టములను తీర్చుటయందు అభిముఖ్యమును కల్గియున్నాడని పల్కుచున్నారు.



గరుడుడు వేదములు అను గూటిలో నివసించువాడు. శత్రువులను సంహరించుటలో ఉత్కంఠను కల విష్ణువునకు ఆసనముగా చేయబడిన స్కంధ భాగమును కలవాడు. అతడు తమ వద్దకు వచ్చుటచే మిక్కిలి సంతోషించిన భార్యలగు రుద్రాసు కీర్తులు తమ స్తనాభోగముతో గాఢముగా ఆలింగనము చేసికొనగా అపుడు కల్గిన సంతోషమువలన గరుడునకు రోమాంచము కలిగెను. ఆ రోమాంచమువలన గరుడుని ఆభరణములవలె చుట్టియున్న సర్పరాజులకు మిక్కిలి బాధకల్గెను. అపుడు ఆ సర్పరాజులు తమ పడగలను విప్పగా అందలి రత్నములయొక్క కాంతుల వరుస గరుడునకు హారతి ఇచ్చినట్లుండెను. ఆ కాంతి ఒక నది వలె ప్రకాశించెను. అట్టి వైభవమును కల గరుడుని స్తుతింతును - అని తాత్పర్యము.

**(అఖిలవేదనీడాధిరూఢమ్)- "అఖిల"-** సమస్తమని అర్థము. **"న ఖిలః అఖిలః"** అను విగ్రహమును చెప్పిన వేదము నశింపనిది, ప్రవాహనిత్యత్వమును కల్గినది, ఎల్లప్పుడును అధ్యయనము చేయబడునది- అను అర్థవిశేషములు స్ఫురించును. ఇచట నఞ్‌నకు తద్భిన్నత్వమును అర్థముగా గ్రహింపనగును. ఈ విశేషణమునకు సకలవేదప్రతిపాద్యుడని అర్థము. **"వేదాత్మా విహగేశ్వరః"** అని యామునులు వచించిరికదా! గరుడుని వేదాత్మకత్వమును**"వహేయం యజ్ఞాన్ ప్రవిశేయం వేదాన్", "సుపర్ణోఽసి గరుత్మాన్"** ఇత్యాది శ్రుతులు తెలుపుచున్నవి. ఇచట వేదశబ్దము వేదోపబృంహణమగు పాంచరాత్రమునకును ఉపలక్షకము. ఆ శాస్త్రమున **"పక్షౌ యస్య బృహత్సామ రథంతర మపి ద్వయమ్"** ఇత్యాదిగా గరుడుని వేదరూపత్వము తెలుపబడినది. దేశికులును గరుడపంచాశత్ స్తోత్రమున **"నేత్రం గాయత్ర మూచే శ్రుతిశతశిఖరాభిష్టుతాత్మా గరుత్మాన్"** అనుచు ఈ అంశమును అనుసంధించిరి. గరుడులు పక్షిజాతికి చెందిన వారగుటచే అందుల కనుగుణముగా వేదములు గూటితో పోల్చబడినవి. అంతియే గాక, **"నితరామ్ ఈడ్యతే ఇతి నీడః"** అను నీడశబ్దవ్యుత్పత్తి వేదమునకును తగియుండుట ఇచట గమనింపతగినది. **"అఖిలవేదనీడాధిరూఢమ్"** అనుటకు **"వేదార్థభూతం, యత్ర విశ్వం భవతి ఏకం నీడ మిత్యుక్తం, భగవంత మాశ్రిత్య ఇత్యర్థః, యద్వా, సర్వజగదాశ్రయః వేదార్థరూపో భగవాన్ అధిరూఢో వాహ్యో యస్య సః ఇతి"** అని సంస్కృతవాఖ్యలో కలదు. దీనినిబట్టి వేదార్థభూతుడైన, సర్వజగద్రూపుడైన భగవానుని ఆశ్రయించినవాడు, ఆ స్వామిని మోయువాడు అనియు చెప్పవచ్చును. ఈ అర్థమున **"అఖిల, వేద, నీడ"** శబ్దములచే భగవానుడు బోధింపబడుచున్నాడు.

**(ద్విషత్పీడనోత్కంఠితా ...... స్కంధం)** - భగవానుడు **"దేవానాం దానవానాం చ సామాన్య మధిదైవతమ్"** అనునట్లు అందఱికిని దైవమే. కావున శత్రువు లెవ్వరు ఉండుటకు అవకాశము లేదు, అయినను, తన భక్తులపట్ల అపచార మొనర్చువారిని భగవానుడు తన శత్రువులుగా తలచును. కావుననే శ్రీకృష్ణభగవానుడు దుర్యోధను నితో **"ద్విషదన్నం న భోక్తవ్యం..... పాండవన్ ద్విషసే రాజన్!, మమ ప్రాణా హి పాండవాః"** అని పల్కెను. ఆశ్రితులకు కల్గు బాధలను తీర్చుటలో, వారిని హింసించువారిని దండించుటలో భగవానుడు మిక్కిలి అభినివేశమును, తొందరను కల్గియుండును. సర్వశక్తి అగు భగవానునకు కూడ సహాయమొనర్చుననుటచే గరుడుని మహిమాతిశయము తెలుపబడినది. ఆ ప్రయత్నమున స్వామి గరుడుని స్కంధమును తన కాసనముగా చేసికొని పయనించును. **"ధ్వజం మే భవ సదా త్వ మేవ విహగేశ్వర!, ఉపరిష్టాత్ స్థితి స్తేఽస్తు మమ పక్షీంద్ర! సర్వదా"** అనుచు స్వామి గరుడుని స్కంధమును తనకు ఆసనముగా చేసికొనెను- అని భారతము తెలుపుచున్నది. లేక, గరుత్మంతుడే స్వయముగా తన స్కంధమును భగవానునకు ఆసనముగా చేయుననియు చెప్పవచ్చును. ఇచట **"ద్విషత్పీడనోత్కంఠితః, అకుంఠవైకుంఠ పీఠీకృత స్కంధః"** అని విశేషణో భయపదముగా అన్వయింప వీలున్నను, ఈ చరణములోని మిగిలిన విశేషణములన్నియు వ్యస్తములుగా నుండుటచే దీనినికూడ అట్లే అన్వయించుట స్వరసము. ఈ విశేషణముద్వారా కవి గరుడుని స్వాభిమతార్థ ఘటకత్వమును సూచించిరి.

ఇట్లు భగవానునకు యుద్ధయాత్రలో ఉపకరించుటకై గరుడుడు వెడలి నపుడు, తద్విరహమువలన సంతప్తలైన రుద్రాసుకీర్తులను గరుడపత్నులు విజయపూర్వముగా గరుడుడు తిరిగి వచ్చుటను చూచి ఆనందాతిశయముతో గాఢముగా స్వయముగా కౌగిలించుకొనుట, అందువలన గరుడునకు నిరతిశయ సుఖము కల్గుట అనంతర విశేషణమువలన తెలియుచున్నది.

**(స్వనీడా... నీరాజితం)** శ్రీరామచంద్రుడు జనస్థానమున పదునాల్గు వేల రాక్షసులను సంహరించి, తిరిగి వచ్చుటను చూచిన సీతాదేవి **"తం దృష్ట్వా శత్రుహంతారం ...బభూవ హృష్టా వైదేహీ భర్తారం పరిషస్వజే"** అనునట్లు మిక్కిలి సంతోషించినదై, భర్తను స్వయముగా ఆలింగనము చేసికొనినట్లే, ఇచటను గరుడుడు విజయోత్సాహముతో తిరిగి రాగా రుద్రాసుకీర్తులు సంతోషముతో గాఢాలింగన మొనర్చుకొనిరి. అచింతితముగ లభించిన పత్నీపరిరంభణము



గరుడునకు పులకలు కల్గించినది. గరుడునకు తన రెక్కలవలె రుద్రాసుకీర్తులను పత్నులన్నను మిక్కిలి ఇష్టము. ఈ సందర్భమున కవి కంటక శబ్దమును ప్రయోగించుట గమనింపదగినది. ఈ శబ్దము **"కంటకః .... రోమాంచే చ ద్రుమాంగే చ"** అను విశ్వనిఘంటువు ప్రకారము రోమాంచమును, ముల్లును తెలుపును. గరుడుని రోమాంచములు ముళ్లవలె గుచ్చుకొనుటచే, అతనికి ఆభరణమువలె చుట్టియున్న సర్పరాజులు బాధను పొంది, తమ పడగలను విప్పినవి. గరుడునకు సర్పములు ఆభరణములనుట ఈ స్తుతిలోని మొదటి శ్లోకములోగల **"పన్నగనద్ధాయ"** అను ప్రయోగమువలన, **"వామే వైకుంఠశయ్యా"** ఇత్యాది గరుడపంచాశత్ శ్లోకమువలన తెలియుచున్నది. సర్పరాజుల పడగలలోని రత్నముల కాంతులచే గరుడునకు విజయోత్సవమున దృష్టిదోష పరిహారార్థము మంగళనీరాజనము ఇవ్వబడినదనుటచే ఇచట అతిశయోక్తి కలదని చెప్పనగును. సర్పములు ద్విజహ్వలగుట భారతములోని అమృతహరణవృత్తాంతము తెలుపుచున్నది. స్వర్గమునుండి తాను తెచ్చిన అమృతకలశమును దర్భలపై ఉంచి, గరుడుడు వెడలిపోగా, సర్పములు స్నానము చేసి, పిమ్మట అమృతమును భుజింప వలెను నియమముచే స్నానమునకై పోయిరి. ఇంతలోగా దేవేంద్రుడు వచ్చి అమృతమును తీసికొనిపోయెను. అపుడు ఒకటి, రెండు బిందువులు దర్భలపై చిందగా, తిరిగి వచ్చిన సర్పములు అమృతము కన్పింకపోవుటచే దర్భలపైనున్న అమృతబిందువులను నాకినవి. అపుడు వాని నాలుక చివర రెండుగా చీలెను. అప్పటినుండి అవి ద్విజిహ్వ లయ్యెను. ఈ ఉదంతము **"సోమస్థాన మిదం చేతి దర్భాన్ తే లిలిహుః తదా, తతో ద్విధా కృతా జిహ్వా సర్పాణాం తేన కర్మణా"** అని శ్రీభారతమున తెలుపబడినది. **"ద్విజిహ్వాకల్ప"** అనునపుడు **"ద్విజిహ్వా ఏవ ఆకల్పా"**- సర్పములే ఆభరణములు అను అవధారణాపూర్వపద కర్మధారయ సమాసమును చెప్పనగును. అప్రకృతములగు ఆభరణములకు స్వతస్సిద్ధముగా (సర్పములు) పడగలను విప్పుటలో కారణమగుటకు అవకాశము లేదు. కావున ప్రకృతములగు సర్పరూపమున అవి పరిణమించుట అపేక్షితమగుటచే పరిణామాలంకారము ఇచట కలదు.

**(కాంతికల్లోలినీరాజితమ్)** - కాంతిని నదితో పోల్చుటచే ఉపమాలంకారము. **"నీరాజితమ్", "కాంతికల్లోలినీరాజితమ్"** అనుటచే ఛేకానుప్రాస, **"ద్విషత్పీడ నోత్కంఠిత'** అను విశేషణమున **"ఠ"**కారము పలుమార్లు ఆవృత్తమగుటచే వృత్త్యనుప్రాసయు కలవు. అట్లే, **"వేదనీడ"** అనునపుడు ఉపమయు కలదు. ఈ

అలంకారముల పరస్పరనైరపేక్ష్యముచే తిలతండులరూపమైన సంసృష్టి కూడ కలదు.

"స్వనీడాగతిప్రీత" అను విశేషణమున రుద్రాసుకీర్తులకు, గరుడునకు మధ్య కల పరస్పరవిషయకమైన రతి అను స్థాయి, విభావములచే, గాఢాలింగనాది అనుభావము లచే, రోమాంచాదులనెడి సాత్త్వికభావములచే, "ప్రీతి" అను పదముచే వ్యక్తమైన హర్షమను వ్యభిచారిభావముచే పరిపుష్టమై శృంగారరస రూపమును పొందుచున్నది. ఈ శృంగారరసము కవికి గరుడునిపట్ల గల భక్తిరూప రతికి అంగమగుటచే ఇందు రసపదలంకారము అను గుణీభూతవ్యంగ్యవిశేషము కలదు.

**(2) జయ గరుడ!, సుపర్ణ!, దర్వీకరాహార!, దేవాధిపాహారహారిన్!, దివౌకస్పతిక్షిప్త దంభోళిధారాకణాకల్ప! కల్పాంతవాతూలకల్పోదయానల్ప వీరాయితోద్యచ్చ మత్కార! దైత్యారిజైత్రధ్వజారోహనిర్ధారితోత్కర్ష! సంకర్షణాత్మన్! గరుత్మన్! మరుత్పంచకాధీశ! సత్యాదిమూర్తే! న కశ్చిత్ సమ స్తే నమ స్తే పున స్తే నమః.**

సుపర్ణ =గొప్ప ఱెక్కలను కలవాడా !, దర్వీకరాహార= పాములను ఆహారముగా కలవాడా !, దేవాధిప+ఆహారహారిన్ = దేవతలకు ప్రభువగు ఇంద్రునకు ఆహారముగు అమృతమును హరించినవాడా ! దివౌకస్పతి = దేవేంద్రునిచే, క్షిప్త= ప్రయోగింపబడిన, దంభోళిః= వజ్రాయుధముయొక్క, ధారా = అంచుయొక్క దెబ్బలచే ఏర్పడిన, కిణ+అకల్ప = కాయలను ఆభరణముగా కలవాడా ! కల్పాంత వాతూల = ప్రళయ కాలములోని గాలివలె, ఉదయ = ఉత్పత్తిని కల, అనల్ప = అంతులేని, వీరాయిత = వీర్యముచే, ఉద్యత్ చమత్కార = ఉదయించిన చమత్కారమును కలవాడా !, దైత్యారి = విష్ణువుయొక్క, జైత్ర = విజయమునకు (సూచకమగు) ధ్వజ+ఆరోహ = ధ్వజమును అధిరోహించుటచే, నిర్ధారిత =నిశ్చయింపబడిన, ఉత్కర్ష = మహిమను కలవాడా ! సంకర్షణాత్మన్ = సంకర్షణస్వరూపా !, మరుత్ పంచక+అధీశ = ప్రాణము మొదలగు అయిదు విధములైన వాయువులకు అధిష్ఠానదైవమా !, సత్యాదిమూర్తే = సత్యము మొదలగు అయిదు విధములైన మూర్తులను కలవాడా!, గరుత్మన్ = గొప్ప ఱెక్కలను కలవాడా! హే గరుడ = ఓ గరుడా !, జయ= సర్వోత్కర్షతో వెలుగొందుదువు గాక !, తే= నీకు, సమః = సమానుడు, వ కశ్చిత్ = ఎవ్వడును లేడు, తే = నీకు, నమః = నమస్కారము, పునః =మరల, తే = నీకు, నమః= నమస్కారము.



యుద్ధమునుండి తిరిగి వచ్చిన గరుడునకు మంగళాశాసనమును నిరుప మానములగు సంబోధనలద్వారా చేయుట ఈ చరణములోని ప్రధానాంశము.

గొప్ప ఱెక్కలను కలవాడా! సర్పములను ఆహారముగా కలవాడా! ఇంద్రునకు ఆహారమగు అమృతమును హరించినవాడా! ఇంద్రునిచే ప్రయోగింపబడిన వజ్రాయుధముయొక్క అంచు తగులుటచే ఏర్పడిన కాయలను (కిరణములను) ఆభరణముగా కలవాడా! ప్రళయకాలములో పుట్టు వాయువువంటి జన్మప్రకారమును కలవాడా! సాటి లేని వీర్యముచే కల్గిన సామర్థ్యమును కలవాడా! విష్ణువుయొక్క విజయమునకు సూచకమగు ధ్వజమున నుండుటచే తెలిసికొన బడిన మహిమను కలవాడా! సంకర్షణరూపా ! ప్రాణము మొదలగు అయిదు విధములైన వాయువులకు అధిదైవములగు సత్యము మొదలగు అయిదు విధములైన రూపములను కలవాడా! గరుత్మంతుడా! సర్వోత్కృష్టతో వెలుగొందుము. నీకు సాటి ఎవ్వరును లేరు. నీకు నమస్కారము. మరల నమస్కారము- అని భావము.

**(సుపర్ణ)** గరుడుని అమృతహరణముచే కోపించిన ఇంద్రుడు వజ్రాయుధమును ప్రయోగింపగా, అపుడు ఆ ఆయుధమునకు సమాధానముగా గరుడుడు తన ఱెక్కలను అడ్డు నిలిపెను. కావున గరుత్మంతునకు సుపర్ణుడను పేరు కల్గెను. ఈ విషయము "**వజ్రస్య చ కరిష్యామి తవ చైవ శతక్రతో ! ఏతత్పత్రం త్యజామ్యేకం యస్యాంతం నోపలప్స్యతే, తదుత్కృష్టా మభిప్రేక్ష్య తస్య వర్ణ మనుత్తమమ్, హృష్టాని సర్వభూతాని నామ చక్రే గరుత్మతః, సుపర్ణం పత్ర మాలక్ష్య సుపర్ణోఽయం జయత్వితి**" అను శ్రీమహాభారతశ్లోకమువలన వ్యక్తమగుచున్నది. వజ్రాయుధము దెబ్బకు సైతము చలింపని గరుడుడు ఆ ఆయుధముపై, ఇంద్రునిపై నున్న గౌరవము కారణముగా ఒక ఈకను మాత్రమువ వదలెనట. అట్టి శక్తివంతమైన ఱెక్కలను కల్గిన వాడగుటచే గరుత్మంతుడు సుపర్ణుడయ్యెను. ఇట్లు ఈ నామము గరుత్మంతుని అసాధారణశక్తిని తెలుపును. ఈ అంశమును దేశికులు గరుడపంచాశత్‌లోని "**యః స్వాంగే సంగరాంతః**" అను శ్లోకమున తెలియజేసిరికదా! సుపర్ణశబ్దము సాత్వత సంహితలో గరుడవ్యూహవిశేషమును తెలుపునని చెప్పబడినను ఇచట గరుత్మంతునకు పర్యాయముగా ప్రయోగింపబడినదని తెలియనగును.

**(దర్వీకరాహార)** - గరుత్మంతుడు పాములను ఒకేసారి భుజింప ప్రయత్నించగా, సర్పములు భయపడి, దినమున కొక సర్పము చొప్పున అతనికి

ఆహారము కాగలమని గరుత్మంతుని ప్రార్థించినవి. గరుడుడు అందులకు సమ్మతించెను. ఈ అంశము గరుడపంచాశత్‌లోని **"పాయా న్నః ప్రత్యహం తే కమపి విషధరమ్"** అను శ్లోకమున ప్రస్తావింపబడినది.

**(దేవాధిపాహారహారిన్)** - ఇంద్రునకు ఆహారమగు అమృతమును హరించుటను స్తుతించుట ఎట్లు తగును? అనినచో తల్లి దాస్యమును బాపుట కొఱ కగుటచే ఇచట స్తుతింపబడినది- అని చెప్పనగును. మఱియు అనంతర విశేషణమున కిది మూలము. **"మనోజనా అయమాన ఆయసీ మతరత్ పురమ్ దివం సుపర్ణో గత్వా య సోమం వజ్రిణ ఆభరత్"** అని వేదము, **"అచ్ఛినత్ తరసా మధ్యే సోమ మభ్యద్రవత్తతః, ఉత్పపాత జవేనైవ యంత్ర మున్మథ్య వీర్యవాన్"** అని పంచమవేదమును ఈ వృత్తాంతమును స్తుతించినవి.

**(దివౌకస్పతి.... కిణాకల్పః)** - కిణ మనగా శరీరమున కాయవలె గట్టిపడిన భాగము. ఇంద్రుడు ప్రయోగించిన వజ్రము తగిలిన చోట గరుత్మంతుని శరీరము గట్టిపడి కాయగా మాఱెను. అదియే కిణము. ఆ కిణము గరుడుని పరాక్రమము నకు, ధైర్యమునకు చిహ్నమగుచే గొప్ప ఆభరణము. లోకమున యుద్ధమున తగిలిన దెబ్బలచే ఏర్పడిన కిణములను వీరులు గొప్ప ఆభరణము లుగా తలచుట పరిపాటియే కదా! కాళిదాసుకూడ **"ప్రత్యాదిష్టాభరణరుచయః చంద్రికా చంద్రహాసైః"** అనుచు ఈ విషయమును ప్రస్తావించెను. వజ్రాయుధము దెబ్బకును ఏమాత్రము చలింపని గరుడుని విక్రమాతిశయమును తరువాతి సంబోధన సూచించుచున్నది.

**(కల్పాంత... చమత్కార)** - ప్రళయకాలఝంఝామారుతమువలె ఆర్భాటముగా ఉదయించుటద్వారా గరుడుడు అపూర్వమైన వీర్యమును ప్రకాశింపచేయుచు చమత్కారమును కల్గించెను - అని తాత్పర్యము. ఇట్టి విక్రమాతిశయము భగవానుని గౌరవమునకు కారణ మయ్యెను. ఈ అంశమును అనంతరవిశేషణము సూచించుచున్నది.

**(దైత్యాది...... నిర్ధారితోత్కర్ష)** - గరుడుని విక్రమాటోపమును చూచిన భగవానుడు శ్రీమన్నారాయణుడు అతనిని తన ధ్వజముపై గుర్తుగా చేసికొనెను. **"తథేతి చ హసన్ ప్రాహ హరిః నారాయణః ప్రభుః, ధ్వజం చ మే భవ సదా త్వ మేవ విహగేశ్వర !"** అని భారతమున ఈ అంశము తెలుపబడినది. గరుడధ్వజు డని భగవానునకు నిరూపకనామము కలదుకదా! **"కరుడప్పుళ్ కొడి"** అని



ఆళ్వార్లును ఈ విషయమును అనుసంధించిరి. **"పైయుడైనాకప్పకైక్కొడి యానుక్కు"** ఇత్యాది పలు దివ్యసూరి సూక్తులును ఇచట స్మరణీయములు.

**(సంకర్షణాత్మన్)** - సంకర్షణమూర్తినుండి పుట్టినవాడగుటచే ఇచట తద్రూపిగా గరుడుడు అనుసంధింపబడెను. కావున కార్యకారణమునలకు అభేదోపచారము అని చెప్పనగును. గరుడుడు సంకర్షణమూర్తిసంజాతు డనుటకు సాత్వతసంహితలోని **"విష్ణోః సంకర్షణాఖ్యస్య విజ్ఞానబలశాలినః, మూర్తిః జ్ఞానబలా ఖ్యాయా సర్వాధార స్వరూపిణీ, మహిమేతి జగద్ధాతు ర్విజ్ఞేయా విహగేశ్వరః", "స్వానందధామనిష్ఠస్య దేవస్య చతురాత్మనః, సంకర్షణాంశాత్ సంపూర్ణవిజ్ఞాన బలసంకులాత్, అవతార్యామృతైః భోగైః"** ఇత్యాది ప్రమాణవాక్యములు, గరుడపంచాశత్‌లోని **"సిద్ధిః సాంకర్షణీ సా"** అను శ్లోకమును అనుసంధేయములు.

**(గరుత్మన్)** - ప్రశస్తములైన (ఱెక్కలను) కల్గినవాడు. గరుడగాయత్రిలోని **"తత్పురుషాయ విద్మహే సువర్ణపక్షాయ ధీమహి"**ఇత్యాది వాక్యములు ఇచట స్మరింపతగినవి. గరుడుని ఱెక్కలు అమోఘమైన శక్తిని, అందమును కల్గినవని తాత్పర్యము.

**(మరుత్పంచకాధీశ... మూర్తే)** - ప్రాణము, అపానము, సమానము. ఉదానము వ్యానము- అను అయిదు విధములైన వాయువులకును, క్రమముగా సత్య, సుపర్ణ, గరుడ, తార్క్ష్య విహగేశ్వరులు అధిదైవతములు. సాత్వతసంహితలోని **"ప్రాణాపానసమానోదాన వ్యానప్రాణరూపిణః, మధ్యస్థస్య ఖగేశస్య బహిః ప్రాగాదితః క్రమాత్, సత్య స్సుపర్ణో గరుడ తార్క్ష్య శ్చ విహగేశ్వరః"** అని, **"నమః ప్రాణాది వాయూనా మీశానాయ గరుత్మతే"** ఇత్యాది ప్రమాణములు ఇచట అనుసంధేయ ములు. గరుడపంచాశత్‌లో దేశికులును **"సత్యాద్యైః సాత్వతాది"** అనుచు ఈ అంశమును అనుసంధించిరి.

**(తే నమః పున స్తే నమః)** భగవానుని విషయమున వేదము **"భూయిష్ఠాం తే నమ ఉక్తిం విధేమ"** అని అనుసంధించిన క్రమమును గరుడుని విషయమున కవి అనుసరించుచు, మంగళమును ఆశాసించుచున్నారు. ఇచట నమశ్శబ్దపౌనః పున్యము ఆదరాతిశయమును చాటును. **"ప్రశంసాయాం ప్రతిజ్ఞాయాం ప్రలాపే తర్జనేఽపి చ, భయే చ విజయే చైవ పౌనఃపున్య మలంకృతిః"** అను శ్లోకము ఇందులకు ప్రమాణము. **"నమో నమో వాఙ్మనసాతిభూమయే"** అని శ్రీయామును లును ఈ క్రమమును అనుసరించిరి. ఈ చరణములోని సుపర్ణాది విశేషణము

లన్నియు **"జి"** ధాత్వర్థమగు సర్వోత్కృష్టతను ఉద్దేశించి ప్రయోగింపబడినవగుటచే సాభిప్రాయకములు. కావున పరికరాలంకారము అంతట కలదని చెప్పనగును. అట్లే, విశేష్యమగు గరుడనామము కూడ సాభిప్రాయకమగుటచే పరికరాంకురమును కలదు- అని సంస్కృతవ్యాఖ్యాత వివరించెను. **"కల్పాంతవాతూలకల్ప'** అనునపుడు **"కల్పప్"** ప్రత్యయప్రయోగముచే ఉపమ, **"ఆహారహారిన్"** అనునపుడు అనుప్రాసయు కలదు. పూర్వచరణములోవలెనే ఇచటను కవికి గరుడుని విషయమున గల రతిరూపభావము ధ్వనించుటచే భావధ్వనియు కలదు.

**(3) నమ ఇద మజహత్సపర్యాయ, పర్యాయనిర్యాత పక్షానిలాస్ఫాలనో ద్వేలపాథో వీచీచపేటాహతాగాధపాతాళ భాంకారసంక్రుద్ధ నాగేంద్రపీడాసృణీ భావ భాస్వన్నఖ శ్రేణయే, చండతుండాయ, నృత్యద్భుజంగభ్రువే, వజ్రిణే దంష్ట్రయా, తుభ్య మధ్యాత్మవిద్యా విధేయా విధేయా భవద్దాస్య మాపాదయేథాః దయేథాశ్చ మే.**

అజహత్సపర్యాయ = విడువబడని సపర్యను కలవాడవు, పర్యాయనిర్యాత= (ఒకదానివెంట వేఱొకటి) వరుసగా వెలువడిన, పక్ష+అనిల+ ఆస్ఫాలనాత్ = ఱెక్కల గాలియొక్క వేగమువలన (తాడనము వలన), ఉద్వేల = తీరమును అధిగమించిన, పాథోధి = సముద్రముల, వీచీ = కె రటములు అను, చపేటా= అరచేతులచే, ఆహత = కొట్టబడిన, అగాధ = మిక్కిలి లోతైన, పాతాళ = పాతాళలోకమున పుట్టిన, భాంకార = భాం అను శబ్దముచే, సంక్రుద్ధ = మిక్కిలి కోపించిన, నాగ+ఇంద్ర = దిగ్గజములను, పీడా = హింసించుటలో, సృణీభావ= అంకుశముగా, భాస్వత్ = ప్రకాశించు, నఖశ్రేణయే = గోళ్ల వరుసను కలవాడవు, చండతుండాయ = కఠోరమైన చంచువును (ముక్కు చివరి భాగమును) కలవాడవు, నృత్యత్ =నాట్యమును చేయు, భుజంగ = పాములవలెనున్న, భ్రువే= కనుబొమ్మలను కలవాడవు, దంష్ట్రయా = కోఱచే, వజ్రిణే = వజ్రాయుధమును కలవాడవు అగు, తుభ్యం = నీకు, ఇదం నమః = ఈ నమస్కారము (అగుగాక!) మే = నాకు, అధ్యాత్మవిద్యాః = వేదాంతవిద్యలను, విధేయాః = విధేయములుగా, విధేయాః = చేయుము, భవద్దాస్యం = నీ కైంకర్యమును, ఆపాదయేథాః = కలుగచేయుము, దయేథాః చ = మఱియు దయ చూపుము.

పూర్వచరణమున గల **"కల్పాంత"** అను విశేషణముతో సంగ్రహముగా సూచించిన గరుడుని వీరచరిత్రను వర్ణించి నమస్కరించుటద్వారా అనుగ్రహమును కవి ప్రార్థించుట ఇందలి విషయము.



గరుడదేవా! నీవు సర్వదా పూజింపబడువాడవు. వరుసగా విస్తరించు నీ ఱెక్కల గాలి వేగముచే తీరమును దాటిన సముద్రములోని కెరటములు అను అరచేతులచే కొట్టబడినదగుటచే పాతాళలోకమున **"భామ్"** అను శబ్దము ఏర్పడగా, దానిని వినిన దిగ్గజములు కోపింపగా, అట్టి దిగ్గజములను సైతము బాధింపగల్గిన అంకుశముల వంటి నఖములను కల్గినవాడవు, మిక్కిలి కఠినమైన ముక్కు చివరి భాగమును కలవాడవు, నృత్యము చేయు పామువంటి కనుబొమలను కలవాడవు, కోఱలను వజ్రాయుధమును కలవాడవు అగు గరుడ నామధేయా! నీకు నమస్కారము. దాసుడనగు నాకు వేదాంతవిద్యను అనుగ్రహింపుము. నీ ధ్యానమును చేయునట్లు నన్ను కరుణింపుము. నాపై దయ చూపుము - అని భావము.

**(అజహత్సపర్యాయ)** అందఱిచే ఎల్లప్పుడు పూజింపబడువాడవు - అని తాత్పర్యము. అన్ని విష్ణ్వాలయములలో గరుడునకు ప్రత్యేకముగా ఆలయ ముండుట, పూజలు జరుపబడుట ప్రత్యక్షముగా చూచువిషయమే.

**(సృణీభావభాస్వన్నఖశ్రేణయే)** - ఆకారసామ్యమునుబట్టి నఖములను కవి అంకుశములుగా రూపించిరి.

**(నృత్యత్ భుజంగభ్రువే)** - కౌటిల్యమునుబట్టి, భయమును కల్గించుటను బట్టి కనుబొమ్మలు భుజంగములతో రూపింపబడినవి.

**(దంష్ట్రయా వజ్రిణే)** - **"ధాన్యేన ధనవాన్"** అనునట్లు దంష్ట్ర (కోఱపల్లు) రూపమైన వజ్రాయుధమును కలవాడని తాత్పర్యము. బ్రహ్మచే పక్షులలో ఇంద్రుడుగా పిలువబడిన గరుడునకు వేఱొక వజ్రాయుధముతో అవసరము లేదు. కోఱయే వజ్రాయుధముతో సాటి.

**"పర్యాయపర్యా"** అనునపుడు ఛేకానుప్రాస, అట్లే, రకారయుక్త యకారము యొక్క అసకృత్ ప్రయోగముచే వృత్త్యనుప్రాస, ఈ రెండింటియొక్క సంకరమును కలదు. అట్లే **"విధేయా విధేయా"**, **"దయేథా దయేథా"** అనునపుడు వైధర్మ్యరూపకము, **"వీచీచపేటా"** అనుటచే రూపకమును కలవు. పూర్వచరణములో వలె ఇచట కవిగతగరుడవిషయక భక్తిరూపభావము వ్యంగ్యము.

**(4) మనురనుగతపక్షివక్త్రస్ఫురత్తారక స్తావక శ్చిత్రభానుప్రియాశేఖర స్త్రాయతాం న స్త్రివర్గాపవర్గప్రసూతిః పరవ్యోమధామన్! బలద్వేషి దర్పజ్వలద్వాల**

**ఖిల్యప్రతిజ్ఞావతీర్ణ! స్థిరాం తత్త్వబుద్ధిం పరాం భక్తిధేనుం జగన్మూలకందే ముకుందే మహానందదోగ్ధ్రీం దధీథా ముధాకామహీనా మహీనా మహీనాంతక!**

అనుగత = అనువర్తించు, ప = ప అను అక్షరమును కల, క్షి = "క్షి" అను అక్షరమును కల, వక్త్ర = పూర్వభాగమున, స్ఫురత్+తారకః = ప్రకాశించు ప్రణవమును కల్గినది, చిత్రభానుప్రియా = అగ్నియొక్క భార్యను (స్వాహాశబ్దమును) శేఖరః = చివర కల్గినది, త్రివర్గ+అపవర్గ= ధర్మార్థకామములను త్రివర్గమునకు, అపవర్గ మనబడు మోక్షమునకు, ప్రసూతిః = ఉత్పత్తిస్థానమైనది అగు, తావక = నీయొక్క, మనుః =మంత్రము, నః= మమ్ములను, త్రాయతాం = రక్షించుగాక, హే పరవ్యోమధామన్ = పరమపదమును నివాసముగా గల దేవా !, బలద్వేషి = ఇంద్రునియొక్క, దర్ప = గర్వముచే కల్గిన, జ్వలత్ = కోపముచే జ్వలించు, వాలఖిల్య= వాలఖిల్యులను ఋషులయొక్క, ప్రతిజ్ఞా = ప్రతిజ్ఞచే, అవతీర్ణ = అవతరించినవాడా, హే ఆహీనాంతక = ఓ సర్పనాశకుడా !, స్థిరాం = నిత్యమైన, తత్త్వబుద్ధిం = పరావరజ్ఞానమును, జగన్మూలకందే = లోకములకు మూలకంద మగు, ముకుందే = భగవానునియందు ఉన్నది, పరాం = శ్రేష్ఠమైనది, ముధా కామహీనాం = వ్యర్థప్రయోజనమును లేనిది, కావుననే, అహీనాం =గొప్పది, మహానందదోగ్ధ్రీం = మహానందమును కల్గించునది అగు, భక్తిధేనుం = భక్తి అను కామధేనువును, దధీథాః= ధరించునట్లు చేయుము.

**"మంత్రే తద్దేవతాయాం చ తథా మంత్రప్రదే గురౌ, త్రిషు భక్తిః సదా కార్యా"** అను ప్రమాణమునుబట్టి, ముందు మూడు చరణములలో వైనతేయమంత్ర ప్రతిపాద్యదేవత అగు గరుడుని విషయమున తమ భక్త్యతిశయమును ప్రకటించిన కవి, ఇందు ఆ మంత్రమునందలి భక్తివిశేషమును ప్రకటించుచు, అపేక్షిత ఫలమును ప్రార్థించుట ప్రధానవిషయము.

అనువర్తించు **"ప"** కారముతో కూడిన **"క్షి"** అను అక్షరము కల్గినది, పూర్వము **"ఓం"** కారమును, చివర **"స్వాహా"**శబ్దమును కల్గినది, నాల్గు పురుషార్థములకు స్థానమైనది అగు నీ మంత్రము మమ్ములను కాపాడునుగాక! పరమపదమును నివాముగా కల ఓ గరుడదేవా! ఇంద్రుని గర్వమువలన కోపించిన వాలఖిల్యుల ప్రతిజ్ఞవలన నీవు అవతరించితివి. సర్పశ్రేష్ఠములను అంతమొందించు స్వామీ! స్థిరమైన పరావరతత్త్వ జ్ఞానమును నాకు కల్గింపుము. లోకముల కంతటికిని మూలమగు శ్రీమన్నారాయణునిపట్ల గొప్పదైన, వ్యర్థప్రయోజనమును



కల్గింపని, మహానందసంధాయిని అగు భక్తి అను కామధేనువును నేను పొందునట్లు అనుగ్రహింపుము.

**(అనుగతపక్షివక్త్రస్ఫురత్తారకః)** - ఉచ్చారణసమయమున 'క్షి'అను అక్షరమునకు పిదప 'ప' కారము, ముందు 'ఓమ్' కారము అని తాత్పర్యము. తారక శబ్దము ప్రణవవాచక మనుటకు షోడశాయుధస్తోత్రములోని **"తారత్వం యస్య సంస్థానే"** ఇత్యాదిప్రయోగము స్మరణీయము.

**(తావకః మనుః)** - గరుడపంచాక్షరీమంత్రము - అని భావము. ఆ మంత్రోద్ధారము పాద్మసంహితలో ఇట్లు తెలుపబడినది. **"ఆమ్నాయాదిం నరహరిం గోపనం పశ్చిమాననం విష్ణుం తం చ హుతాంతం చ ఇతి పంచాక్షరీ మనుః"**. అట్లే వేఖాక తంత్రమున **"ప్రణవం పూర్వ ముద్ధృత్య పక్షిశబ్ద మనంతరమ్, పంచాక్షరీ మహామంత్రః స్వాహాంతః సంప్రకీర్తితః"** అని తెలుపబడినది. ఈ క్రమమున ముందు వకారము, తరువాత క్షికారము ఉచ్చరింపవలెను. ఈ పక్షమున **"అనుగతపక్షి"** అనునపుడు **"అనుగతః అనులోమః, పర్యాయే స్థితః యథాక్రమ ముచ్చార్యమాణః యః పక్షిః పక్షిశబ్దః ఇతి భావః"** అని వివరణము. అనగా- యథాక్రమముగా పక్షిశబ్దమును ఉచ్చరింపవలెను. ఇట్లు రెండు విధములుగా గరుడపంచాక్షరి కలదని తెలియుచున్నది. కావుననే దేశికులును గరుడపంచాశత్‌లో **"పక్షివ్యత్యస్తపక్షిద్వితయ ముఖపుటప్రస్ఫుటో దారతారమ్"** అని సూచించిరి. ఈ ప్రకారము లన్నియు గారుడోపనిషత్తులో స్పష్టము.

సంస్కృతవ్యాఖ్యాత వేఖాక క్రమమును ఈ సందర్భమున సూచించెను. ఆ క్రమమున ప్రణవము మధ్యలో ఉచ్చరింపబడును. ఇట్టి ఉద్ధారమున **"అనుగత పక్షి"** అనుటకు మొదటి వికల్పములోవలె వివరణమును చెప్పనగును. పిమ్మట, **"వక్త్ర"** అనుటకు శిరోభాగమున, అనగా- పిమ్మట, అనగా -పక్షిశబ్దానంతరమని భావము. మిగిలిన వివరణము పూర్వమువలెనే చేయనగును. **"ప్రాఙ్మూలమంత్ర మధ్యాద్యవ్యత్య యమ్"** అను ప్రమాణము ఇచట స్మరణీయము. ఇట్టి ఉద్ధారమును కల్గిన మంత్రమును ఉచ్చరించుటవలన విషనివారణ మగును.

**(త్రాయతామ్)** అను ఇచటి ఆత్మనేపదప్రయోగమువలన బిడ్డను రక్షించుట వలన కలుగు ఫలము తండ్రికి చెందునట్లే, నన్ను రక్షించుటవలన కల్గు ఫలితము నీదేనను భావము ధ్వనించుచున్నది.

**(పరవ్యోమధామన్)** ఈ సంబోధనవలన గరుడుని నిత్యమైన దివ్యమంగళ విగ్రహము తెలుపబడినది. ''న కాలస్తత్రవై ప్రభుః'' అనునట్లు కాలకృత పరిణామము లేని దేశముకదా! పరమపదము.

**(బలద్వేషి..... తీర్ణ)** పూర్వము కశ్యపప్రజాపతి పుత్రార్థియై యజ్ఞమును చేయగోరినపుడు, ఋషులు, దేవతలు, గంధర్వులు, యథాశక్తి సహాయమును చేసిరి. యజ్ఞమునకు అవసరమైన ఇధ్మమును తీసికొని రావలసినదిగా కశ్యపప్రజాపతిచే నియుక్తులైన అంగుష్ఠపర్వమాత్రదేహులైన, బ్రహ్మరోమముల నుండి పుట్టిన వాలఖిల్యులను ఋషులు నిత్యము తపస్సు చేయుటవలన కృశించిన దేహమును కలవారగుటచే తాము ఇధ్మమును తీసికొనివచ్చునపుడు దారిలో నీటిలో నిండిన గోష్పాదమును దాటలేక క్లేశపడుచుండగా, ఆ మార్గమున వచ్చు ఇంద్రుడు వారిని చూచి అపహాస్యమును చేసెను. **"పలాశవర్తికా మేకాం వహతః సంహతాన్ పథి, తాన్ సర్వాన్ విస్మయావిష్టో వీర్యోన్మత్తః పురందరః, అపహాస్యాధ్యగచ్ఛీఘ్రం లంఘయిత్వాఽవమన్య చ".** అందువలన మిక్కిలి కోపించిన ఆ ఋషులు ఇంద్రునికంటె వందరెట్లు వీర్యశౌర్యాదిగుణమును కల్గిన వేఱొక ఇంద్రుని తన తపోబలమున సృష్టింపవలెనను ప్రతిజ్ఞ చేసినవారై, అనేకవిధములైన మంత్రములతో హోమము చేసి, అగ్నిని తృప్తిపరచిరి. **"జుహువుస్తే సుతపసో విధివత్ జాతవేదసం, ఇంద్రోఽన్య స్సర్వదేవానాం భవే దితి యతవ్రతాః"** దీనిని తెలిసిన ఇంద్రుడు భీతుడై, తన తండ్రి అగు కశ్యపుని వద్దకు పోయి శరణు వేడెను. కశ్యపప్రజాపతి వాలఖిల్యులవద్దకు వచ్చి బ్రహ్మసృష్టికి విరుద్ధముగా వేరొక ఇంద్రుని సృష్టించుట తగదని వారిని సమాధానపఱచి, వారి ప్రతిజ్ఞ నిష్ఫలము కాదని, జన్మింపబోవువాడు పక్షీంద్రుడు కాగలడని పల్కి, వారిని సమాధానపఱెచెను. **"తాన్ కశ్యప ఉవాచేదం సాంత్వపూర్వం ప్రజాపతిః, అయమింద్ర స్త్రిభువనే నియోగాత్ బ్రహ్మణా కృతః, భవత్వేష పతత్రీణా మింద్రోఽతిబలసత్త్వవాన్, ప్రసాదః క్రియతా మస్య దేవరాజస్య యాచతః".** తత్ఫలితముగా వినతకు పుట్టిన గరుడుడు ఇంద్రునికంటె బలశాలి పరాక్రమశాలియై పక్షీంద్రుడయ్యెను. ఈ కథ మహాభారతములో ఆదిపర్వప్రారంభమున కలదు. ప్రస్తుతవిశేషణ మీ కథను తెలుపుచున్నది.

"పరవ్యోమధామన్", "బలద్వేషిదర్పజ్వలత్వాలఖిల్యప్రతిజ్ఞావతీర్ణ" అను రెండు విశేషణములవలన రామకృష్ణాద్యవతారములు పరవాసుదేవుని దివ్యమంగళ విగ్రహప్రతిరూపములైనట్లే, గరుత్మంతుని అవతారమును శ్రీవైకుంఠములోని తన నిత్యదివ్యమంగళ విగ్రహాంశమని సూచింపబడినది.



**(స్థిరాం తత్త్వబుద్ధిమ్)** అప్రకంప్యమైన పరావరతత్త్వజ్ఞానమును అని తాత్పర్యము. **"భక్తిధేనుమ్" "భక్తిజననీ మితి యావత్"** అని సంస్కృతవ్యాఖ్య.

**(ముధాకామహీనామ్)** అనన్యప్రయోజనమని, లౌకికవాంఛారహితం తాత్పర్యము. "స్రక్చందనాదివిషయకామరహితామ్" అని సంస్కృత వ్యాఖ్య.

**(అహీనమ్)** నశింపనిది. మోక్షదశయందును అనువర్తించునది.

**(జగన్మూలకందే) "వేర్ ముదలాయ్ విత్తాయ్", "ముదల్ తని విత్తేయో"** ఇత్యాది ఆఴ్వార్ల సూక్తులు ఇచట స్మరణీయములు.

**(ముకుందే)** 'ముక్తిం దదాతి ఇతి ముకుందః" అను వ్యుత్పత్తివలన ముకుందశబ్ద ప్రయోగమిచట సాభిప్రాయకము, మిక్కిలి స్వరసమును. **"భవతు మమ పరస్మిన్ శేముషీ భక్తిరూపా''** అనుచు భగవద్రామానుజులు భక్తిరూపాపన్నజ్ఞానమును అభిలషించునట్లే కవియు ఇచట కోరుచున్నారు.

"మహీనా మహీనా మహీనా' ఇత్యాది ప్రయోగములందు వృత్త్యనుప్రాస కలదు. "అనుగతపక్షి" ఇత్యాదిప్రయోగముద్వారా గరుడపంచాక్షరీమంత్ర స్వరూపము భంగ్యంతరమును తెలుపబడుటచే పర్యాయోక్తమను అలంకారమును కలదు. **"భక్తిధేనుమ్", "జగన్మూలకందే"** అను ప్రయోగములలో రూపకము, వీనియొక్క సంసృష్టియు కలదు. పూర్వము వివరింపబడినట్లే ఇందు కవిగతమైన భక్తిరూపభావము ధ్వనించుచున్నది.

షట్త్రింశత్గణచరణో నరపరిపాటీనవీనగుంభగుణః ।
విష్ణురథదండకోఽసౌ విఘటయతు విపక్షవాహినీ వ్యూహమ్ ॥

షట్ త్రింశత్ = ముప్పది ఆఱు, గణ = గణములను కల్గిన, చరణ = పాదములను కల్గినది, నరపరిపాటీ = నగణ, రగణముల క్రమముచే, నవీన = క్రొత్తదైన, గుంభగుణః = రచనాక్రమముయొక్క గుణముతో కూడినది అగు, అసౌ = ఈ, విష్ణురథ = గరుడునియొక్క, దండకః = దండకరూపస్తుతి, విపక్ష= శత్రువులయొక్క, వాహినీ = సేనయొక్క, వ్యూహం = యుద్ధరంగములోని సేనారచనాక్రమమును, విఘటయతు = భేదించును గాక!

నాల్గు చరణములను కల్గిన దంకముతో గరుడుని స్తుతించిన దేశికులు ఈ స్తోత్రమును పఠించు భక్తులకు శత్రుపక్షభంగరూప ఫలము సిద్ధించునని ఆశాసించు చున్నారు.

ముప్పది ఆఱు గణములను కల్గిన చరణములతో కూడినది, నగణ రగణముల వరుసను కల్గినది, కావుననే నూతనమైన రచనావిశేషముతో శోభిల్లునట్టి అగు ఈ గరుడదండకమును అనుసంధించువారు శత్రువుల సేనావ్యూహభంగములను ఫలముగా పొందుదురు. దండకము విపక్షవాహిని వ్యూహము భేదించును అనుట ఒక వాక్చమత్కృతి. దండము చేయు పని భేదనమే కదా!

**(షట్త్రింశత్ గణచరణః)** ప్రతిచరణము ముప్పది ఆఱు గణములతో కూడినది. అట్టి చరణములను కల్గినది ఈ దండకము. ఇట్లు ఈ సమాసము బహువ్రీహిగర్భ బహువ్రీహి.

**(నరపరిపాటీనవీనగుంభగుణః)** నగణరగణముల క్రమముచే నవీనరచనా క్రమమువలన శ్లాఘింపబడునదని తాత్పర్యము. సామాన్యముగా దండకప్రారంభమున మొదట రెండు నగణములు, పిమ్మట రగణములు ఉండును. **"యదిహ నయుగళః తతః సప్తరేఫాః తదా చండవృష్టిప్రయాతో భవే ద్దండకః'** అను లక్షణము ఇందులకు నిదర్శనము. రగణముల సంఖ్యనుబట్టి దండకము పేరు మారుచుండును. ఏడు గణములున్న చండవృష్టి ప్రయాతము, ఎనిమిది రగణములతో అర్ణము, తొమ్మిది ఉన్న అర్ణవము, పది ఉన్న వ్యాలము, పదకొండు రగణములతో జీమూతము- ఇట్లు దండకము అనేక విధములు. ప్రస్తుత దండకమున ముందు రెండు నగణములు, ఆ పిమ్మట ముప్పది ఆఱు రగణములును కలవు. కావున ఇది ఒక అపూర్వమైన ప్రక్రియ. కేదారభట్టు వృత్తరత్నాకరమున 14 రగణములతో కూడిన దండకమును శంఖమని నిర్దేశించి, పిమ్మట **"శంఖాదయః"** అనుచు ఆదిశబ్దమును ప్రయోగించు టచే, కవి ఇచ్చనుబట్టి ప్రతిపాదములోను రగణసంఖ్య వృద్ధి అగుటకు అవకాశము కలదని తెలియుచున్నది. కావుననే భవభూతి 16 రగణములతో కూడిన దండకమును ప్రయోగించెను. ఇట్టి నవ్యతవలన ఈ దండకము హృదయావర్జకమని తాత్పర్యము. లోకమున క్రొత్తగా కన్పించునది **"కొత్త వింత"** అనునట్లు ఆకర్షణీయమై యుండుట సహజము కదా! ఇక ఇన్ని గుణములను కల్గిన



దండకము ఆకర్షణీయ మగుటలో ఆశ్చర్యము ఏమున్నది ? **"నవీనగుంభగణ"** అను పాఠాంతరమును కలదు.

ఈ దండకమున తొమ్మిది అను అర్థము నిచ్చు నవశబ్దమునకు అనేక విధముల ప్రాధాన్యము కలదు. ప్రణవమనగా ప్రకృష్టమైన నవము. **"మహోదార మహాబాహో వైనతేయ వయోऽధిప, సన్నిధత్స్వ పతేత్ తుభ్యం నమః ప్రణవ మూర్తయే"** అను పాంచరాత్ర వచనమును బట్టి గరుడుడు ప్రణవమూర్తిగా ప్రసిద్ధుడు. ఆ గరుడుని స్తుతించునదియే ఈ దండకము.

ఈ దండకములోని ప్రతిపాదములో 36 గణములు కలవు. ప్రతిగణమున మూడు అక్షరములు కలవు. అందుచే ప్రతిపాదమున 108 అక్షరములు. ఈ సంఖ్యలోని అంకెలను కలుపగా తొమ్మిది వచ్చును. అట్లే నాల్గు పాదములలోని అక్షరములను కలిపినచో 108 X 3= 432. ఈ అంకెలను కలిపినను తొమ్మిదియే వచ్చును. ఈ దండకమున ప్రతిచరణమున 36 గణములు కలవు. ఈ అంకెలను కలిపినను తొమ్మిదియే వచ్చును. దండకమున 108 గణములు కలవు. ఈ అంకెలను కలిపినను తొమ్మిదియే. దండకములోని పదముల సంఖ్య 63. ఈ అంకెలను కలిపినను తొమ్మిదియే. ఇందు మూడు శ్లోకములు కలవు. ఆ శ్లోకములోని పదముల సంఖ్య 18. ఈ అంకెలను కలిపినను తొమ్మిదియే. పై సంఖ్యలను అన్నిటిని కలిపిన, అనగా 108 + 432 + 36 + 63 + 18 = 657 అను అంకె వచ్చును. ఇందలి అంకెలను కలుపగా 18 వచ్చును. మరల ఇందలి అంకెలను కలిపిన తొమ్మిదియే వచ్చును. ఇట్లు ఈ దండకమున సర్వత్ర నవత్వము స్పష్టము. ఇంతియేకాక, **"ఓమ్ తత్పురుషాయ విద్మహే సువర్ణపక్షాయ ధీమహి, తన్నో గరుడః ప్రచోదయాత్"** అను గరుడగాయత్రిని ఈ దండకము వివరించుచున్నది. ఈ గాయత్రిలోని పదముల సంఖ్య 27. ఇందలి అంకెలను కలుపగా వచ్చు సంఖ్య మరల తొమ్మిది అగుటయు గమనింపతగినది- అను ఈ వివరణములన్నియు వాచస్పతి, శ్రీమాన్ కె.వి. రాఘవాచార్యస్వామివారి గరుడదండక వ్యాఖ్యలో తెలుపబడినవి. **"పితా చ రక్షక శ్శేషీ భర్తా జ్ఞేయో రమాపతిః, స్వామ్యాధారో మమాత్మా చ భోక్తా చాద్యమనూదితః"** అను ప్రమాణమును బట్టి జీవునకు భగవానునితో తొమ్మిది విధములైనసంబంధములు కలవనుట స్పష్టము. జీవులలో అగ్రగణ్యుడు గరుడుడును. అట్టి నవవిధ సంబంధమును భగవానునితో కలిగియున్నాడు. మరియు **'సుపర్ణోऽసి గరుత్మాన్'** ఇత్యాది వైదిక ప్రమాణము నందు గరుడుని తొమ్మిది విధములైన అంగములయొక్క వేదాంగత్వము

స్పష్టముచేయబడినది. ఇట్టి నవవిధ వేదాంగకుడగు గరుత్మంతుని స్తుతించు దండక మిది.

విచిత్రసిద్ధిద స్సోఽయం వేంకటేశవిపశ్చితా ।
గరుడధ్వజతోషాయ గీతో గరుడదండకః ॥

విచిత్రసిద్ధిదః = వివిధములైన ప్రయోజనములను ఇచ్చునది అగు, సః + అయం= ఈ (ఆపదలను నివారించు, ఇష్టప్రాప్తిని కల్గించు) గరుడదండకః = గరుడుని దండకము, గరుడధ్వజతోషాయ = భగవానుని సంతోషమునకై, వేంకటేశవిపశ్చితా= వేంకటేశుడను పేరు గల వేదాంతదేశికులను పండితునిచే, గీతః = గానము చేయ బడినది (రచింపబడినది).

ఇట్లు గరుడదండకమును పరిసమాప్తి చేసిన పిమ్మట దేశికులు స్తోత్రకర్త నామము తెలియనిచో స్తోత్రమునకు శిష్టపరిగ్రహత్వము కలదో, లేదో అను సందేహము లోకులకు కల్గునని తలచి, తమచే ఈ దండస్తుతి రచింపబడినదని సూచించుచు, ఈ స్తోత్రమును పఠించిన పలు ప్రయోజనములు సిద్ధించుటతో పాటు, పరమ ప్రయోజనమగు భగవన్ముఖోల్లాసమును కల్గునని తెలుపుచున్నారు. పలు విచిత్రములైన ఫలములను అనుగ్రహించు ఈ గరుడదండకమును వేంకటేశులను పేరును కల వేదాంతదేశికులను విద్వాంసులు భగవానుని సంతోషముకొఱకు రచించిరి అని భావము.

**(విచిత్రసిద్ధిదః)** శ్రీ సాత్వతసంహితలో (పాద్మసంహితలో) గరుడమంత్ర స్మరణమువలన పలు ప్రయోజనములు కల్గునని తెలుపబడినది. అందుగల **"సిద్ధయ శ్చ యథాపూర్వం భవంతి భవతోఽఖిలాః, వశ్యాకర్షణవిద్వేష-మారణోచ్చాటనాదిషు ......ఏవ మాదిషు సాధ్యేషు తథాన్యేష్వపి చ కర్మసు, ఇతి మంత్రం ప్రయుంజీతి గరుత్మంత మనుస్మరన్"** అను సూక్తులిందులకు నిదర్శనములు.

**(గరుడధ్వజతోషాయ)** దేశికులు ఈ స్తోత్రమును రచించుట భగవానుని సంతోషముకొఱకే. గరుడుని స్తుతించుటవలన భగవానునకు ఎట్లు ఆనందము కల్గును? అనినచో, **"యః పృథివ్యాం తిష్ఠన్ పృథివ్యాంతరః . . . . . .ఏష ఆత్మాంతర్యామ్య మృతః"** అని, **"అంతః ప్రవిష్టః శాస్తా జనానాం సర్వాత్మా"** అని, **"అనేన జీవేనాత్మనాను ప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి"** అని శ్రుతులయందు



చెప్పబడుటవలన, **ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేఽర్జున! తిష్ఠతి"** అను గీతాసూక్తివలన, భగవానుడు సర్వశబ్దవాచ్యుడు, సమస్తచిదచిత్తులను శరీరముగా కలవాడని తెలియుచున్నదికదా! కావున గరుడుని ఈ దండకముద్వారా స్తుతించుట భగవానుని స్తుతియందు పర్యవసించుటచే తత్సంతోషదాయక మనుటలో విప్రతిపత్తి లేదు. అంతియేగాక, తనకు పరమభక్తుడగు గరుడుని స్తుతించిన భగవానునకు ఆనందము కల్గుటలో ఆశ్చర్య మేమున్నది? కుమారుని పొగడిన సంతోషింపని తండ్రికలడా! ఇట్లు ఈ స్తుతి అంతతః భగవదానందకర మనుటలో సందేహము లేదు. మఱియు, గరుడుడు భగవానునిరూపమగు సంకర్షణుని అంశను కల్గినవాడగుటచే, భగవానునకు గరుడునకు మధ్య అభేదభావనతో కవి ఇట్లు పల్కెననియు చెప్పవచ్చును. ఇదే విధముగా గరుడపంచాశత్‌లో దేశికులు **"యోఽయం యత్తే స్వనిష్ఠం వహన మపి.... ఇత్థం హరిగరుడభిదా. కల్పితారోహవాహ స్వాభావ్యః స్వాత్మభవ్యః ప్రదిశతు శకుని బ్రహ్మ సబ్రహ్మతాం నః"** అనుచు పల్కుట ఇచట స్మరణీయము. **"విష్ణురథః"** అను పదమును **"విష్ణో రథ ఇవ"** విష్ణువునకు రథమువంటివాడు- అని వివరించుట సామాన్యమైన అర్థము. అదియేకాక **"విష్ణోః రథః పౌరుషం, దేహో వా'** అను వేఱొక వ్యుత్పత్తియు అమరసుధలో చూపబడినది. కావున గరుత్మంతుని స్తుతించుట భగవానుని పౌరుషము స్తుతించుట, లేక, భగవానుని రూపమును స్తుతించుటయే అగును అని తెలియుచున్నది కదా!

ఈ శ్లోకమున **'వేంకటేశవిపశ్చితా'** అనుటచే వక్తృవైలక్షణ్యము, **"గరుడదండకః"** అనుటచే ప్రబంధ, ప్రతిపాద్య వైలక్షణ్యములు, **"గరుడధ్వజతోషాయ", "విచిత్రసిద్ధిదః"** అనుటచే ప్రయోజనవైలక్షణ్యమును సూచింపబడినవి. ఇందులకు అనుగుణముగ తిరువాయ్‌మొழிలోని 3-9 దశకము చివర **"ఏఱ్కుమ్ పెరుమ్ పుకழ్"** అను విశేషణము ప్రమేయమగు భగవానునకు, వక్త అగు ఆழ்వార్లకు, ప్రబంధమగు తిరువాయ్‌మొழிకి ప్రయోగించుట, చివర **"ఇవైయుమ్ మోర్ పత్తు ఏఱ్కుమ్ పెరుమ్ పుకழ்"** అని పల్కుట అనుసంధింపనగును. వృత్తము **"పథ్యా"** అను అనుష్టుప్ భేదము.



### శ్రీవేదాంతదేశికప్రణీతమైన

# అష్టభుజాష్టకం - సవ్యాఖ్యానం

## ప్రవేశిక

శ్రీవేంకటేశ్వరఘంటావతారులుగా, సర్వతంత్రస్వతంత్రులుగా, కవితార్కికకేసరిగా, శతాధికగ్రంథకర్తలుగా జగద్విఖ్యాతిని పొందిన శ్రీమద్వేదాంతదేశికులు సంస్కృతభాషలో రచించిన పలు స్తోత్రాలలో అష్టభుజాష్టకం ఒకటి. ఈ స్తుతి శ్లోకసంఖ్యనుబట్టి చూస్తే చిన్నదిగా తోచినా, అర్థగాంభీర్యంలోను, శబ్దమాధుర్యంలోను విశిష్టమైనది. **"అట్టపుయకరమ్"** అనే పేరుతో పిలువబడే దివ్యక్షేత్రంలో వేంచేసి ఉండే అర్చామూర్తిని స్తుతిస్తూ రచించిబడిన స్తోత్రం ఇది. ఈ క్షేత్రం ప్రస్తుతతమిళనాడు రాష్ట్రంలోని కాంచీనగరంలో గల సుప్రసిద్ధ వరదరాజస్వామి ఆలయానికి పడమటి దిక్కులో సుమారు 2 కి.మీ. దూరంలో ఉన్నది. ఇక్కడి స్వామి ఎనిమిది భుజాలలో ఎనిమిది దివ్యాయుధాలను ధరించి సేవను అనుగ్రహిస్తున్నాడు. అష్టభుజస్వామి భుజాల సంఖ్యకు, ఆ భుజాలలో వెలిగే ఆయుధాల సంఖ్యకు అనుగుణంగా శ్రీదేశికులు ఎనిమిది శ్లోకాలతో కూడిన స్తుతితో ఆ స్వామిని సంభావించడం విశేషం. ఈ దివ్యతిరుపతిని, ఈ అష్టభుజస్వామిని పేయాళ్వార్లు (మహాయోగి) మూన్ఱామ్ తిరువన్దాది అనే దివ్యప్రబంధంలోని **'తొట్టైపడై యెట్టుమ్' (99)** అనే పాశురంలోను, తిరుమంగై ఆళ్వార్లు పెరియ తిరుమొళి ప్రబంధంలో **"తిరుపుర మూన్ఱెరిత్తానుమ్" (2.8)** అనే దశకంలోను కీర్తించారు.

అష్టభుజాష్టకంలో మొత్తం పది శ్లోకాలున్నాయి. వీటిలో మొదటి ఎనిమిది శ్లోకాలు అష్టభుజస్వామిని కీర్తించగా, చివరి రెండు ఫలశ్రుతిని, కవినామాన్ని తెలుపుతున్నాయి. ఒకానొక సమయంలో అతడు చేసిన యజ్ఞానికి అసురులు అడ్డు రాగా, యాగసంరక్షణార్థం అతడు భగవానుని ప్రార్థించాడు. అపుడు భగవానుడు ఎనిమిది బాహువులలో ఎనిమిది ఆయుధాలను ధరించిన అష్టభుజస్వామిగా ఆవిర్భవించి, అసురసంహారాన్ని చేసి, యాగాన్ని రక్షించాడని క్షేత్రమాహాత్మ్యంలో తెలుపబడింది.



దేశికులు ఈ స్తుతిలో - తాము లౌకికవిషయాలపట్ల ఆసక్తిని కల్గి ఉండడాన్ని, ఇచటి అష్టభుజస్వామి కృపవలన తాము పొందిన హితాన్ని, ఆ స్వామి పరత్వాన్ని, సౌలభ్యాన్ని, ప్రపన్నుల రక్షణబాధ్యతను భగవానుడు తన కర్తవ్యంగా స్వీకరిస్తాడని, భగవానుని తప్ప ఇంకొకరిని రక్షకునిగా ఆశ్రయించని తమ మనోనైర్భర్యాన్ని తెలిపి, తాము జీవించి ఉన్నంతవరకు (యావచ్ఛరీరపాతం) భగవానుని శ్రీచరణాలలో అపరాధం లేని కైంకర్యాన్ని అనుగ్రహించవలసినదిగా అష్టభుజస్వామిని ప్రార్థించి, ఈ స్తోత్రానుసంధానం సకలలోకాలకు క్షేమాన్ని కలుగజేస్తుందని ఫలశ్రుతి తెలిపి స్తుతిని పూర్తిచేశారు. ఈ స్తుతి ప్రధానంగా శరణాగతితత్త్వప్రతిపాదకమని చెప్పవచ్చు.

ఎనిమిది భుజాలను కల్గి ఉండే ఇచటి స్వామికి అష్టభుజస్వామి **("అట్టపుయన్")** అని పేరు. ఆ యా క్షేత్రాల నామాలను పురస్కరించుకొని అచటి అర్చామూర్తులకు మంగళాశాసనం చేయడం ఆళ్వార్లకు అలవాటు. కనుక ఈ దివ్యదేశానికి ఆళ్వార్లు **"అట్టపుయకరమ్"** అని పేరు పెట్టారు. సంస్కృతంలోని గృహశబ్దం ద్రావిడభాషలో **"కరమ్"** అనే వికృతిని పొందుతుంది. అందువల్ల **"అష్టభుజగృహ"** మనే సంస్కృతపదం. **"అట్టపుయకరమ్"**గా మారిందని చెప్పవచ్చు. అగ్రహారమనే సంస్కృతపదం **"అకరమ్"** అని మారిందని, **"అష్టభుజఅగ్రహార"** శబ్దం **"అట్టపుయవకరమ్"** అని, తరువాత **"అట్టపుయకర"**మని పరిణమించిందని కూడా కొందరి అభిప్రాయం. గృహమనే అర్థమిచ్చే **"అగార"**మనే సంస్కృతశబ్దమే **"అకరమ్"** గా మారిందని మఱి కొందరి అభిప్రాయం. అందువల్ల **"అట్టపుయవకరమ్"** అనే పేరు **"అట్టపుయకరమ్"** అని మారిందని అనడం యుక్తియుక్తమని శ్రీకాంచీ ప్ర.భ. అణ్ణాస్వామివారు తమ వ్యాఖ్యలో తెలిపారు.

అట్టపుయకరమనే దివ్యదేశంలో వేంచేసి ఉండే అష్టభుజస్వామి తన ఎనిమిది శ్రీహస్తాలలో ఖడ్గం, విల్లు, గద, శంఖం, శరం, చక్రం, డాలు, తామరపూవు - అనే ఎనిమిది ఆయుధాలను ధరించి దర్శనమిస్తున్నాడు. పుష్పం ఆయుధం కాకపోయినా అందాన్ని చేకూరుస్తుందికదా! చక్రాది దివ్యాయుధాలకు అన్నిటికీ ఆభరణత్వంకూడా ఉన్నది ఆళ్వార్లు, పూర్వాచార్యులు పలికారు. **"తిరుచ్చెయ్యనేమియాన్"** అని నమ్మాళ్వార్లు, **"సర్వప్రహరణాయుధః"** అనే

నామాన్ని వ్యాఖ్యానించే సందర్భంలో **"ఆత్మోచితాని అనంతాని ఆభరణ వికల్పాని.... దివ్యాయుధాని"** అని అంటూ శ్రీపరాశరభట్టర్ ఈ విషయాన్ని తెలియజేయడం ఇక్కడ స్మరించదగినది. అందువల్ల తామరపూవు ఆభరణకోటి లోనికి చేరినట్లే దివ్యాయుధాలుకూడా ఆభరణకోటిలోనికి చేరుతాయి. కనుక, వీటిని కలిపి అనుసంధించడంలో అడ్డు లేదు. లేక, తామరపూవుకూడా ఆయుధకోటిలోనికి చేరుతుందని అనడం కూడా యుక్తమే.

మన్మథుడు పూలను ఆయుధాలుగా చేసికొన్నట్లే **"సాక్షాన్మన్మథ మన్మథు"**డైన భగవానుడు పూవును ఆయుధంగా ధరించాడని చెప్పడంకూడా ఒక రసోక్తి. పెరియతిరుమొఴి ప్రబంధంలోని **"తిరుపుర మూన్టెరిత్తానుమ్"** అనే దశకంలో గల **"శెమ్బునిలజ్ఞ"** అనే మూడవ పాశురాన్ని వ్యాఖ్యానిస్తూ పెరియవాచ్చాన్‌పిళ్ళై **"ఒణ్ మలర్"** అనే ప్రయోగాన్ని **"కామనైప్పోలే అబలైకళై అఴిక్కైక్కు ఉపకరణమాన మలర్"** (మన్మథునివలె, అబలలను బాధించడానికి సాధనమైన పూవు) అని వ్యాఖ్యానించడంవల్ల భక్తుల మనస్సును తన అందంతో దోచి, బాధించడంలో ఆయుధాలతో తామరపూవు సాటి వస్తుంది; కనుక ఆయుధాలతో కలిపి పూవును అనుసంధించడం యుక్తమేకదా!

ఇక, స్తోత్రవాఙ్మయంలో అష్టకస్తుతులకుండే వైశిష్ట్యాన్నిగూర్చి కొంచెం విన్నపింపబడుతున్నది. ఎనిమిది శ్లోకాలతో కూడుకొన్న అష్టకస్తుతులకు వేదకాలంనుండి స్తోత్రవాఙ్మయశాఖలో ప్రత్యేకస్థానం ఉన్నది. వేదంలోని నక్షత్రస్తుతి విషయకాలైన అష్టకవాక్యాలు సుప్రసిద్ధాలు. ఉపనిషత్తులలో భగవానుడు **"అపహతపాప్మా విజరో విమృత్యు ర్విశోకోఽ విజిఘత్సోఽ పిపాసః సత్యకామః సత్యసంకల్పః"** అని గుణాష్టకాన్ని కలవాడుగా కీర్తింపబడ్డాడు. అష్టాక్షరీమంత్రపాద్యుడతడు. అష్టైశ్వర్యప్రదాత. హరివంశమహాపురాణంలో- బాణాసురవధసందర్భంలో శ్రీకృష్ణభగవానుడు ఎనిమిది బాహువులను కల రూపాన్ని ధరించినట్లుగా 179వ అధ్యాయంలోని **"అథాష్టబాహుః కృష్ణస్తు పర్వతాకారసన్నిభః, స బభౌ పుండరీకాక్షో నికాంక్షన్ బాణసంచయమ్, అసిచక్రగదాబాణా దక్షిణం పార్శ్వ మాస్థితాః, చర్మ శార్‌ఙ్గం తథా చాపం శంఖం చైవాస్య వామతః"** అనే శ్లోకాలు తెల్పుతున్నవి. చతుర్భుజుడైన స్వామి శరణాగత



రక్షణసందర్భంలో రక్షణత్వరచేత ద్విగుణబాహువు - అంటే - అష్టభుజుడు అవుతాడని అంటూ దేశికులు **"శరణాగతసంత్రాణత్వరా ద్విగుణబాహునా"** అని ఈ స్తుతి చివరలో అంటూ చమత్కరించారు. పేయాఴ్వార్లుకూడా **"తొట్టపడై యెట్టుమ్... అట్టపుయకరత్తాన్ అఞ్జాన్టు కుట్టత్తుక్కోళ్ ముతలై తుఞ్జ కుఱిత్తెఱిన్ద శక్కరత్తాన్"** అని అంటూ గజేంద్రరక్షణసందర్భంలో స్వామి అష్టభుజుడయ్యాడని అన్నారు. ఇటువంటి స్వభావాన్ని కల్గిన స్వామిని దేశికులు శ్లోకాష్టకంతో స్తుతించడం ఉచితంకదా! ఎనిమిది శ్లోకాలను కల్గిన స్తుతికి **"వారణమాల"** అనే పేరు. వారణమంటే గజం. వారణమాల అంటే గజానికి అలంకారమైన మాల అని కూడా భావం. భగవానునకు **"చక్రహస్తేభచక్రమ్"** అన్నట్లు గజంతో పలు రీతులలో పోలిక ఉన్నది. అటువంటి స్వామిని ఎనిమిది శ్లోకాలతో కూడిన వారణమాలతో స్తుతించడం తగినదే. కృష్ణాష్టకం, హర్యష్టకం, రంగనాథాష్టకం, కామాసికాష్టకం మొదలైనవి భగవానుని అష్టకస్తుతులలో కొన్ని.

**"అహింసా ప్రథమం పుష్పం పుష్ప మింద్రియనిగ్రహః, సర్వభూతదయా పుష్పం క్షమా పుష్పం విశేషతః, జ్ఞానం పుష్పం తపః పుష్పం ధ్యానం పుష్పం తథైవ చ, సత్య మష్టవిధం పుష్పం విష్ణోః ప్రీతికరం భవేత్"** అని అంటూ భగవానునకు ఇష్టమైనవి ఎనిమిది పుష్పాలని, అవి -అహింస, ఇంద్రియనిగ్రహం, సర్వభూత దయ, క్షమ, జ్ఞానం, తపస్సు, ధ్యానం, సత్యం- అని చెప్పబడింది కదా! తిరుమఙ్గైయాఴ్వార్లుకూడా పెరియ తిరుమొఴి ప్రబంధంలో **"ఇనమల రెట్టు మిట్టు"** (1-2-7) అని, **"కన్దమలర్ ఎట్టు మిట్టు"** (3-5-6) అని భగవానుని సుగంధభరితాలైన ఎనిమిది రకాలైన పూలతో పూజించాలని ఆశపడ్డారు. **"ఇనమలర్ ఎట్టు మిట్టు"** అనే సూక్తిని వ్యాఖ్యానించే పెరియవాచ్చాన్‌పిళ్ళై- **"అహింసాదికళాన పుష్పఙ్గళ్ ఎట్టు మిట్టు"** అని వ్యాఖ్యానించారు. అందువల్ల దేశికులు అష్టభుజస్వామిని ఎనిమిది శ్లోకాలతో కీర్తించడం దీనిని సూచిస్తుందని చెప్పవచ్చు. ఈ సందర్భంలోనే పెరియవాచ్చాన్‌పిళ్ళై చేసిన **"శెఙ్గఴునీర్, శెణ్బకమ్, ఇరువాట్చి, పాతిరి, పున్నై, కురుక్కత్తి, కరుముకై, తామరై- ఎన్టాప్పోలే ప్రధానమా యిరుప్పన ఎట్టు మాతల్"** అనే వివరణాన్ని బట్టి ఒక్కొక్క శ్లోకాన్ని ఒక్కొక్క పుష్పంగా చేసి భగవానుని శ్రీదేశికులు అర్చించారని చెప్పవచ్చు. **"పునైయుమ్ కణ్ణి ఎనదుడైయ వాశకమ్ శెయ్ మాలైయే"** (తిరువాయ్-4-3-

2) అని, **"ఇన్నిశైయాల్ పాడి కొడుత్తాళ్ నఱ్పామాలై"** అనే రీతిలో దేశికులుకూడా ఈ వాక్సుమమాలను సమర్పించారు. లేక, **"అష్టాఙ్గప్రణామత్తై చ్చొల్లిగ్గ్రాతల్. అత్తై మలర్ ఎన్నుమ్బడి ఎన్ ? ఎన్నిల్, పూవోపాతి అవనుక్కు స్పృహావిషయమాయిరుక్కలామితే"** (అష్టాంగ ప్రమాణాన్ని చెబుతున్నదని చెప్పవచ్చు. దానిని పూవు అని అనడం ఎందుకు ? అంటే, పూవు అతని ఆశకు విషయం అయినట్లే, ప్రణామంకూడా అతని ఆశకు విషయం కావచ్చునుకదా) అనే పెరియవాచ్చాన్ పిళ్ళై వ్యాఖ్యానసూక్తినిబట్టి దేశికులు అష్టాంగప్రణామాన్ని ప్రస్తుతస్తుతిలోని శ్లోకాష్టకం సూచిస్తున్నదని చెప్పవచ్చు. అష్టాక్షరీమంత్రప్రతిపాద్యుడైన భగవానుని ఎనిమిది శ్లోకాలను కల స్తుతితో కీర్తించడంకూడా తగినదే. **'కన్దమామలర్ ఎట్టు మిట్టు"** (3-5-6) అనే పెరియతిరుమొఴి సూక్తిని పెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్యానిస్తూ ఎనిమిది సంఖ్యలోని సుగంధపుష్పాలతో భగవానుని అర్చించడంలో గల స్వాపదేశాన్ని -**"స్వాపదేశమ్- పరమభోగ్యమాన తిరుమంత్రత్తాలే ప్రతిపాద్యనాన వస్తువిన్ పక్కలిలే తన్నై సమర్పిత్తు"** (పరమభోగ్యమైన తిరుమంత్రంతో ప్రతిపాదింపబడతగిన వస్తువైన శ్రీమన్నారాయణునకు తనను సమర్పించి) అని తెలిపారు. ఈ వ్యాఖ్యానసూక్తిని అరుంబదకారులు- **"ఇత్తాల్- పరిమళప్రచురమాన మలర్‌పోలే ఓరో ఎఴుత్తే పరమభోగ్యమాయిరుక్కుఱ తిరువెట్టెఴుత్తాలే తత్ప్రతిపాద్యమాన వస్తువిల్ తన్నై సమర్పిక్కై ధ్వనిక్కైక్కాక చ్చొన్నార్- ఎన్ఱతాయ్‌త్తు"** (దీనివల్ల - పరిమళ భరితమైన పూవువలె ఒక్కొక్క అక్షరం పరమభోగ్యంగా ఉండే ఎనిమిది అక్షరాలను కల అష్టాక్షరితో ఆ మంత్రంచే ప్రతిపాదింపబడతగిన భగవానుని సన్నిధిలో తనను సమర్పించడం ధ్వనించడంకోసం చెప్పారు- అని భావం) అని అన్నందువల్ల, ఆఴ్వార్లు **"కన్దమలర్ ఎట్టు మిట్టు"** అని అంటూ ఎనిమిది సువాసనను కల పూలతో భగవానుని అర్చించడం- ఎనిమిది అక్షరాలను కల అష్టాక్షరీమహామంత్రంచే ప్రతిపాదింపబడే శ్రీమన్నారాయణుని సన్నిధిలో తనను సమర్పించుకోవడం- అంటే -ఆత్మసమర్పణ రూప శరణాగతిని ధ్వనింపజేస్తుందని తెలుస్తున్నదికదా ! ఇదే రీతిలో ఎనిమిది సుగంధపుష్పాలనదగిన ఎనిమిది శ్లోకాలను దేశికులు అష్టభుజస్వామికి సమర్పించడంకూడా దీనినే- అంటే- ఆత్మభరన్యాసాన్ని సూచిస్తుందని చెప్పవచ్చు. అష్టభుజాష్టకమనే ప్రస్తుతస్తుతిలో ప్రధాన ప్రతిపాద్యం



శరణాగతియేనని పూర్వోక్తమేకదా ! ఈ స్తుతి **"ప్రపన్నజనపాథేయ"** మని, ప్రపత్తి చేయగోరే వారికి (ప్రపిత్సులకు) రసాయనమని దేశికులే స్వయంగా చివరలో పలికారు. ఈ విధంగా శ్రీదేశికులు ఎనిమిది సంఖ్యలో గల శ్లోకాలతో భగవానుని స్తుతించడం పలు విధాలైన అర్థాలను సూచింపజేస్తుంది. **"కరస్థకమలాన్యేవ పాదయో రర్పితుం తవ"** అనే రీతిలో భగవానుని శ్రీచరణాలలో కమలాలను సమర్పించే కైంకర్యం చేయాలని ఆశపడిన గజేంద్రుని కాచిన అష్టభుజుని కీర్తించే ఈ స్తుతిని దేశికులు ఎనిమిది దివ్యవాక్సుమాలతో ఆరాధించడం ఉచితం కదా. (స్తుతిలోని చివరి రెండు శ్లోకాలు ఉపసంహారాత్మకాలు)

ఆంధ్రదేశంలో పశ్చిమగోదావరి జిల్లాలోని పాలకొల్లు (క్షీరపురి)లో కూడా అష్టభుజలక్ష్మీనారాయణస్వామివారి దేవాలయం ఉన్నది. ఇచటి స్వామి, కాంచీపురంలోని అట్టపుయకరదివ్యక్షేత్రంలోవలె ఎనిమిది బాహువులతో వేంచేసి ఉండి, భక్తుల మనోరథాలను తీర్చే కల్పవృక్షంగా, కొంగు బంగారంగా వెలుగుతున్నాడు.

అష్టభుజాష్టకానికి సంస్కృతవ్యాఖ్యలు, ద్రావిడవ్యాఖ్యానాలు, **కాంచీమహావిద్వాన్** ప్ర.భ. అణ్ణంగరాచార్యస్వామివారు ద్రావిడంలో రచించిన వ్యాఖ్య ఉన్నాయి. వీటిని ఆధారంగా చేసికొని మఱి కొన్ని విశేషాలను జోడిస్తూ ప్రస్తుత ఆంధ్రవ్యాఖ్యానం రచింపబడింది. ఈ వ్యాఖ్యలోని గుణదోషాలకు నిర్మత్సరులైన సహృదయపాఠకులు ప్రమాణం.



శ్రీవేదాంతదేశికప్రణీతమైన

# అష్టభుజాష్టకం - సవ్యాఖ్యానం

శ్రీమాన్ వేంకటనాథార్యః కవితార్కికకేసరీ !
వేదాంతాచార్యవర్యో మే సన్నిధత్తాం సదా హృది ॥

అష్టభుజాష్టకవినుతేః దేశికసుకృతేః కరోతి వివృతి మిమామ్ ।
శ్రీశింగరార్యనామా వైష్ణవదాసో ముదే ప్రపన్నానామ్ ॥

1. గజేంద్రరక్షాత్వరితం భవంతం
గ్రాహై రివాహం విషయై ర్వికృష్టః ।
అపారవిజ్ఞానదయానుభావమ్
ఆప్తం సతా మష్టభుజం ప్రపద్యే ॥

గ్రాహైః ఇవ = మొసళ్ళవంటి, విషయైః = ఇంద్రియవిషయాలచే, వికృష్టః= చాలా బలంగా పట్టుకోబడిన, అహం = నేను, గజేంద్ర = గజేంద్రునియొక్క, రక్షా = రక్షణలో, త్వరితం = మిక్కిలి తొందరను కల్గినవాడవు, అపార = అంతు లేని, విజ్ఞాన = గొప్పజ్ఞానాన్ని, దయా = కరుణను, అనుభావం = గొప్పతనాన్ని (శక్తిని) కలవాడవు, సతాం = సత్పురుషులకు, ఆప్తం = నమ్మదగినవాడవు, అష్టభుజం = ఎనిమిది భుజాలను కల్గి ఉండడంవల్ల అష్టభుజుడనే పేరును కలవాడవు అయిన, భవంతం = నిన్ను, ప్రపద్యే = శరణు పొందుతున్నాను.

ఎనిమిది భుజాలను కల్గిన ఓ అష్టభుజస్వామీ ! లౌకికవిషయాలు మొసళ్ళవలె నన్ను పట్టుకొని తమ వైపు బలంగా ఆకర్షిస్తున్నవి. ఆనాడు మొసలి నోటిలో చిక్కుకొని నిస్సహాయుడైన గజేంద్రుడు **"నారాయణా! ఓ మణివణ్ణా! నాకణైయాయ్! వారాయ్! ఎన్నారిడర్రై నీక్కాయ్"** అని, **"మూల మూలేతి ఖిన్నే"** అని పల్కిన రీతిలో **"రావే ఈశ్వర! కావవే వరద! సంరక్షించు భద్రాత్మకా!"** అని ఎలుగెత్తి పిలువగానే నీవు ఎంతో వేగంగా వచ్చి అతనిని రక్షించావే! ఆ



విధంగానే, ప్రాపంచికాలైన విషయాలపట్ల ఆకర్షితుడనైన నన్ను సన్మార్గంలోకి మరలించి రక్షించు. **"పరాఽస్య శక్తి ర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియా చ"** అన్నట్లు నీ జ్ఞానానికి కాని, కరుణకు కాని, శక్తికి కాని అంతు లేదు. అందువల్ల నీవు నా తప్పులను, వాటిని పోగొట్టే దారిని తెలిసికొని, మన్నించి, కాపాడి నీ మహిమను సుస్థిరం చేసికో. నీవు సత్పురుషుల విశ్వాసానికి పాత్రమైన ఆప్తుడవు. వారిని రక్షించడం కోసమేకదా నీవు ఎనిమిది భుజాలను కల్గి ఉన్నావు. ఇటువంటి నిన్ను శరణు పొందుతున్నాను- అని శ్లోకభావం.

ఈ శ్లోకంలో భగవానుని ఉద్దేశించి చేసిన సంబోధనాంతపదం లేదు. అధ్యాహారం చేసికోవాలి. **"భవంతమ్"** అనే పదం సంబోధనాంతం కాదు. అందువల్ల రెండవ శ్లోకమే ప్రారంభశ్లోకమని, కాని ప్రకృతశ్లోకం ప్రాచీనమైనది కావున ముందుగా అనుసంధింపబడుతున్నదని కొందఱి పెద్దల సూక్తి -అని శ్రీ ప్ర.భ. అణ్ణాస్వామివారి వ్యాఖ్యలో తెలుపబడింది.

ఇక, ఈ శ్లోకంలో ప్రయోగింపబడ్డ విశేషణపదాలన్నీ విశేషాభిప్రాయద్యోతకాలు. అవి అన్నీ అష్టభుజ స్వామియొక్క శరణత్వపూర్తిని తెలుపుతున్నాయి.

స్వామీ! ఒక మొసలిచే పట్టుకోబడ్డ ఏనుగును కాపాడడంకోసంగా **"అర్రై కులైయ త్తలై కులైయ"** అనే రీతిలో నీ నడుమున గల వస్త్రం జారిపోయేటట్లు, జుట్టుముడి వీడిపోయేటట్లు వాయువేగమనోవేగాలకంటే వేగంతో వచ్చావు కదా! అటువంటి నీవు ఆ గజేంద్రునికంటే మిక్కిలి ఎక్కువ తీవ్రమైన ఆపదలో చిక్కుకొన్న నన్ను కాపాడడంకోసం అంతకంటే ఇంకా ఎక్కువ వేగంతో రావద్దా! నా ఆర్తి ఎంతటి తీవ్రమైనదో నీకు తెలియదా! **"యః సర్వజ్ఞః సర్వవిత్"** అని అన్నట్లు నీ జ్ఞానం సమగ్రమైనది, అంతు లేనిది. నా ఆపదనుగూర్చి తెలిసినా, నీవు దయారహితుడవైతే ఊరికే ఉండవచ్చు. కాని, నీ దయకూడా అపారమైనది కదా! ఈ రెండూ ఉన్నా, నీకు శక్తి లేకపోతే రక్షించలేకపోవచ్చు. కాని, నీ శక్తి **"పరాఽస్య శక్తి ర్వివిధైవ శ్రూయతే"** అని వేదం కీర్తించిన రీతిలో చాలా గొప్పదికదా! **"సర్వజ్ఞోఽపి హి సర్వేశః సదా కారుణికోఽపి సన్, సంసారతంత్ర వాహిత్వాత్ రక్ష్యాపేక్షాం ప్రతీక్షతే"** (భగవానుడు సర్వజ్ఞుడైనా, అందఱినీ శాసించేవాడైనా, సదా కరుణను సహజంగా కలవాడైనా, సంసారమనే వ్యవస్థను

కర్మానుసారంగా నడిపేవాడు కనుక, రక్ష్యభూతుడైన జీవునినుండి అపేక్షను- అంటే -"నన్ను నీవు రక్షించాలని" మనం మనస్సులో అతనినిగూర్చి చేసే ప్రార్థనను ఎదురుచూస్తాడు కదా!) అని శాస్త్రవచనం, కనుక, **"పురుషేణ అర్థ్యతే ఇతి పురుషార్థః"** అనే వ్యుత్పత్త్యనుసారం జీవుని ప్రార్థన ఫలప్రాప్తికి ఆవశ్యకం. కనుక, ఆ విధంగా నేను ప్రార్థించలేదు, అందువల్ల నన్ను రక్షించడంలేదని అంటావా! అయితే ఇదిగో. ఆ కొఱతకూడా లేకుండా ఉండేటట్లు ఆర్తితో నిన్ను నేను శరణాగతి చేస్తున్నాను. ఇకనైనా నన్ను కాపాడు- అని శ్లోకంలోని తాత్పర్యం. ఇక, శ్లోకంలో చేయబడ్డ పదప్రయోగాలలో స్ఫురించే విశేషార్థాలను కొన్నిటిని గమనిద్దాం.

**(గజేంద్రరక్షాత్వరితం భవంతమ్)** - శరణాగతుని రక్షించడంలో అత్యంతం ఆసక్తిని, త్వరను కలవానినికదా ఆశ్రయించాలి. భగవానుడు అటువంటి స్వభావాన్ని కల్గినవాడు - అనే విషయానికి గజేంద్రమోక్షవృత్తాంతం ప్రథమోదాహరణం. ఒక తిర్యక్కుచే- అనగా- మొసలిచే పట్టుకోబడిన ఇంకొక తిర్యక్కును- అంటే- ఏనుగును రక్షించడంకోసం స్వామి తన త్వరాతిశయాన్ని ప్రదర్శించిన సందర్భం ఇది. ఆ సమయంలో భగవానుడు చూపిన త్వరను శ్రీపరాశరభట్టర్ శ్రీరంగరాజస్తవం- ఉత్తరశతకంలో అత్యద్భుతాలైన శ్లోకాలలో వర్ణించారు. **"అతంత్రితచమూపతిప్రహితహస్త మస్వీకృత ప్రణీతమణిపాదుకం కిమితి చాకులాంతఃపురమ్, అవాహనపరిష్క్రియం పతగరాజ మారోహతః కరిప్రవరబృంహితే భగవత స్త్వరాయై నమః"** (గజేంద్రుడు రక్షణకోసం చేసిన ఆర్తనాదాన్ని భగవానుడు వినగానే విష్వక్సేనుడు అందించిన చేయూతను గ్రహించలేదు. పరిజనులు తీసికొని వచ్చిన మణిపాదుకలను ధరించలేదు. అంతఃపురంలోని దివ్యదేవేరులు స్వామి చూపే వేగాతిశయాన్ని చూచి "ఏమయినది! ఏమి జరిగినది!" అని ఆకులపడ్డారు. సహజంగా అలంకరించిన గరుడుని అధిరోహించే స్వామి అపుడు ఏ అలంకారం లేని గరుడుని అధిరోహించాడు. ఈ విధంగా భగవానుడు ప్రదర్శించిన రక్షణత్వరకు నమస్కారం) అని, **"యం పశ్యన్ విశ్వధుర్యాం ధియ మసకృదథో మంథరాం మన్యమానో హుంకారాస్ఫాలాంఘ్రిప్రహతిభి రపి తం తార్క్ష్య మధ్యక్షిప స్త్వమ్, కించోదంచన్నధస్తా స్తమథ గజపతే బృంహితే జృంభమాణే దేవ! శ్రీరంగబంధో! ప్రణమతి హి జనే కాందిశీకీ దశా తే"** (శ్రీరంగానికి బంధువైన దేవా! గరుత్మంతుని వేగాన్ని చూస్తూ సకల ప్రపంచభారాన్ని వహించడంలో సమర్థమైన నీ మనస్సుయొక్క వేగాన్నికూడా మించిన ఆ గరుడుని వేగం సైతం చాలదని, తక్కువ అని భావించిన నీవు ఆ గరుత్మంతుని చూచి హుంకరిస్తూ, "చేతితో చరుస్తూ, కాళ్ళతో తన్నుతూ ఇంకా ఇంకా వేగంగా వెళ్ళమని అతనిని ప్రేరణ చేశావుకదా! గజేంద్రుని మొఱ విజృంభించగానే నీవు ఆ గరుత్మంతునిపైనుండి కిందకు దిగి అతనిని నీవే మోస్తూ వేగంగా పరుగుతీశావు. అప్పుడు నీకు కాందిశీకునకు కల్గినట్లు భయద్రుతదశ కల్గిందికదా!) ఇత్యాదిగా భట్టర్ భగవానుని త్వరను హృద్యంగా చిత్రించారు. భాగవతంకూడా భగవానుని త్వరను **"ఛందోమయేన గరుడేన సమూహ్యమాన శ్చక్రాయుధో౽భ్యగమదాశు యతో గజేంద్రః"** అని సూచించింది. నమ్మాళ్వార్లు **"తొழுజ్కాతల్ కళిఆళిప్పాన్ పుళ్ళూర్న్దు తోన్ఱినైయే"** అనే సూక్తిలోని **"పుళ్ ఊర్న్దు"** అనే ప్రయోగంద్వారా భగవానుని త్వరాతిరేకాన్ని తెలిపారు. నమ్బిళ్ళై **"పుళ్ళూర్న్దు తోన్ఱినైయే"** అనే పదసందర్భాన్ని -"**సంకల్పత్తుక్కు ముఱ్పట్టాయ్‌త్తు తిరువడివేగ మిరుప్పతు. అవన్ వేగమ్ పోరామల్ అవనైయుమ్ ఇడుక్కిక్కొణ్డితే వన్దు విழுన్దతు"** (సంకల్పంకంటేకూడా ముందుండేదిగా గరుడుని వేగం ఉన్నది. అయినా, అతని వేగం చాలక అతనినికూడా తానే మోస్తూకదా భగవానుడు వచ్చి వాలాడు) అని పరమరస్యంగా వ్యాఖ్యానించారు. భగవానుని ఈ త్వరను చూచి నిత్యసూరులు సైతం ఆశ్చర్యపడ్డారు- అనే విషయాన్ని "**విణ్ణులార్ వియప్ప వన్దు ఆనై క్కన్దు అరుళై యీన్ద కణ్ణఞా! ఉన్నై ఎన్నో కళైకళా క్కరుతుమాతే!"** **(44)** అనే తొణ్డరడిప్పొడి ఆళ్వార్ల సూక్తి తెలుపుతున్నది. ఈ సూక్తికి అనుగుణంగా శ్లోకంలోని **"గజేంద్రరక్షాత్వరితం, అత ఏవ సతమ్ ఆప్తం భవంతం ప్రపద్యే"** అనే పదయోజనను అనుసంధించడంలోని అర్థస్వారస్యాన్ని సహృదయులు గమనించగలరు. ఇటువంటి స్వామియొక్క ఆర్తరక్షణత్వరను తెలిపే ఆళ్వార్ల సువర్ణసూక్తులు, వాటికి మెఱుగుపెట్టే పూర్వాచార్యవివరణలు, ప్రయోగాలు అనేకం ఉన్నా, విస్తరభీతివల్ల ఏతావన్మాత్రంతో విరమింపబడుతున్నది.

(గ్రాహై రివాహం విషయై ర్వికృష్టః) - ఇక్కడ "గ్రాహైః" అనే పదం, ఆ పదంలోని బహువచనం సాభిప్రాయకాలు. **"ఉణ్ణిలావియ ఐవరాల్ కుమైతీత్తి"** (లోపల ఉండే పంచేంద్రియాలతో బాధించి) (తిరువాయ్-7-1-1), **"మనమాళు మోరైవర్ వన్ కుఱుమ్బర్"** (మనస్సును శాసించే అయిదుగురు దుష్టులు) (పెరియతిరువన్దాది-51) ఇత్యాది నమ్మాళ్వార్ల ప్రయోగాలకు అనుగుణంగా ఈ ప్రయోగం చేయబడింది. ఐహికవిషయాలు అనేకం అయినా పంచేంద్రియాలను ఆధారంగా చేసికొని అవి అయిదు విధాలని చెప్పబడ్డాయి. ఈ ప్రయోగానికి అనుగుణంగా తిరువాయ్మొళి ప్రబంధంలోని **"కైమ్మా తున్బమ్ కడిన్ద పిరానే !"** (2-9-1) అనే సూక్తిని వ్యాఖ్యానిస్తూ నమ్బిళ్ళై చేసిన - **"అఙ్గు ముదలై ఒన్రు- ఎనక్కు ముదలై ఐన్దు. అఙ్గు ఆయిరమ్ దేవసంవత్సరమ్ - ఇఙ్గు అనాది. అఙ్గు ఒరు శిఱియ కుళి-ఇఙ్గు పిఱవి ఎన్నుమ్ పెరుమ్ కడల్. అతుక్కు శరీరనాశమ్- ఎనక్కు ఆత్మనాశమ్. ఆనైయిన్ కాలైయాయ్త్తు ముతలై పఱ్ఱిఱ్ఱు- ఇఙ్గు ఎన్నుడైయ నెఞ్జైయాయ్ఱ్ఱు అరువి త్తిన్గిడుకిన్రతు. ఆనాల్, అతుక్కు మితుక్కు ముళ్ళ వాశి పారాయ్"** (అక్కడ మొసలి ఒకటే- ఇక్కడ మొసళ్ళు అయిదు. అక్కడ వేయి దేవసంవత్సరాల కాలం గజేంద్రుడు బాధింపబడ్డాడు. ఇక్కడ అనాదికాలంగా నేను బాధింపబడుతున్నాను. అక్కడ ఒక చిన్న మడుగు. -ఇక్కడ జన్మ అనే మహాసముద్రం. గజేంద్రునకు కలిగినది శరీరనాశం మాత్రమే -నాకు ఆత్మనాశం కల్గుతున్నది. గజేంద్రుని కాలును మాత్రం మొసలి పట్టుకొన్నది. ఇక్కడ నా మనస్సును పట్టి తింటున్నది. అందువల్ల దానికి దీనికిమధ్య ఉండే భేదాన్ని చూడు) అనే హృదయంగగమమైన వ్యాఖ్యానం స్మరణీయం. ఇటువంటి వివరణాన్నే పూర్వోదాహృతమైన తిరుమాలై ప్రబంధంలోని సూక్తిని వ్యాఖ్యానిస్తూ పెరియవాచ్చాన్పిళ్ళై చేశారు.

శ్రీదేశికులు అష్టభుజస్వామిని కీర్తించే ఈ స్తోత్రాన్ని గజేంద్రమోక్ష వృత్తాంతంతో ప్రారంభించడానికి, పేయాళ్వార్ల మూన్రామ్ తిరువన్దాదిలో - **"తొట్టపడై యెట్టుమ్ తోలాత వెన్రియాన్ అట్టపుయకరత్తాన్ అన్నాన్రు, తుట్టత్తుక్కోళ్ ముతలై తుఞ్జ కుఱిత్తెఱిన్ద శక్కరత్తాన్తాళ్ ముదలే నఙ్గట్కు చ్చార్వు"** (శ్రీహస్తాలలో ధరించిన ఎనిమిది ఆయుధాలతో అపజయం లేని (ఎల్లప్పుడు జయశీలుడైన) అష్టభుజస్వామి, పూర్వకాలంలో మడుగులోని బలిష్ఠమైన మొసలి చనిపోయేటట్లుగా గుఱి చూచి ప్రయోగించిన చక్రాయుధాన్ని కలవాడు అయిన భగవానుని శ్రీచరణాల మూలమే మనకు శరణం) అని అష్టభుజుని స్తుతించడం కారణమని కాంచీమహావిద్వాన్ ప్ర.భ. అణ్ణాస్వామివారి వ్యాఖ్యానం.



ఇక, గజేంద్రుని రక్షించడం అంటే ఏమి? అనే విషయాన్ని కొంచెం గమనిద్దాం. రక్షణమంటే ఏమి? అని ముందుగా తెలియాలి. రక్షణకార్యం- అనిష్టనివృత్తి, ఇష్టప్రాప్తి రూపమైనది. ప్రకృతంలో గజేంద్రుని విషయంలో రక్షణ ఎటువంటిది? అతనికి కల్గిన అనిష్టం ఏమి? దాని నివృత్తి ఏవిధంగా కల్గుతుంది? ఇష్టమంటే ఏమి? దాని ప్రాప్తి ఏవిధంగా కల్గుతుంది? అని విచారిస్తే, అందుకు సమాధానంగా **"నాహం కళేబరస్యాస్య త్రాణార్థం మధుసూదన!, కరస్థకమలాన్యేవ పాదయో రర్పితుం తవ"** (మధుసూదనా ! నేను నా శరీరరక్షణ కోసం నిన్ను ప్రార్థించలేదు. నా తొండంలోని తామరపూలను నీ శ్రీచరణాలలో సమర్పించడంకోసమే నిన్ను అర్థించాను) అనే పౌరాణికసూక్తి స్మరణీయం. గజేంద్రుని శరణాగతికి ప్రధానఫలం భగవానుని శ్రీచరణ కైంకర్యమే. అతనికి శరీరరక్షణ ఆనుషంగికం మాత్రమే. అందువల్లనే గజేంద్రుడు **"స తు నాగవరః శ్రీమాన్"** అని కైంకర్యలక్ష్మిని కలవాడుగా కీర్తింపబడ్డాడు. గజేంద్రుడు కోరిన భగవానుని పాదాలలో పుష్పసమర్పణ అనే కైంకర్యసిద్ధి భగవానుడు నేరుగా గజేంద్రుని ముందు ప్రత్యక్షమైనపుడు, అతనిని మొసలిబారినుండి రక్షించి నపుడు కల్గుతుంది. కనుక ఆ రెండిటిని భగవానుడు చేశాడు. గజేంద్రునివంటి పరమభక్తులు ఆశించేది భగవానుని దర్శన - స్పర్శన - సాక్షాత్కార - నమస్కారాదులనే కదా. **"శ్రద్ధావాన్ భజతే"** అనే గీతాసూక్తిని (6-47) శ్రీరామానుజులు **"అత్యర్థమత్ప్రియత్వేన క్షణమాత్రవిశ్లేషాసహతయా మత్ప్రాప్తిప్రవృత్తౌ త్వరావాన్ యో మాం భజతే"** అని వ్యాఖ్యానించారు కదా! **"అయఱ్పిలన్ అలఱ్ఱువన్ తళువువన్ వణఙ్గువన్"** అని ఆశపడ్డారు ఆళ్వార్లుకూడా.

శ్రీవిష్ణుసహస్రనామస్తోత్రంలో గజేంద్రమోక్షోపాఖ్యానానికి చెందిన నామాలలో **"రక్షణః"** (928) అనే నామం ఒకటి ఉన్నది. ఈ నామం భగవానుడు

గజేంద్రుని రక్షించాడని తెలుపుతున్నది. దీనిని వ్యాఖ్యానించే శ్రీపరాశరభట్టర్ **"తం స్పర్శపరిరంభణసాంత్వనాదిభిః రక్షితవాన్"** అని పల్కి, దీనికి ప్రమాణంగా **"ఏవముక్త్వా కురుశ్రేష్ఠ! గజేంద్రం మధుసూదనః, స్పర్శయామాస హస్తేన"** అనే పౌరాణికశ్లోకాన్ని ఉదాహరించారు. అందువల్ల భగవానుడు మహావేగంగా గజేంద్రుని వద్దకు వచ్చి అతనిని మొసలిబారినుండి విడిపించి దర్శనాన్ని అనుగ్రహించి, తన చేతులతో అతని గాయపడిన కాలును స్పృశించి, ఓదార్చి, అతడు సమర్పించిన పూలను స్వీకరించి అతని ఆర్తిని ఉపశమింపజేశాడని తెలుస్తున్నది. **"ఆనైక్కు అన్రు అరుళై ఈన్ద"** అనే తిరుమాలై ప్రబంధసూక్తిని పరమకారుణికులు, వ్యాఖ్యాతృచక్రవర్తి పెరియవాచ్చాన్ పిళ్ళై వివరిస్తూ -**"అరుళు కైయావతు- ముదలైయిన్ వాయిల్ నిన్రుమ్ మీట్టు, అవనుడైయ నొన్ద కాలై తిరుక్కైయాలే తడవి యరుళి, ఆశ్వసిప్పిత్తు, అవన్ కైయిల్ పూవై తన్ తిరువడికళిలే యిడువిత్తుక్కొళ్ళుకై"** అని అనుగ్రహించడం ప్రకృతంలో స్మరణీయం. ఈ అద్భుత రసావహసందర్భాన్ని కూరేశులు తమ హృదయంలో ఆర్ద్రంగా, హార్దంగా సంభావిస్తూ- **"విశ్వం ధియైవ విరచయ్య నిచాయ్య భూయః సంజహ్రుషః సతి సమాశ్రిత వత్సలత్వే, ఆజగ్ముష స్తవ గజోత్తమబృంహితేన పాదం పరా మమృశుషోఽపి చ కా మనీషా"** అనే రసోదంచితమైన శ్లోకాన్ని శ్రీవైకుంఠస్తవంలో రచించారు. ఈ విధమైన తగిన శారీరకమానసికచికిత్సను చేసి స్వామి గజేంద్రుని రక్షించాడనే విషయాన్ని **"విద్వత్తమః"** అనే నామం **(920)** తెలుపుతున్నదని కూడా భట్టర్ తమ భాష్యంలో తెలియజేశారు.

**(అపారవిజ్ఞానదయానుభావమ్)** - ఉపనిషత్తులు భగవానుని ఆనంద గుణాన్ని లెక్కించాలని తలచి, ఆ పని సాధ్యం కానందువల్ల, **"యతో వాచో నివర్తంతే, అప్రాప్య మనసా సహ"** అని వెనుదిరిగాయి. కావున **"ఉయర్వఱ ఉయర్నల ముడైయవన్"** అని అనే రీతిలో భగవానుని ఆనందగుణం వాఙ్మనసాతీతం. ఇటువంటి స్వభావం కల్గినది కేవలం భగవానుని ఆనంద గుణం మాత్రమే కాదు; అన్ని గుణాలు ఇటువంటివే. అందువల్ల **"అపార"** అనే విశేషణం. **"విజ్ఞాన, దయ, అనుభావా"**లనే గుణాలకన్నిటికీ అన్వయిస్తుంది. అనుభావం అంటే -శక్తి. లేక, మహిమ -అనికూడా చెప్పవచ్చు.



శరణాగతుల ఆర్తినిగూర్చి పూర్ణంగా తెలియడానికి జ్ఞానం ఉపకరిస్తుంది. జ్ఞానమంటే -**"యో వేత్తి యుగపత్ సర్వం ప్రత్యక్షేణ సదా స్వతః"** ఇత్యాదిగా నిర్వచింపబడ్డ సార్వకాలిక -సార్వదేశిక- సర్వవిధ- సర్వవస్తుసాక్షాత్కారం. **"పరాఽస్య శక్తి ర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియా చ"** అని వేదం కూడా దీని గొప్పతనాన్ని కీర్తించింది. **"ఇవనుక్కు నివర్త్యమాన అనిష్టత్తైయుమ్, ప్రాప్తవ్యమాన ఇష్టత్తైయుమ్ అఱియుమ్"** అనే రీతిలో ఈ జ్ఞానం శరణాగతుని ఇష్టానిష్టాలనుగూర్చి తెలియడానికి ఉపకరించే గుణం. దయ అంటే- స్వార్థ నిరపేక్షమైన పరదుఃఖాసహిష్ణుత్వం. **"దయా పరవ్యసనహరా"** అని, **"దయాన్యేషాం దుఃఖాప్రసహనమ్"** ఇత్యాదిగా ఇది నిర్వచింపబడింది. ఈ దయాగుణం, భక్తుడు చేసిన పలు అపచారాలను లెక్కించకుండా, స్వామి రక్షించడంలో ఉపకరిస్తుంది. అందువల్ల తాము చేసిన అపరాధాలను చూచి వెనుకంజ వేయనక్కరలేదనే ధైర్యాన్ని కల్గించి భక్తులను ముందడుగు వేయిస్తుంది. అనుభావమనే పదానికి ఇక్కడ ప్రకరణబలంవల్ల శక్తి అనే అర్థాన్ని గ్రహించడంలో ఔచిత్యం ఉన్నది. అఘటితఘటనాసామర్థ్యమే శక్తి అని ఈ గుణనిర్వచనం. దీనివల్ల ఇది భగవానుని ఆపత్సఖత్వాన్ని, అభిమత ప్రదాయకత్వాన్ని తెలుపుతున్నదని పూర్వాచార్యుల వివరణం.

కేవలం జ్ఞానం ఉన్నంతమాత్రాన చాలదు. భక్తుని రక్షించాలనే దయాగుణంకూడా ఉండాలి. జ్ఞానం, దయ - అంటే చాలదు. భక్తుని అభిమతాలను సాధించగల అఘటితఘటనాసామర్థ్యం ఉండాలి. లేకపోతే శరణాగతి ఫలపర్యవసాయి కాదు. కావున శక్తి ఆవశ్యకం. ఈ విధంగా జ్ఞానం, దయ, శక్తి -అనే మూడు గుణాలు శరణాగతుని కార్యం సఫలం కావడానికి హేతువులు. కనుక ప్రకృతంలో ప్రస్తావింబడ్డాయి. కూరేశులుకూడా అతిమానుష స్తవం చివరి శ్లోకంలో **"త్వద్ జ్ఞానశక్తికరుణాసు సతీషు నేహ పాపం పరాక్రమితు మర్హతి మామకీనమ్"** అని అంటూ శరణాగతరక్షణలోని ఈ గుణత్రయ ప్రాధాన్యాన్ని నొక్కి వక్కాణించారు. ఈ కూరేశసూక్తిని వ్యాఖ్యానిస్తూ గార్గ్య శ్రీనివాసాచార్యులవారు **"యథా తథావాఽపి శరణాగతః" ఇత్యుక్తిమతాం** ప్రతిబంధకపాపనిరసనద్వారా త్వచ్చరణారవింద నిరంతర దాస్య ప్రదాన **దీక్షితాసు త్వద్జ్ఞానశక్తికరుణాసు"** అని వివరించడమే కాక, **"పాత్రం**

దయయైవేతి ప్రకరణానుగుణ్యాత్ దయాయాః ప్రాధాన్యం, జ్ఞానశక్త్యోః తదంగత్వ మితి సంప్రదాయః" అని అన్నారు. అందువల్ల శరణాగత రక్షణంలో అత్యంతం ప్రధానాలైన జ్ఞానదయాశక్తులనే మూడింటిలో కూడా దయకే పెద్ద పీట వేయబడింది. ఈ అంశం 5వ శ్లోకవ్యాఖ్యలోకూడా మఱికొంత ప్రస్తావింప బడుతుంది.

మొదటి పాదంలో ప్రస్తుతింపబడ్డ గజేంద్రరక్షావృత్తాంతంద్వారా భగవానుని వాత్సల్యం, సౌశీల్యం, సౌలభ్యం, స్వామిత్వం సూచింపబడగా, మూడవపాదంలో జ్ఞానం, దయ, శక్తి, వీటిద్వారా అర్థాత్ పూర్తి, ప్రాప్తి తెలుపబడ్డాయి. ఈ విధంగా ఇక్కడ ఆశ్రయణసౌకర్యాపాదకాలు, ఆశ్రిత కార్యానుగుణాలు అయిన గుణాలన్నీ సూచింపబడినందువల్ల ఇక్కడ స్వామి యొక్క శరణత్వపూర్తి తెలుపబడింది. ఇటువంటి శరణ్యత్వపూర్తిని కలవాడవు కనుకనే -

**(ఆప్తం సతామ్)** - సత్పురుషులకు విశ్వసింపదగినవాడవు. "ఆప్తః ప్రత్యయితః" అని అమరకోశవచనం. నమ్మదగినవానికి ఆప్తుడనిపేరు. "ఆప్నోతి రహస్యాని" అనే ఆప్తశబ్దవ్యుత్పత్తిని చెప్పడం కూడా ప్రకృతంలో సరసం. ఎవరికి నమ్మదగినవాడు ? అంటే, "సతామ్" అని సమాధానం. సత్పురుషులకు అని తాత్పర్యం. సాధుజనులచే విశ్వసింపబడి ఆశ్రయింపబడడంవల్ల భగవానుడు మనకు ఆదరణీయుడు. "సౌమ్యోపయంతృమునినా మమ దర్శితౌ తౌ శ్రీవేంకటేశ ! చరణౌ శరణం ప్రపద్యే" అనే అణ్ణన్ సూక్తి ఇక్కడ స్మరణీయం. ఈ విధంగా ఈ సందర్భంలో ఆచార్యరుచిపరిగృహీతమైన విషయమే ఉపాదేయమనే సంప్రదాయరహస్యం నిగూఢంగా, మధురంగా సూచింప బడింది. "ఆప్తం సతామ్, అత ఏవ భవంతం శరణం ప్రపద్యే" అనే అన్వయం ఇక్కడ వివక్షితం.

ఆప్తుడంటే సర్వవిధబంధువనికూడా విజ్ఞులైన పూర్వాచార్యుల వివరణ. దీనివలన భగవానునకు జీవునితో గల సహజసిద్ధమైన, "మాతా పితా భ్రాతా నివాసః శరణం సుహృద్గతి ర్నారాయణః" అని, "తాయాయ్ తన్దైయాయ్ మక్కళాయ్ మ*ర్రు*మాయ్ ము*ర్రు*మాయ్" అని, "నమ్మక్కళుమ్ మేలా



త్తాయ్ తన్దైయుమ్" అని, "మాతా పితా యువతయ స్తనయా విభూతిః సర్వమ్" అని ఈ రీతిలో ఉభయవేదాలలో, పూర్వాచార్యసూక్తులలో ఘోషింపబడిన సర్వవిధబంధుత్వరూపమైన భగవానుని ఆప్తత్వం ఇక్కడ తెలుపబడింది.

తిరువాయ్మొ*ళి* ప్రబంధంలో నమ్మా*ళ్వా*ర్లు చేసిన "తిరుమోకూర్ ఆత్తన్ తామరైయడి యన్ఱి మ*ర్రి*ల మరణే" (తిరుమోకూర్‌లోని ఆప్తుడైన భగవానుని తామరపూలవంటి శ్రీచరణాలు తప్ప ఇంకొక గతిని కలవారం కాము) అనే ప్రయోగంలోని ఆప్తశబ్దాన్ని వ్యాఖ్యానిస్తూ "పరమబంధు. తాన్ తనక్కిల్లాత మరణసమయత్తిల్", అహం స్మరామి మద్భక్తం నయామి పరమాం గతిమ్ -ఎన్నుమ్ ఆప్తతమన్" (పరమబంధువు. తాను తనకు రక్షించుకోలేని మరణసమయంలో- "నేను నా భక్తుని స్మరిస్తాను. ఉత్తమగతికి తీసికొనిపోతాను" అనే ఆప్తతముడు). అని నమ్బిళ్ళై అనడం ఇక్కడ స్మరణీయం. లోకంలో ఎవరివద్దనైనా దాచుకొన్న ధనం (న్యాసం) సమయానికి ఉపయోగపడకపోవడం గాని, ఆ న్యాసాన్ని రక్షిస్తారని అనుకొన్నవారు రక్షించలేకపోవడం గాని, అన్యాయంగా దానిని వారు చేజిక్కించుకోవడం గాని జరుగవచ్చు. కాని, పరమాప్తుడైన భగవానుని విషయంలో ఆ ఉపద్రవాలు ఏమీ లేవు. "ఆప్తస్తు యథార్థవక్తా" అని నైయాయికుల నిర్వచనం. యథార్థాన్ని దాచకుండా చెప్పేవాడు ఆప్తుడు. "సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ, అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః" అని, "సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే, అభయం సర్వభూతేభ్యో దదామ్యేతత్ వ్రతం మమ" అని, "అహం స్మరామి మద్భక్తం నయామి పరమాం గతిమ్" -అని ఈ విధంగా యథార్థాన్ని పల్కినవాడు కదా స్వామి.

శరణాగతిని తెలిపే ప్రస్తుతసందర్భానికి అనుగుణంగా -"ఆప్తమ్" అనే పదానికి "రక్షకత్వేన విశ్వసనీయమ్" (రక్షకునిగా నమ్మదగినవాడు) అనే అర్థాన్ని గ్రసించడం సరసం. నమ్మా*ళ్వా*ర్లు "నమ్బనై" (తిరువాయ్మొ*ళి*-3-7-8) అని అంటూ భగవానుని అత్యంతం విశ్వసనీయుడని చేసిన ప్రయోగానికి నమ్బిళ్ళై చేసిన ఈ అద్భుతవివరణం ప్రకృతంలో అనుసంధేయం- "నమ్బనై- నమ్బప్పడు మవనై. ఏదేనుమ్ దుర్దశైయిలుమ్ ఆత్మావుక్కు త్త్‌జ్ఞమానవనై. ఇవనై యొ*ళి*న్ద బంధుక్కళ్ విశ్వసనీయరల్లర్- ఎన్లై. "స పిత్రా చ - పె*ఱ్ఱా*ర్ పె*ఱ్ఱొ*ళిన్దార్"

ఇత్యాది. మహావ్యాధియాళనానవన్ ఎనక్కు ఇన్నపోతిల్ ఇన్ద వ్యాధి వన్దు నలియుమ్; అప్పోతు నాన్ ఎన్నై అఱియేన్. పిరానే! అప్పోతు ఎన్నై రక్షిక్కవేణ్డుమ్" - ఎన్ఱు స్వస్థదశైయిలే అఱివిత్తువైత్తాల్, అవర్కళ్ ఉణర్న్దిరున్దు నోక్కుమాపోలే, తాన్ తనక్కుతవాత దశైయిలుమ్ ఈశ్వరన్ రక్షిక్కుమ్పడి. స పిత్రా చేత్యాది" ఈశ్వరన్, తనక్కుమ్ ఆకాత వన్ఱుమ్ తఞ్జమావాన్ తానే యాయ్ ర్రు. పెరుమాళ్ పక్కల్ పణ్ణిన అపకారత్తై ప్పార్త్తు తమప్పన్ కైవిట్టాన్. చకారత్తాలే తాయుమ్ కైవిట్టాళ్ ... ఇప్పడి ఎల్లా అవస్థైకళిలుమ్ విశ్వసనీయన్ సర్వేశ్వరనే" ("నమ్బనై"- నమ్మదగినవాడు. ఎట్టి దుర్దశలో అయినా ఆత్మకు రక్షకుడైనవాడు. ఇతడు తప్ప మిగిలిన బంధువు లెవ్వరూ విశ్వసించదగినవారు కారని భావం. **"స పిత్రా చ"** -కాకాసురుడు తండ్రిచే, తల్లిచేకూడా విడువబడ్డాడు. "కన్నవారు కని వదలిపెట్టారు'' **(పెఱ్ఱార్ పెఱ్ఱొళిన్దార్)** మొదలైనవి ప్రమాణాలు స్మరణీయం. తీవ్రమైన వ్యాధిచే బాధింపబడేవాడు- "భవిష్యత్తులో మరణ సమయంలో ఇటువంటి వ్యాధులు నన్ను బాధిస్తాయి. అపుడు నన్ను నేను తెలియలేను. స్వామీ! ఆ సమయంలో నీవే నన్ను కాపాడాలి'' అని స్వస్థదశలో ప్రార్థిస్తే అతడు తనకు తాను సహాయపడలేని అంతిమ దశలో ఈశ్వరుడు రక్షిస్తాడు. **"స పిత్రా చేత్యాది"** -తనకు తాను రక్షకుడు కాని సమయంలో భగవానుడే రక్షకుడు. శ్రీరాముని విషయంలో కాకాసురుడు చేసిన అపకారాన్ని చూచి అతని తండ్రి అతనిని వదలిపెట్టాడు. **"పిత్రా చ"** అనే పదంలోని చకారంచేత తల్లికూడా వదలిపెట్టిందని సూచింపబడింది.....ఈ విధంగా అన్ని దశలలోను నమ్మదగినవాడు భగవానుడే) కనుక ఇక్కడ అష్టభుజస్వామి **"ఆప్తమ్"** అని కీర్తింపబడ్డాడు.

**(త్వాం ప్రపద్యే)** - ఇటువంటి పరమాప్తుడవై, జ్ఞానదయాశక్తి గుణ విశిష్టుడవై, భక్తరక్షణత్వరను కల్గిన అష్టభుజస్వామివైన నిన్ను శరణాగతి చేస్తున్నాను.

ఈ సందర్భంలో ఒక సందేహం కలుగవచ్చు. భగవానుడు అంతు లేని జ్ఞానాన్ని, దయను, శక్తిని కలవాడు. సౌశీల్యసౌలభ్యాది గుణపూర్ణుడు. నిరంకుశస్వతంత్రుడు. రక్షించాలనే ఆశను, త్వరను కలవాడు. అయినపుడు



భక్తుని ఆర్తిని, క్లేశాలను తానే స్వయంగా గ్రహించి, అయ్యో! అని జాలిపడి, తగిన విధంగా రక్షింపగల్గినవాడు. ఇక, జీవుని శరణాగతితో ఏమి పని? భగవానుడే శరణాగతిని ఎదురు చూడకుండా రక్షించవచ్చునుకదా! అన్నది ఇచటి సందేహం. దీనికి పూర్వాచార్యులు చక్కని సమాధానాన్ని ఇచ్చారు. **"ఇతు చైతన్యకార్యమ్, అభిముఖ్యద్యోతకమ్"** అనే శ్రీపిళ్ళైలోకాచార్యులవారి సూక్తి, దానికి శ్రీమద్వరవరమునులు చేసిన వ్యాఖ్య ఇక్కడ స్మరణీయం. భగవానుడు జీవునినుండి ఏమి అపేక్షిస్తాడు? అని అంటే, **"రక్ష్యాపేక్షాం ప్రతీక్షతే"** అనే రీతిలో తనను రక్షకునిగా జీవుడు అనుమతించాలని మాత్రమే స్వామి ఆశిస్తాడు. ఆ అనుమతి, ఆభిముఖ్యం **"ప్రపద్యే"** అనే వచనంద్వారా స్వామి సన్నిధిలో నివేదించడం జీవుని కర్తవ్యం. మోక్షం పరమపురుషార్థం కదా! **"పురుషేణ అర్థ్యతే ఇతి పురుషార్థః"** అని కదా పురుషార్థశబ్దనిర్వచనం. జీవుని ప్రార్థనతో పనిలేకుండా భగవానుడు రక్షించవలసివస్తే సర్వముక్తిప్రసంగం, ఆ విధంగా చేయకపోతే వైషమ్య నైర్ఘృణ్యాది దోషాలు స్వామికి సంభవిస్తాయి.

భగవానుడు నిరుపాధికరక్షకుడైనా, అతడు చేసే రక్షణకు "నీవు నాచే రక్షింపబడవలసినవాడవు'' అని భగవానుడంటే, జీవుడు కాదనకుండా భగవానుని రక్షకత్వాన్ని అంగీకరించడం ఆవశ్యకం. అంటే- భగవానుడు చేసే రక్షణ ప్రయత్నానికి జీవుడు మోకాలు అడ్డకుండా ఉండడమే. ఇదే ప్రపత్తి. అప్రతిషేధ ద్యోతకం. భగవానుడు **"స్వప్రవృత్తినివృత్తిః ప్రపత్తిః"** అని కదా ప్రపత్తి నిర్వచనం **"త్వం మే"** (నీవు నా వాడవు) అని అంటే, జీవుడు **"అహం మే"** (నేను నావాడనే) అని అనకుండా, **"అహం తే"** (నేను నీవాడను) అని భగవదేకరక్ష్యత్వాన్ని అంగీకరించడమే ప్రపత్తి. ఈ విధంగా అనడం భగవానునకు ఆనందదాయకం. కనుక, ప్రపత్తి అవశ్యకర్తవ్యమని సారాంశం. ఈ శ్లోకంలో వక్తవ్యాంశాలు ఇంకా ఉన్నా, విస్తృతిభయంవల్ల ఇంతటితో ముగింపబడుతున్నది.

**2.** **త్వదేకశేషోఽహ మనాత్మతంత్రః**
**త్వత్పాదలిప్సాం దిశతా త్వయైవ ।**
**అసత్సమోఽప్యష్టభుజాస్పదేశ**
**సత్తా మిదానీ ముపలంభితోఽస్మి ॥**

అష్టభుజాస్పదేశ = ఓ అష్టభుజస్వామీ !, త్వత్ + ఏకశేషః = నీకు ఒక్కనికి మాత్రమే శేషభూతుడనై, అనాత్మతంత్రః = స్వాతంత్ర్యం లేనివాడనైన, అహం = నేను, అసత్సమః అపి= (ఇంతవరకు) అసత్కల్పుడను అయినా, త్వత్ పాదలిప్సాం = నీ శ్రీచరణాలను పొందాలనే ఆశను, దిశతా = అనుగ్రహించే, త్వయా+ఏవ = నీచేతనే, ఇదానీం = ఇపుడు, సత్తాం = సత్తను, ప్రతిలంభితః+ అస్మి = పొందింపబడినవాడనై ఉన్నాను.

**"మరువిత్తొழுమ్ మనమే తన్దాయ్ !"** అని, **"ఇశైవిత్తు ఎన్నై యున్ తాళిణైక్కీழ் ఇరుత్తు మమ్మానే !"** అని, **"ఎన్నుణర్విన్నుళ్ళే యిరుత్తినేన్, అతువుమవనతు ఇన్నరుళే"** అని నమ్మాழ்వార్లు పల్కిన సూక్తులను అనుసంధిస్తూ రచించిన శ్లోకరత్నం ఇది. **"తెఱినుణర్వు ఒన్ఱిన్మైయాల్ తీవినైయేన్ వాళాదిరున్దొழிన్దేన్ కీழ்నాళ్కళెల్లామ్"** అనే రీతిలో పూర్వం గడచిన కాలాలలో ఇష్టం వచ్చినట్లుగా తిరిగి అసత్కల్పుడనై పడి ఉన్నాను. తన సొత్తు పాడయిపోతూ ఉంటే చూస్తూ ఊరకే ఉండలేని జగత్స్వామివి అయిన నీవే **"మడిమాఙ్గాయిట్టు"** అనేటట్లుగా ఏవో కొన్ని యాదృచ్ఛిక- అజ్ఞాతసుకృతాలను నాలో ఆరోపించి రక్షించాలని భావించి, నీ శ్రీచరణాలలో రుచిని కల్గించావు. నాకు సత్తను కల్గించావు. కనుక ఉజ్జీవించగలిగాను- అని భావం.

**(అష్టభుజాస్పదేశ !)** - **"అష్టభుజ!"** అని సంబోధిస్తేనే చాలి ఉండగా, ఈ విధమైన సంబోధనను చేయడం ఎందుకోసం ? అష్టభుజుని ఆస్పదానికి ఈశా! అని దేశికులు ఎందుకోసం అంటున్నారు ? అనే విచికిత్స ఇక్కడ కలుగవచ్చు. దీనికి సమాధానం తిరుమఙ్గై ఆழ்వార్లయొక్క అనుభవాన్ని ఇక్కడ వివరించడంద్వారా తెలుపబడుతున్నది. పెరియ తిరుమొழி ప్రబంధంలోని **"తిరిపుర మూన్ఱె రిత్తానుమ్" (2-8)** అనే దశకంలో తిరుమఙ్గైయాழ்వార్లు ఈ దివ్యదేశాన్ని నాయికాభావంతో కీర్తించడం ప్రసిద్ధం. ఈ దశకానికి ముందున్న దశకంలో ఆழ்వార్లు **"తామాన తన్మై"** ను- సహజమైన తాము పురుషుల మనే భావాన్ని - భక్త్యతిశయంవల్ల కోల్పోయి, స్త్రీభావనతో అందులోని నాయిక తల్లి పలికే వచనాల రూపంలో తమ ఆర్తిని వ్యక్తం చేశారు. ఆழ்వార్ల ఆర్తిని మనస్సులో భావించి భగవానుడు -"అయ్యో! ఈ ఆழ்వార్లను ఈ విధంగానా నేను



క్లేశపెట్టాను! తమ దుఃఖాన్నిగూర్చి తామే మొఱపెట్టే విధంగాకూడా చేశానే! వీరి ఆర్తిని తీర్చడంలో ఎంత ఆలస్యం చేశాను?" అని బాధతో తలపై మోదుకొని, భక్తులకు పరమభోగ్యమైన దివ్యమంగళ విగ్రహసౌందర్యాన్ని, కల్యాణ గుణాలను ప్రకాశింపజేస్తూ కాంచీపురంలోని ఒకచోట **"శెమ్బొన్ ఇలఙ్గు వలఙ్కైయాழிతిణ్ శిలై తణ్డొడు శఙ్గమ్ ఒళ్ వాళ్ ఉమ్బర్ ఇరుశుడర్ ఆழிయోడు కేడక మొణ్మలర్"** అనే రీతిలో ఎనిమిది భుజాలలో ఎనిమిది ఆయుధాలను ధరించి అష్టభుజరూపుడై పరమభోగ్యంగా ఆழ்వార్లకు దర్శనాన్ని అనుగ్రహించాడు. తిరుమఙ్గైయాழ்వార్లుకూడా గడచిన దశకంలోవలెనే ఈ దశకంలోకూడా పరకాలనాయకిభావనతోనే అష్టభుజస్వామిని సేవించారు. ఆ భగవానుని రూపం అపూర్వంగా పరకాలనాయకికి తోచింది **"ఆழிయొడుమ్ పొన్నార్ శార్ఙ్గముడైయ అడికళై ఇన్నారెన్ఱఱియేన్"** అనే రీతిలో ఆ స్వామిని ఇదమిత్థంగా తెలియలేకపోయారు. పూర్తిగా తెలియకుండా ఉండలేకపోయారు. తమ బుద్ధితో తెలియడానికి వీలు కాలేదు. ఏమి చేయడమో తోచలేదు. మీరెవరు? అని అడగాలంటే నోరు పెగలలేదు. ముఖాన్ని నేరుగా చూచి మాటలాడలేనట్లుగా స్వామి జ్యోతిఃప్రవాహం అలలు లేచి ఆழ்వార్ నాయకిని అడ్డుకున్నది. అందువల్ల ముఖాన్ని చూచి "నీవెవరు?" అని అడగలేకపోయారు. ఈయన నా భర్తయే అయి ఉండాలి" అని మనస్సులో ఒక భావన కల్గినందువల్ల సిగ్గుపడి నేరుగా "నీవెవరు" అని అడగలేకపోయారు- పరకాలనాయకీ భావాన్ని పొందిన తిరుమఙ్గై ఆழ்వార్లు. కాని, అడిగి తెలిసికోవాలనే ఔత్సుకం మాత్రం గాఢంగా కల్గింది. స్వామినే నేరుగా చూచి అడగకుండా, ప్రక్కనే ఉన్న ఇంకొకరిని చూచి "ఈ పెద్దమనిషి ఎవరు?" అని అడగగానే, స్వామి వెంటనే స్వయంగా "నేను అష్టభుజస్వామిని" అని బదులిచ్చాడు. ఇదంతా ఆழ்వార్లకు కల్గిన మానసికసాక్షాత్కారం. ఈ సంగతిని గమనిస్తూ ఉండే పరకాలనాయకి తల్లి, చెలికత్తెలు మొదలైనవారు పరకాలనాయకిని చూచి "అమ్మాయీ! నీకేదైనా భ్రమ కల్గిందా? ఈ విధంగా మాటలాడుతున్నావేమి ?" అని ప్రశ్నించారు. అపుడు పరకాలనాయకి "నేను ఏమీ భ్రమించలేదు. నేనొక మహాపురుషుని సేవించాను. ఆయనను నేరుగా ప్రశ్నించలేక, వేఱొకరిని చూచి అడిగే భావనతో "ఈయన ఎవరో కదా!" అని ప్రశ్నించాను. స్వామి అపుడు "నేను అష్టభుజ

నగరం వాడను'' (**"అట్టపుయకరత్తేన్"**) అని బదులిచ్చాడు, చూడండి'' అని తన తల్లితో, సఖులతో పలికే రీతిలో ఈ దశకం అనుగ్రహింపబడింది.

ఇక్కడ పరిశీలించదగిన విషయం ఒకటి ఉన్నది. **"ఇవర్ ఆర్ కొల్ ?"** అనే ప్రశ్నకు సమాధానం ఇచ్చే స్వామి **"నాన్ అట్టపుయన్"** (నేను అష్టభుజుణ్ణి) అని సమాధానం చెప్పవలసి ఉండగా **"అట్టపుయకరత్తాన్"** (అష్టభుజ నగరంవాడను) అని అనడం ఎందుకు? అనే విషయం గమనార్హం. దీనికి సమాధానం ఏమంటే- నేను అష్టభుజస్వామిని - అని అంటే స్వామి తన విషయాన్ని తానే వ్యక్తంగా చెప్పినట్లవుతుంది. ఆ విధంగా తనను తాను వ్యక్తం చేసికొనే అభిప్రాయం భగవానునకు లేదు. తాను వేఱే వ్యక్తిని అని అసత్యాన్ని చెప్పే అభిప్రాయంకూడా లేదు. కనుక, చాలా చాతుర్యంతో చెప్పిన సమాధానమే- **"అట్టపుయకరత్తేన్"** అనేది. "అష్టభుజక్షేత్రానికి నేను అధిపతిని'' అని కాని, "అష్టభుజక్షేత్రంలో ఉండేవాడను ఒకడను'' అని సామాన్యంగా పల్కినట్లుగా కాని ఈ సమాధానానికి తాత్పర్యం చెప్పవచ్చు. దుష్యంతమహారాజు వేట ఆడుతూ పోయి, శకుంతల ఉన్న కణ్వాశ్రమానికి వెళ్ళినపుడు అతనిని ఆశ్రమవాసులు నీవెవరవని అతనిని ప్రశ్నించగా- **"భవతి యః పౌరవేణ రాజ్ఞా ధర్మాధికారే నియుక్తః సోఽహమ్"** (పురుషవంశప్రభువుచేత ధర్మకార్యాలను నిర్వహించడం కోసం నియమింపబడినవాడను నేను) అని చాలా చాతుర్యంతో సమాధానం పల్కడం దీనికొక దృష్టాంతం. "పురువంశప్రభువైన తన తండ్రిచేత నియమింపబడ్డ ప్రభువును నేను'' అని, "పురువంశప్రభువుకు సేవకుడను నేను'' అని రెండు విధాలుగా అర్థం చెప్పినట్లే, ప్రకృతపాశురంలోని **"అట్టపుయకరత్తేన్"** అనే బదులుకుకూడా రెండు విధాలుగా చమత్కారమైన అర్థాన్ని చెప్పవచ్చు. **"అష్టభుజాఖిలేశ!"** అనే కొందఱి పాఠం సర్వాత్మనా విరసం. కొందఱు **"అష్టభుజాస్పదేశ!"** అనే సంబోధనలోని మర్మాన్ని గమించలేక "ఎనిమిది భుజాలకు ఆస్పదుడవైన ఈశా!'' అని అర్థం చెప్పారు. అదికూడా అసంబద్ధం. ఇంకా, కొందఱు **"అష్టభుజాపదేశ!"** అనే పాఠాన్ని గ్రహించి, అష్టభుజుడనే తిరునామాన్ని కలవాడా! అనే అర్థాన్ని చెప్పారు. కాని, ఈ పాఠం కూడా కవికి అభిమతం కాదు. **"అట్టపుయకరత్తాన్"** అని ఆళ్వార్లు అనుగ్రహించిన సూక్తికి అనుగుణమైనపాఠం. **"అష్టభుజాస్పదేశ"** అన్నదే- అనే విషయాన్ని సంప్రదాయజ్ఞులైన సహృదయరసికులు గ్రహించగలరు.



3. స్వరూపరూపాస్త్రవిభూషణాద్యైః
పరత్వచింతాం త్వయి దుర్నివారామ్ ।
భోగే మృదూపక్రమతా మభీప్సన్
శీలాదిభి ర్వారయసీవ పుంసామ్ ॥

స్వరూపరూప +అస్త్రవిభూషణ + ఆద్యైః = స్వరూపం, దివ్యమంగళ విగ్రహం, దివ్యాయుధాలు, దివ్యవిభూషణాలు మొదలైనవాటిచే, త్వయి = విషయంలో దర్శించే, పుంసాం = మానవులకు, దుర్నివారమ్ = వారించడానికి వీలులేని రీతిలో కలిగే, పరత్వచింతాం = పరత్వభావనను, భోగే = అనుభవంలో, మృదు + ఉపక్రమతాం = మెల్ల మెల్లగా (స్వాత్మిక్క సాత్మిక్క) ఉపక్రమించడాన్ని, అభీప్సన్ ఇవ = కోరేవానివలె, శీలాదిభిః = సౌశీల్యం, వాత్సల్యం మొదలైన గుణాలతో, వారయసి = వారిస్తున్నావు.

ఈ శ్లోకంలో గల పరమగంభీరమైన భావాన్ని సంప్రదాయార్థానుభవ రసికులే గ్రహించగలరు. స్వామి అష్టభుజుడై ప్రకాశించే సన్నివేశంలో పరత్వ-సౌలభ్యాలు రెండు గొప్పగా ప్రకాశిస్తున్నా, పరత్వంకంటే సౌలభ్యమే మించి ప్రకాశించే రీతిని మనస్సులో పెట్టుకొని, ఆళ్వార్లు దానికొక హేతువిశేషాన్ని ఇందులో ఉల్లేఖిస్తున్నారు. అష్టభుజస్వామిస్వరూపాన్ని చూస్తే పరత్వమే మూర్తీభవించినట్లున్నది. దివ్యమంగళవిగ్రహాన్ని చూస్తే **"రూపమేవాస్య ఏతన్మహిమానం వ్యాచష్టే"** అనే రీతిలో పరత్వాన్ని ప్రకటిస్తున్నది. **"శెమ్బొనిలఙ్గు వలజ్ఞైయాళి తిణ్ శిలై తణ్డొడు శఙ్గమొళ్ వాళ్ ఉమ్బరిరుశుడరాళియొడుమ్ కడకమొణ్మలర్"** అనబడిన అష్టదివ్యాయుధాలు, కిరీటమకుటచూడావతంస - మకరకుండల గ్రైవేయకహారకేయూరకటక శ్రీవత్సకౌస్తుభముక్తాదామోదరబంధన పీతాంబర కాంచీగుణనూపురాద్యపరిమితదివ్యభూషణాలు, **"వక్షస్థల్యాం తులసి కమలాకౌస్తుభై ర్వైజయంతీ సర్వేశత్వం కథయతి తరాం ....రంగధామ్నః"** అని శ్రీపరాశరభట్టర్ అనుగ్రహించిన రీతిలో పరత్వసూచకాలుగా భాసిస్తున్నాయి. ఈ విధంగా వీటిని అన్నిటిని సేవించేటపుడు "ఇతడు పరాత్పరుడు కదా !

ఇతని దగ్గరకు మనం పోగలమా!'' అని వెనుకంజ వేసేటట్లుగా ఉంటుంది. ఆ విధంగా జంకినవారు **"వళవేఝులకు"** దశకంలో నమ్మాళ్వార్లు వెనుకంజ వేసినట్లుగా, వెనుకంజ వేయవలసి ఉంటుంది. ఆ విధంగా భక్తులు తనకు దూరం కాకుండా ఉండడంకోసం సౌశీల్యాది గుణాలను ప్రదర్శించి, తనవైపు ఆకర్షించుకోవడం భగవానుని స్వభావం. కాని, ఈ సౌలభ్యసౌశీల్యాది గుణాలను అన్నిటిని ఒకేసారి ప్రదర్శిస్తే పరత్వాన్ని అనుభవించే అవకాశమే లేకుండా పోతుంది. పరత్వాన్నిమాత్రం దర్శింపజేస్తే దానినిమాత్రం అనుభవించే అధికారులు ఉండరు. శీలాదిగుణాలుకూడా అడవి కాచిన వెన్నెలవలె నిష్ఫలాలు అవుతాయి. భగవానుడు అత్యంతం చతురుడు. కనుక కొంచెం కొంచెంగా ఒంటబట్టేటట్లుగా (సాత్మిక్క- సాత్మిక్క) అనుభవింపజేయాలని తలచి, "ఇతడు పరాత్పరుడు కదా'' అనే చింత కల్గని రీతిలో సౌశీల్యసౌలభ్యాది గుణాలను క్రమంగా ప్రదర్శించి తమకు అనుభవింపజేశాడని శ్రీదేశికులు ఇందులో అంటున్నారు.

**(భోగే మృదూపక్రమతా మభీప్సన్)** - పరత్వాన్ని ప్రదర్శించకుండా శీలాదులతో దానిని కప్పిపుచ్చడానికి గల కారణం దీనివల్ల తెలుపబడింది. ముందుగా పరత్వాన్ని అనుభవింపజేస్తే మహాప్రవాహంలో పడి తలమునకలై, ఉక్కిరి బిక్కిరి కావలసి వస్తుందికదా.

**4. శక్తిం శరణ్యాంతరశబ్దభాజాం**
**సారం చ సంతోల్య ఫలాంతరాణామ్ ।**
**త్వద్దాస్యహేతో స్త్వయి నిర్విశంకం**
**న్యస్తాత్మనాం నాథ! బిభర్షి భారమ్ ॥**

నాథ = స్వామీ!, శరణ్య+అంతరశబ్దభాజాం = శరణ్యులనే పేరును కల్గి ఉండే దేవతాంతరాలయొక్క, శక్తిం = శక్తిని, ఫల+ అంతరాణాం = (మోక్షంకంటే) ఇతరాలైన క్షుద్రఫలాలయొక్క, సారం చ = సారాన్ని, సంతోల్య= బాగా తూచి చూచి, (సారతమం అయిన) త్వత్ + దాస్యహేతోః = నీ కైంకర్యంకోసం, త్వయి = నీయందు, నిర్విశంకం = ఏ సందేహం లేకుండా, న్యస్త+ ఆత్మనాం = సమర్పించిన ఆత్మను కలవారియొక్క (శరణాగతి చేసిన వారియొక్క) భారం = (రక్షణ)భారాన్ని, బిభర్షి = భరిస్తున్నావు.



**"న సంపదాం సమాహారే విపదాం వినివర్తనే, సమర్థో దృశ్యతే కశ్చిత్ తం వినా పురుషోత్తమమ్"** అని, **"న హి పాలనసామర్థ్య మృతే సర్వేశ్వరం హరిమ్"** అని పలికే రీతిలో భగవానుడైన శ్రీమన్నారాయణుని కంటే అన్యులు ఎవరూ రక్షకులుగా లేరు. రక్షకులనే పేరును కలవారు కొందఱు ఉన్నా, వారు క్షుద్రఫలాలలను ఇచ్చి రక్షించగలరే తప్ప, పరమపురుషార్థమైన మోక్షాన్ని ఇవ్వగల్గినవారు కానే కారు. అందుచేత, రక్షకమ్మన్యులైన ఇతరుల శక్తిని, వారు ఇచ్చే క్షుద్రఫలాల స్వభావాన్ని చక్కగా పరిశీలించి చూసి, నీ శ్రీచరణాలలో చేసే కైంకర్యమే స్వరూపానురూపమైన ఫలం అని గ్రహించి, నిన్నే శరణంగా ఆశ్రయించినవారికి నీవు సకలవిధరక్షణ ధురంధరుడవు - అవుతున్నావు అని శ్లోకసారం.

**5. అభీతిహేతో రనువర్తనీయం**
**నాథ ! త్వదన్యం న విభావయామి ।**
**భయం కుతః స్యాత్ త్వయి సానుకంపే**
**రక్షా కుతః స్యాత్ త్వయి జాతరోషే ॥**

నాథ = స్వామీ!, అభీతిహేతోః = భయం తీరడంకోసం, త్వత్+అన్యం= నీకంటే ఇంకొకరిని, అనువర్తనీయం = ఆశ్రయణీయునిగా, న విభావయామి = భావించను. (ఎందుకు? అని అంటే), త్వయి = నీవు, స+అనుకంపే = దయను కలవాడవైతే, భయం = భీతి, కుతః స్యాత్ = ఎవరివల్ల కల్గుతుంది ?, త్వయి= నీవు, జాతరోషే = కోపాన్ని కలవాడవైతే, రక్షా= రక్షణ, కుతః స్యాత్ = ఎవరివల్ల కల్గుతుంది?

అష్టభుజక్షేత్రస్వామీ! నా భయం తీరడంకోసం నేను నిన్ను తప్ప ఇంకొకరిని ఆశ్రయణీయునిగా భావించను. నీవు దయ చూపితే ఇతరులు ఎవరివల్ల నాకు భయం కలుగదు. నీవు కోపిస్తే ఇక రక్షించేవారెవరూ లేరు.

ఈ శ్లోకం **"బ్రహ్మా స్వయంభూ శ్చతురాననో వా రుద్ర స్త్రినేత్ర స్త్రిపురాంతకో వా, ఇంద్రో మహేంద్ర స్సురనాయకో వా త్రాతుం సమర్థా యుధి రామవధ్యమ్"** అనే శ్రీరామాయణ శ్లోకభావాన్ని, **"కళైవాయ్ తున్బమ్**

**కళైయాదొழிవాయ్ కళైకణ్ మற்றிలేన్"** (తిరువాయ్ -5-8-8) (నీవు నా దుఃఖాన్ని పోగొట్టినా, లేకున్నా, ఏమైనా, నేను ఇంకొకరిని రక్షకునిగా కలవాడను కాను) అనే నమ్మాழ்వార్ల సూక్తిభావాన్ని అనుసరించి రచింపబడింది. జీవుని ఆకారత్రయంలో అనన్యశరణత్వ- అనన్యభోగ్యత్వాలనే రెండు అంశాలు ఇందు ప్రస్తావింపబడ్డాయి. శ్రీదేశికులు అభీతిస్తవప్రారంభంలోని **"అభీతి రిహ యజ్జుషాం యదవధీరితానాం భయం భయాభయవిధాయినో జగతి యన్నిదేశే స్థితాః"** అనే సూక్తిభావంకూడా ప్రకృతంలో అనుసంధేయం.

జీవులకు కలిగే సంసారభీత్యాదులు భగవానునివల్లనే తప్ప ఇంకొకరి వల్ల తీరవు. ఇంకొకరిని ఆశ్రయించినా ఫలితం శూన్యం. వారు తమకు కల్గిన ఆపదలను సైతం పోగొట్టుకొనగల్గినవారు కానందువల్ల స్వామినే శరణు వేడిన సందర్భాలు ఎన్నో. **"వేదాపహారగురుపాతక దైత్యపీడాద్యాపద్విమోచన మహిష్టఫలప్రదానైః, కోஉన్యః ప్రజాపశుపతీ పరిపాతి"** అనే రీతిలో దేవతలలో ప్రధానులుగా చెప్పబడే బ్రహ్మరుద్రులకు కల్గిన ఆపదలను తీర్చి, వారిని రక్షించినవాడు భగవానుడైన శ్రీమన్నారాయణుడేకదా ! అందువల్ల **"నిన్నరుళే పురిన్దిరున్దేన్"** అని, **"కృపయా కేవలమ్"** అని, **"కేవలం మదీయయైవ దయయా నిశ్శేషవినష్టసహేతుకమచ్చరణారవిందయుగళైకాంతికాత్యంతిక పరభక్తి పరజ్ఞానపరమభక్తివిఘ్నః"** (కేవలం నా దయచేతనే నిశ్శేషంగా నశించిన, సహేతుకాలైన, నా శ్రీచరణకమలలో ఏర్పడిన అనన్యమైన, గాఢమైన పరభక్తి పరజ్ఞాన పరమభక్తులకు ఎదురైన విఘ్నాలను తొలగించుకొన్నవాడవై) అనే రీతిలో భగవానుని దయయే రక్షకం. ఈ అంశాన్నిగూర్చి కొంత మొదటి శ్లోకవ్యాఖ్యలో ఇంతకుముందే ప్రస్తావింపబడింది. అందువల్ల, భగవానుని దయను పొందినవారికి ఎవరివల్ల భయం కలుగదు.

**"నాహారయతి సంత్రాసం బాహూ రామస్య సంశ్రితా"** (శ్రీరాముని రెండు బాహువులను ఆశ్రయించిన సీతాదేవి భయాన్ని పొందడం లేదు) అని వాల్మీకి మహర్షి పలికాడు. అష్టభుజస్వామి ఎనిమిది బాహువులను ఆశ్రయించినవారికి ఇక భయం పొందనవసరంలేదని వేతే చెప్పాలా!



6. త్వదేకతంత్రం కమలాసహాయ !
స్వేనైవ మాం రక్షితు మర్హసి త్వమ్ ।
త్వయి ప్రవృత్తే మమ కిం ప్రయాసైః
త్వయ్యప్రవృత్తే మమ కిం ప్రయాసైః ॥

కమలాసహాయ = లక్ష్మీదేవిని సహాయంగా కల్గినవాడా!, త్వత్ +ఏక (ఏవ) తంత్రం = నీకు (మాత్రమే) శేషభూతుణ్ణి అయిన, మాం = నన్ను, త్వం = నీవు, స్వేన+ఏవ = స్వయంగానే (నీచేతనే), రక్షితుం = రక్షించడానికి, అర్హసి = తగి ఉన్నావు, త్వయి = నీవు, ప్రవృత్తే = రక్షించాలని ప్రయత్నించిన వాడవైనపుడు, మమ = నాయొక్క, ప్రయాసైః= = ప్రయత్నాలతో (శ్రమలతో), కిం = ఏమి ఫలం?, (ఆ విధంగా కాకుండా), త్వయి = నీవు, అప్రవృత్తే = రక్షించాలని ప్రయత్నించనివాడవైనపుడు, మమ= నాయొక్క, ప్రయాసైః = ప్రయాసాలతో, కిం = ఏమి ప్రయోజనం?

లక్ష్మీవల్లభుడవైన ఓ అష్టభుజక్షేత్రస్వామీ !, నేను నీకు మాత్రమే శేషభూతుడను. ఇంకొకరి సొత్తును కాను. నీవు నన్ను కాపాడడానికి తగిన స్వస్వామిభావాదిసంబంధాలు అన్నీ నీతో నాకు ఉన్నాయి. దాసుడను, శరణాగతుడనైన నన్ను రక్షించడంలో పురుషకారం చేయడంకోసం నీవెంటనే ఎల్లప్పుడు లక్ష్మీదేవి ఉన్నది. ఆమెతో నిత్యసంబంధాన్ని కల శ్రియఃపతివైన నీవే నాకు ఉపాయం. నీ శ్రీచరణాలలో శరణాగతిని చేసిన నన్ను రక్షించే భారం నీదే ! అందుకు నీవే స్వయంగా ముందడుగు వేయాలి. ఇతరదేవతలను యాచించవలసిన ప్రయాస నాకెందుకు? నీవు ఒకవేళ నా చేతిని విడిచినా, నన్ను రక్షించగలిగేవారెవరూ లేరు. అన్యులను ఆశ్రయించినా ప్రయోజనం లేదు.

ఇంతకు ముందు శ్లోకంలో జీవుని అనన్యోపేయత్వం అనుసంధింప బడగా, దీనిలో అనన్యోపాయత్వం అనుసంధింపబడిందని శ్రీకాంచీ మహా విద్వాన్ శ్రీప్ర.భ. అణ్ణాస్వామివారి వ్యాఖ్యానం. **"స్వప్రాప్తేః స్వయ మేవ సాధనతయా జోఘుష్యమాణః శ్రుతౌ"** (తనను పొందడంలో తానే సాధనమని

వేదాలలో చాటింపు వేయబడేవాడు), **"నిదానం తత్రాపి స్వయ మఖిలనిర్మాణ నిపుణః"** (ఆ ప్రాప్తి విషయంలోను, అన్నిటిని సృష్టించడంలోను సమర్థుడైన భగవానుడే మూలకారణం) అనే శాస్త్రార్థం చక్కగా గ్రహించినవారు కావడంవల్ల శ్రీదేశికులు ఈ శ్లోకంలో తమ ఆకించన్యాన్ని తెలిపారు.

జీవునినుండి ఏప్రయత్నాన్ని అపేక్షించకుండానే తానే రక్షించడానికి తగిన పూర్తి భగవానునిలో ఉందనే విషయం ఇందులో అనుసంధింపబడడం విశేషం. ఇటువంటి భావాన్నే దేశికులు వరదరాజపంచాశత్ స్తోత్రంలోని **"కిం వా కరీశ! కృపణే మయి రక్షణీయే ధర్మాదిబాహ్యసహకారిగవేషణేన, నన్వస్తి విశ్వపరిపాలన జాగరూకః, సంకల్ప ఏవ భవతో నిపుణః సహాయః"** అనే శ్లోకంలో వ్యక్తం చేశారు.

**(కమలా సహాయ!)** **"కమలా సహాయా యస్య సః"** అనే వివరణం ఇక్కడ వివక్షితం. "స్వామీ! దాసుడనైన నన్ను కాపాడడంలో నీకు వేఱొకరి సహాయం అవసరం లేదు. ఒకవేళ అటువంటి ఆవశ్యకత ఉంటే లక్ష్మీదేవిని పురుషకారంగా గ్రహించు'' అని ఈ సంబోధనలోని హృదయం.

నీటికి చల్లని స్పర్శ సహజమైన గుణం. అగ్న్యాది ఉపాధిసంసర్గం వల్ల నీటికి వేడిమి అనే గుణం కల్గుతుంది. ఆ విధంగానే భగవానుని హృదయం దయ, క్షమ, వాత్సల్యాది గుణాలతో చల్లనిదే అయినా జీవుల అపరాధబాహుళ్యం వల్ల కోపించి, వేడెక్కుతుంది. ఇది, సహజంగా చల్లనిది అయిన నీకు ఉపాధివశంచేత వేడెక్కడంవంటిది. భగవానుడు నిరంకుశ స్వతంత్రుడు కనుక, కోపించిన మఱుక్షణమే **"క్షిపామ్యజస్రమశుభా నాసురీష్వేవ యోనిషు"** అని, **'కల్పకోటిశతేనాపి న క్షమామి వసుంధరే!"** అని అనవచ్చు. అపుడింక కాపాడే వాడెవడు ఉండడు. అందువల్ల ఆ విధంగా అతడు అనకుండా, ఆశ్రితులను కాపాడడంకోసం "న కశ్చిత్ న్నాపరాధ్యతి" (అపరాధం చేయనివాడెవడూ లేడు) అని, **"కిమేతత్? నిర్దోషః క ఇహ జగతి?"** అని (ఇదేమి! ఈ లోకంలో దోషం లేనివాడెవడున్నాడు?) అని అంటూ సమయోచితాలైన సూక్తులతో స్వామి కోపాన్ని ఉపశమింపజేసి, పురుషకారాన్ని చేసి, రక్షింపజేసే లక్ష్మీదేవిసహాయం



అపేక్షితం. అది ఇక్కడ **"కమలాసహాయ!"** అనే సాభిప్రాయసంబోధనతో సూచింపబడింది. **"స్వైనైవ"** అని అనడంవల్ల స్వామి జీవుని ప్రయత్నాన్ని లేశమైనా అపేక్షించకుండా, స్వయంగా రక్షిస్తాడని తెలుస్తున్నది.

"నేను కృపాళువును, గుణపూర్తిని కలవాడను- అని అనడం సరే. అయితే, మోక్షం అత్యుత్తమపురుషార్థం కదా! పురుషార్థమంటే **"పురుషేణ అర్థ్యతే"** అనే రీతిలో జీవునిచే అపేక్షింపబడేదికదా! ఫలాన్ని పొందేవాడవు నీవే అయినపుడు నీ ప్రయత్నంకూడా కావాలికదా!'' అని భగవానుని భావన అని తలచిన దేశికులు, దానికి ప్రత్యుత్తరం శ్లోకంలోని ఉత్తరార్ధంలో పల్కుతూ, ఏవిధంగా చూచినా నా (జీవుని) ప్రయత్నం అంకిచిత్కరమే సుమా!- అని అంటున్నారు. **"వనత్తిడరై యేరియామ్ వణ్ణమ్ ఇయత్తుమ్ ఇతువల్లాల్ మారి యార్ పెయ్‌కిఱ్పార్ మఱ్ఱు?"** (అడవిలోని మిట్టను చెఱువుగా తవ్వవచ్చునేమో కాని, మఱి ఆ చెఱువు నిండేటట్లుగా వర్షాన్ని కురిపించగలవారెవరు?) అనే పూదత్తాழ్వార్ల సూక్తిని అనుసరించి, వాన కురిసినపుడు ప్రవహించిన నీటిని నిలుపడంకోసం తవ్విన చెఱువుకు వానను కురిపించే శక్తి లేనట్లే, ఈశ్వరుని తనవైపుకు ఆకర్షించుకోగల్గిన శక్తి చేతనునకు, ఉపాయానుష్ఠానానికి లేదుకదా! అందువల్ల భగవానుని కరుణ లేనపుడు అవి అన్నీ అకించిత్కరాలే. స్వామి, సర్వస్వతంత్రుడు కనుక, ఎవరికైనా నిర్హేతుకంగా కరుణించాలని అనుకొంటే, దానికి అడ్డు అనేది ఉండదు. **"ఏదివాయ్‌క్కిన్ఱు, కాప్పారార్ ?"** అనే రీతిలో ఆ కృపను అడ్డుకోగలిగేవారెవరూ లేరు.

**(త్వయి ప్రవృత్తే.... కిం ప్రయాసైః)** - **"త్వయి రక్షతి రక్షైః కిమన్యైః త్వయి చారక్షతి రక్షైః కిమన్యైః?"** (నీవు రక్షించేవాడవైతే ఇక మిగిలిన రక్షకులతో ఏమి పని?, నీవు రక్షించనివాడవైతే ఇక మిగిలిన రక్షకులతో ఏమి పని ?) అనే శ్రీదేశికుల కామాసికాష్టకసూక్తి, **"ఉన్నలల్లాల్ యావరాల్ ఒన్ఱుమ్ కుఱై వేణ్డేన్"** (నీవల్ల తప్పవేఱెవ్వరివల్ల నేను నా కోరికను తీర్చుకోవాలని కోరను) అనే నమ్మాழ్వార్లసూక్తి అనుసంధేయం.

**"కమలాసహాయ!"** అనే ప్రయోగంలో లక్ష్మీదేవి భగవానునకు సహాయ భూతురాలై ఉంటుందని చెప్పబడుతూ ఉండగా, **"స్వైనైవ"** అని అనడం

ఏవిధంగా తగినది ? అనే సందేహానికి చోటు లేదు. లక్ష్మీదేవి సాక్షాత్తు భగవానుని దయయేకదా. "కరుణామివ రూపిణీమ్" అని కదా దేశికసూక్తి. "కృపయా పర్యపాలయత్" అనే శ్రీరామాయణసూక్తిలోని "కృపా"శబ్దం దయాస్వరూపిణి అయిన లక్ష్మీ (సీతా)దేవిని తెల్పుతున్నదనికదా పూర్వాచార్యుల అర్థనిర్వాహం.

7. సమాధిభంగేష్వపి సంపతత్సు
శరణ్యభూతే త్వయి బద్ధకక్ష్యే ।
అపత్రపే సోఢు మకించనోఽహం
దూరాధిరోహం పతనం చ నాథ ! ॥

నాథ = స్వామీ !, సమాధిభంగేషు = భక్తియోగానుష్ఠానంలో పలు అడ్డంకులు, సంపతత్సు అపి = పైన పడుతున్నప్పటికీ, శరణ్యభూతే త్వయి (సతి) = శరణు పొందదగినవాడవై నీవుండగా, అకించనః = ఏ ఉపాయం లేని నేను, దూరాధిరోహం = మిక్కిలి దూరాన్ని అధిరోహించడాన్ని (చిరకాలం ఆ యోగానుష్ఠానాన్ని చేయడాన్ని), పతనం చ = కిందపడడాన్ని (పతనాన్ని పొందడాన్ని), సోఢుం = సహించడానికి, అపత్రపే = సిగ్గు పడుతున్నాను.

స్వామీ! భక్తియోగానుష్ఠానపరులకు అనేక ఆటంకాలు ఎదురు అవుతాయి. అయినా, శరణ్యుడవైన నీవు వాటినుండి రక్షిస్తావు. అకించనుడనైన నేను ఆ విధంగా చిరకాలం యోగానుష్ఠానం చేయడానికి, ఆ అనుష్ఠానం నుండి పతనం చెందడానికి బిడియపడుతున్నాను.

"శాస్త్రాలలో భక్తియోగాదులు నన్ను చేరడానికి తగిన ఉపాయాలుగా చెప్పబడ్డాయికదా! జ్ఞానభక్తులలో లోటు లేని మీరు వాటిలో ఏ ఉపాయాన్ని అయినా ఆచరించి నన్ను చేరవచ్చును కదా'' అని భగవానుని అభిప్రాయమని తలచిన దేశికులు, దానికి సమాధానంగా ఈ శ్లోకాన్ని రచించారు.

ఓ అష్టభుజక్షేత్రనాథా! భక్తియోగాన్ని ఆచరించేవారికి మధ్యలో పలు ఆటంకాలు కలుగుతాయి. అపుడు వారు నిన్ను శరణాగతి చేస్తే, ఆ అడ్డంకులను నీవు తీర్చి, వారి భక్తియోగాన్ని సఫలం చేస్తావు. కాని, నేను అంత శక్తిని కలవాడను కాను. ఆ భక్తియోగాన్ని నేనుకూడా ఆచరిస్తే, నాకు ఎదురయ్యే ఆటంకాలను నీవు తీరుస్తావని తెలుసు. దుస్సాధమైన పనిని చేసేటపుడు



ఎపుడైనా అడ్డు కల్గడం సహజం. ఇంచుమించు చివరివరకు చాలా దూరం అనుష్ఠించి చివరలో ఫలాన్ని పొందబోయే దశలోకూడా అడ్డు రావచ్చు. ఆ విధంగా చిరకాలం ఆచరించి, చాలావరకు అధిరోహించి, అడ్డు ఎదురుకాగా, ఇకపైకి ఎక్కలేక పతనం చెందడంవంటి దయనీయస్థితిని పొందడానికి నేను చాలా సిగ్గుపడుతున్నాను. అటువంటి భక్తియోగాన్ని విడచిపెట్టి, నాకు తగిన, సులభమైన, ఉపాయం అయిన శరణాగతిని సాధనంగా గ్రహించి నిన్ను ఆశ్రయిస్తాను.

భక్తియోగాద్యనుష్ఠానాలు స్వప్రయత్నసాధ్యాలు. కావున వాటిని ఆచరించేటపుడు ఆటంకాలు తప్పక కల్గుతాయి. "పతనాంతాః సముచ్ఛ్రయాః" అనికదా సూక్తి. అందువల్ల, సిద్ధోపాయభూతుడవు అయిన నిన్ను వరించి, "నిర్భయో నిర్భరోఽస్మి" అని ధైర్యంగా ఉండదగిన నేను భక్తియోగాన్ని చేసి ఒకసారి ఆరోహణాన్ని, ఇంకొకసారి పతనాన్ని పొందడాన్ని నేను సహించలేను. ఆ స్థితులను తలచినపుడు నాకు చాలా సిగ్గు కల్గుతున్నది. "నిన్నరుళే పురిన్దిరున్దేన్" అని అన్నట్లు నీనిర్హేతుక కృపను ఎదురుచూడడం తప్ప వేఱొక క్షేమకరమైన పనిలేదు కదా !

8. ప్రాప్తాభిలాషం త్వదనుగ్రహాన్మాం
పద్మానిషేవ్యే తవ పాదపద్మే ।
ఆదేహపాతా దపరాధదూర
మాత్మాంతకైంకర్యరసం విధేయాః ॥

త్వత్ +అనుగ్రహాత్ = నీ కరుణవలన, ప్రాప్త+అభిలాషం = కోరికను పొందినవాడనైన, మాం = నన్ను, పద్మానిషేవ్యే = లక్ష్మీదేవిచే సేవింపదగిన, తవ = నీయొక్క, పాదపద్మే =పద్మాలవంటి పాదాలలో, ఆదేహపాతాత్ = ఈ శరీరం పతనం చెందేవరకు, అపరాధదూరం = అపచారాలకు దూరమైన, ఆత్మాంతకైంకర్యరసం = ఆత్మ ఉన్నంతవరకు (నిత్యమైన) కైంకర్యంలోని అభిలాషను, విధేయాః= కల్గించాలి.

స్వామీ! నీకృపవల్ల నా కోరిక తప్పక సఫలం కాగలదు. లక్ష్మీదేవి సంవాహనం చేసే సుకుమారాలైన నీ పాదపద్మాలలో నాకు నిత్యమైన సేవారుచిని కల్గించు.

భట్టర్ శ్రీరంగరాజస్తవంలో -**"శ్వేవ దేవ ! వషట్కృతం త్వాం శ్రియోఽర్థ మకామయే"** అని అంటూ నైచ్యానుసంధానం చేసిన రీతిలో దేశికులు ఈ శ్లోకంలోని పూర్వార్ధంలో నైచ్యాన్ని అనుసంధిస్తున్నారని శ్రీప్ర.భ. అణ్ణాస్వామివారి వ్యాఖ్య.

అష్టభుజక్షేత్రనాథా! నేను నిన్ను శరణాగతి చేసినతరువాత కొంతకాలానికి నా ఈ దేహం నశిస్తుంది, ఆ తర్వాత మోక్షప్రాప్తి కల్గుతుంది. ఇది నిశ్చయం. కనుక, నీ కరుణవల్ల నా కోరిక నెరవేరినట్లే భావిస్తాను. అయితే, నా ఈ శరీరం నశించేవరకు ఉండే కాలం అంతా నీకు కైంకర్యం చేయడమే నాకు క్షేమకరం. నీ శ్రీచరణాలు అతిలోకసౌకుమార్యాన్ని కల్గినవి. పద్మంలో అవతరించి, ఆ పూవులోని సౌకుమార్యమే మూర్తీభవించినట్లుండే లక్ష్మీదేవిసైతం "ఎక్కడ కందిపోతాయో ! ఏమో !"అనే జంకుతో ఎంతో మెల్లగా వాటిని తాకి సంవాహనం చేస్తుంది. అటువంటి మహనీయాలైన నీ శ్రీపాదపద్మాలలో నేను ఆత్మాంతకైంకర్యాన్ని చేయాలి. ఏ అపరాధం లేని, నిత్యకైంకర్యాన్ని నీ శ్రీచరణాలలో చేయడంలోనే నాకు రుచి కలిగేటట్లు నన్ను నీవే అనుగ్రహించాలి.

**(పద్మానిషేవ్యే తవ పాదపద్మే)** - **"వడివిణై యిల్లా మలర్మకళ్ మఱ్ఱై నిలమకళ్ పిడిక్కుమ్ మెల్లడియై"** (రూపంలో సాటిలేని లక్ష్మీదేవి, భూదేవి మెల్లిగా తాకి సంవాహనంచేసే సుకుమారాలైన శ్రీచరణాలను) అని అంటూ నమ్మాళ్వార్లు పల్కడం దీనికి మూలం. దేవతలకు అర్హమైన పురోడాశాన్ని శునకం ఆశ పడే రీతిలో లక్ష్మీదేవిచే మాత్రమే సేవించదగిన నీ శ్రీచరణ పద్మాలలో నేను కైంకర్యం చేయాలని ఆశ పడుతున్నాననే అర్థస్వారస్యం పైన ఉదాహరించిన **"శ్వేవ దేవ!"** ఇత్యాది భట్టర్ సూక్తిని సమన్వయించడంద్వారా స్ఫురిస్తుంది. **"నెడియానై అడినాయేన్ నినైన్దిట్టేనే!"** అనే తిరునెడున్దాణ్డక సూక్తికూడా ఇటువంటిదే. "అయితే, నాకు నేనుగా ఆశ పడడం లేదు. నీవే నాకు ఆ ఆశను కల్గించావు. ఇటువంటి మహోపకారాన్ని చేసినట్లే, యావచ్ఛరీర పాతం ఏ అపచారాలు లేని నీ నిత్యకైంకర్యంలోని అభిలాష నాకు కలిగేటట్లు నీవే కటాక్షించు"- అని శ్లోకసారం. మొదటి పాదంలో **"ప్రాప్తాభిలాషామ్ త్వదనుగ్రహేణామ్"** అనే పాఠాంతరం ఉన్నది.



ఇంతటితో ఈ స్తుతి ముగిసినది. మిగిలిన రెండు శ్లోకాలు ఉపసంహారాత్మకాలు.

9. ప్రపన్నజనపాథేయం ప్రపిత్సూనాం రసాయనమ్ ।
శ్రేయసే జగతా మేతత్ శ్రీమదష్టభుజాష్టకమ్ ॥

ప్రపన్నజనపాథేయం = ప్రపత్తిని చేసేవారికి మార్గసహాయం, ప్రపిత్సూనాం = ప్రపత్తిని చేయగోరినవారికి, రసాయనం = గొప్ప మందు అయిన, ఏతత్ =ఈ, శ్రీమత్+ అష్టభుజ + అష్టకం = లక్ష్మీసహితుడైన అష్టభుజ క్షేత్రస్వామిని గూర్చిన ఎనిమిది శ్లోకాలతో కూడిన స్తోత్రం, జగతాం= లోకాలయొక్క, శ్రేయసే = మంచికోసం (అగుగాక !)

ఈ శ్లోకంలో ఈ స్తుతిని పఠించినందువల్ల కలిగే ఫలం తెలుపబడుతున్నది.

ఈ అష్టభుజాష్టకమనే స్తుతి, ప్రపత్తిని చేసి మోక్షంకోసం ఎదురుచూచే వారికి **"పాథేయం"** అంటే- దారిబత్తెం వంటిది. వారు మోక్షం పొందేంతవరకు ఈ స్తుతిలో అనుసంధింపబడ్డ భగవానుని కల్యాణగుణాలను రస్యభోగ్యపదార్థాలవలె **"పాలేపోల్ శీరిల్ పழுత్తొழிన్దేన్"** అని, **"ఓవాత్తొழிల్ శార్ఙ్గన్ తొల్శీరై నన్నెఞ్జే ! ఓవాద ఊణాక ఉణ్"** అని చెప్పే రీతిలో ఆస్వాదిస్తూ కాలాన్ని గడుపవచ్చు. **"గచ్ఛతాం దూర మధ్వానం తృష్ణామూర్ఛితచేతసామ్, పాథేయం పుండరీకాక్షనామసంకీర్తనామృతమ్"** అని కదా సూక్తి. **"ఎన్నినైన్దు పోక్కువరిప్పోదు ?"** అన్నట్లు కాలక్షేపం చేసే దారి ఏమి ? అని ఆలోచించవలసిన ఆవశ్యకత లేదు -అని భావం. ఈ విధంగా ఈ స్తుతి ప్రపన్నజనులకు పాథేయం అయినట్లే, ప్రపత్తిని చేయగోరేవారికి గొప్ప రసాయనం, బలవర్ధకమైన ఔషధం. రసమంటే రుచి. అంటే- భగవానుని స్వరూపరూపగుణవిభూతుల అనుభవంపట్ల మొదట అనుకూల్యమైన భావన; క్రమంగా భక్తి ఇత్యాదులు. వాటికి అయనమంటే స్థానం. ఈ స్తోత్రాన్ని అనుసంధానం చేసేవారికి భగవానునిపట్ల మొదట అద్వేషం ఏర్పడి, అది క్రమంగా అనుకూలభావనగా మారి, అది భక్తిగా పరిణమించి, పరభక్తి- పరజ్ఞాన- పరమభక్తులనే దశలను పొందిస్తుంది. లోకంలో బలవర్ధకమైన రసాయనం రోగికి ఆహారం పట్ల రుచిని

కల్గించి, క్రమంగా బలాన్ని వృద్ధి చేసేటట్లే, ఈ స్తుతికూడా ప్రపత్తిని చేయగోరేవారికి భగవద్విషయకమైన మహావిశ్వాసాన్ని, కైంకర్యాభిలాషను కల్గిస్తుందని సారార్థం. రసశబ్దానికి భక్తిరసమని, **"రసో వై సః"** అని చెప్పబడిన పరమాత్మ- అనికూడా అర్థాలను చెప్పవచ్చు. **"ప్రాణప్రయాణపాథేయం సంసారవ్యాధినాశనమ్, దుఃఖాత్యంతపరిత్రాణం హరిరిత్యక్షరద్వయమ్"** జీవుని (అంతిమప్రయాణంలో పాథేయం, సంసారమనే వ్యాధిని నిర్మూలించే గొప్ప మందు, దుఃఖాలనుండి నివర్తింపజేసే రక్షణ- హరి అనే రెండక్షరాలు) అనే రీతిలో శ్లోకంలోని మొదటి పాదం అమరి ఉన్నది.

**"సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహ బ్రహ్మణా విపశ్చితా"** అని, **"అహ మన్నాదోఽహ మన్నాదోఽహ మన్నాదః"** అని సంస్కృతవేదం, **"ఉణ్ణుమ్ శోరు పరుకు నీర్ తిణ్ణుమ్ వెఱ్ఱిలైయుమ్ ఎల్లామ్ కణ్ణన్"** అని ద్రావిడవేదం భక్తునకు భగవానుని దివ్యమంగళవిగ్రహకల్యాణగుణాద్యనుభవం రస్యభోగ్య పదార్థానుభవంవంటిది అని తెల్పింది కదా! **"నచ్చు మామరున్ద మెన్గో!"** అని, **"మరున్దుమ్ పొరుళుమ్ అముతముమ్ తానే"** అని, **"అరుమరున్దాకుమే"** అని, **"భేషజం భగవత్ప్రాప్తిః"** అని, **"వ్యామోహ ప్రశమౌషధమ్"** అని భగవదనుభవం గొప్ప మందుగా చెప్పబడింది కదా. ఔషధం రోగనివారకమేకాక, బలవర్ధకం కూడా అయినట్లే, భగవదనుభవం భవరోగనివారకం, ఇంకా ఇంకా భగవదనుభవాన్ని పొందడానికి ఆవశ్యకమైన బలాన్ని **"య ఆత్మదా బలదా"** అన్నట్లు ఇస్తుంది. **"ఆచార్యసమాశ్రయణమ్ పణ్ణినవర్కళుక్కుమ్, అదు పణ్ణ రుచియుడై యార్క్కుమ్, మఱ్ఱుముళ్ళవర్క్కుమ్ హితమాన అర్థవిశేషఙ్గళ్ ఇన్ద స్తుతియిల్ నిరమ్బియుళ్ళదెన్ఱు కరుత్తు"** (ఆచార్యసమాశ్రయాన్ని చేసినవారికి, దానిని చేయాలనే ఆశను కలవారికి, మిగిలినవారికి హితాన్ని కల్గించే అర్థవిశేషాలు ఈ స్తుతిలో పూర్ణంగా ఉన్నాయని భావం) అనే శ్రీ ప్ర.భ. అణ్ణాస్వామి వ్యాఖ్యానసూక్తి అనుసంధేయం.

**"శ్రీమతే"** అనే విశేషణపదాన్ని అష్టభుజాష్టకపదానికి విశేషణంగా వ్యస్తంగా గాని, సమస్తంగా గాని అన్వయించవచ్చు. దీనివల్ల స్తోత్రంయొక్క శ్రీమత్త్వం-



అంటే- జ్ఞాతవ్యసకలార్థపూర్తి తెలుపబడుతున్నది. **"శ్రేయసే జగతామ్"** అనే ప్రయోగంవల్ల స్తుతికర్త ఔదార్యం సూచితం.

**10. శరణాగతసంత్రాణత్వరాద్విగుణబాహునా ।**
**హరిణా వేంకటేశీయా స్తుతిః స్వీక్రియతా మియమ్ ॥**

శరణాగత = శరణుపొందినవారియొక్క, సంత్రాణ = రక్షణలోని, త్వరా = తొందరవల్ల, ద్విగుణ = రెండింతలు అయిన, బాహునా = బాహువులను కల, హరిణా = శ్రీమన్నారాయణునిచే, వేంకటేశీయా = వేంకటేశులనబడే దేశికులచే, రచింపబడిన, ఇయం = ఈ, స్తుతిః = స్తోత్రం, స్వీక్రియతామ్ = స్వీకరింపబడుగాక !

ఈ స్తుతి శ్రీవేంకటేశులనబడే దేశికులచేత రచింపబడింది. భగవానుడు **"చక్రపాణీ చతుర్భుజః"** అన్నట్లు, **"చతుర్ణాం పురుషార్థానాం దాతా దేవ శ్చతుర్భుజః"** అన్నట్లు చతుర్భుజుడుగా ప్రసిద్ధుడు. ఈ విధంగా స్వామి చతుర్భుజుడైనా అతడు తనను శరణు వేడినవారిని కాపాడాలనే త్వరను అధికంగా కలవాడు. కనుక, వారిని రక్షించే సందర్భంలో స్వామి బాహువుల సంఖ్యలోకూడా ఆధిక్యం ఏర్పడుతున్నదట. అంటే- బాహువుల సంఖ్య రెండింతలు అవుతున్నదట. **"ఎప్పోదుమ్ కైకழలా నేమియాన్ నమ్మేల్ వినై కడివాన్"** (ఎల్లప్పుడు చేతిని వీడని చక్రాన్ని కల స్వామి మన పాపాలను తీరుస్తాడు) అనే రీతిలో ఆ ఎనిమిది భుజాలలో నిత్యం ఎనిమిది భుజాలను ధరించి, మన పాపాలను తీర్చి, మనలను రక్షించడంకోసం ఆతురతగా ఎదురుచూస్తున్నాడు. ఆ అష్టభుజస్వామి తన ఎనిమిది శ్రీహస్తాలతో ఈ ఎనిమిది శ్లోకపుష్పాలను స్వీకరించుగాక! అని భావం.

శరణాగతరక్షణత్వరవల్ల భగవానుని బాహువులు ద్విగుణీకృతాలై ఎనిమిది అయ్యాయి - అన్నది ఒక చమత్కారమైన ఉక్తి. దీనివల్ల స్వామి అష్టభుజత్వానికి ఒక హేతువు ఉత్ప్రేక్షింపబడింది. మొదటి శ్లోకంలోని **"గజేంద్ర రక్షాత్వరితం భవంతమ్"** అనే ప్రయోగస్వారస్యాన్నిబట్టి గజేంద్రరక్షణ సందర్భంలో భగవానుడు అష్టభుజుడయ్యాడని స్ఫురిస్తున్నది. **"హరి ర్హరతి**

**పాపాని"** అనే వ్యుత్పత్తిని కల హరి శబ్దప్రయోగంవల్ల, "ఉపసర్గార్థం ధాతువులో లీనమై ఉంటుందనే" న్యాయాన్నిబట్టి **"హరతి- ఆహరతి- స్వీకరోతి ఇతి హరిః"** అనే స్వారస్యాన్ని కూడా చెప్పవచ్చు.

ఈ శ్లోకంద్వారా దేశికులు ఈ స్తుతిని కాంచీపురంలోని అట్టపుయకర క్షేత్రంలోని అష్టభుజస్వామికి సమర్పించినట్లు, ఈ స్తుతి పేరును దేశికులే పెట్టినట్లు తెలుస్తున్నది. **"హరిణా స్వీక్రియతామ్"** అనే కర్మణిప్రయోగం స్తుతికర్త యొక్క కర్తృత్వఫలసంగరాహిత్యాన్ని సూచిస్తుంది. **"తనక్కే యాక ఎనై క్కొళ్ళు మీదే"** అనికదా ఆళ్వార్ల సూక్తి. కృతి చివర కవినామం అంకితం కావాలనే సంప్రదాయం ఇక్కడ పాటింపబడినది. మూడవ పాదంలో **"వేంకటేశస్య"** అనే పాఠాంతరం ఉన్నది.

అష్టభుజాష్టకవ్యాఖ్యానం సంపూర్ణం

కవితార్కికసింహాయ కల్యాణగుణశాలినే ।
శ్రీమతే వేంకటేశాయ వేదాంతగురవే నమః ॥





శ్రీవేదాంత దేశికులు అనుగ్రహించిన

# యథోక్తకారిస్తోత్రం ( వేగాసేతుస్తోత్రం )

శ్రీమాన్ వేంకటనాథార్యః కవితార్కికకేసరీ ।
వేదాంతాచార్యవర్యో మే సన్నిధత్తాం సదా హృది ॥



1. ఏకం వేగవతీ మధ్యే హస్తిశైలే చ దృశ్యతే ।
ఉపాయఫలభావేన స్వయం వ్యక్తం పరం మహః ॥

2. ఈష్టే గమయితుం పారం ఏష సేతు రభంగురః ।
యత్ర సారస్వతం స్రోతో విశ్రామ్యతి విశృంఖలమ్ ॥

3. జయతి జగదేకసేతుః వేగవతీమధ్యలక్షితో దేవః ।
ప్రశమయతి యః ప్రజానాం ప్రథితాన్ సంసారజలధికల్లోలాన్ ॥

4. విభాతు మే చేతసి విష్ణుసేతుః వేగాపగావేగవిఘాతహేతుః ।
అంభోజయోనే ర్యదుపజ్ఞ మాసీత్ అభంగరక్షా హయమేధదీక్షా ॥

5. చతురాననసప్తతంతుగోప్తా సరితం వేగవతీ మసౌ నిరుంధన్ ।
పరిపుష్యతి మంగళాని పుంసాం భగవాన్ భక్తిమతాం యథోక్తకారీ ॥

6. శ్రీమాన్ పితామహవధూపరిచర్యమాణః
శేతే భుజంగశయనే స మహాభుజంగః ।
ప్రత్యాదిశంతి భవసంచరణం ప్రజానాం
భక్తానుగంతు రిహ యస్య గతాగతాని ॥

7. ప్రశమితహయమేధవ్యాపదం పద్మయోనేః
శ్రితజనపరతంత్రం శేషభోగే శయానమ్ ।

శరణ ముపగతా స్స్మః శాంతనిశ్శేషదోషం
శతమఖమణిసేతుం శాశ్వతం వేగవత్యాః ॥

8. శరణ ముపగతానాం సోయ మాదేశకారీ
శమయతి పరితాపం సమ్ముఖ స్సర్వజంతోః ।
శతగుణపరిణామః సన్నిధౌ యస్య నిత్యం
వరవితరణభూమా వారణాద్రీశ్వరస్య ॥

9. కాంచీభాగ్యం కమలనిలయా చేతసోఽభీష్టసిద్ధిః
కల్యాణానాం నిధి రవికలః కోఽపి కారుణ్యరాశిః ।
పుణ్యానాం నః పరిణతి రసౌ భూషయన్ భోగిశయ్యాం
వేగాసేతు ర్జయతి విపులో విశ్వరక్షైకహేతుః ॥

10. వేగాసేతో రిదం స్తోత్రం వేంకటేశేన నిర్మితమ్ ।
యే పఠంతి జనా స్తేషాం యథోక్తం కురుతే హరిః ॥

కవితార్కికసింహాయ కల్యాణగుణశాలినే ।
శ్రీమతే వేంకటేశాయ వేదాంతగురవే నమః ॥



# యథోక్తకారిస్తోత్రం ( వేగాసేతుస్తోత్రం )

## సవ్యాఖ్యానమ్

మహావిద్వాన్ కాంచీ ప్ర.భ. అణ్ణంగరాచార్యస్వామివారి ద్రావిడ

వ్యాఖ్యానానికి అనువాదం

## అవతారిక

శ్రీకాంచీపురానికి నాయకమణిగా భాసించే అర్చామూర్తి యథోక్తకారి ప్పెరుమాళ్. వీరికి తమిళంలో **"శొన్న వణ్ణమ్ శెయ్త పెరుమాళ్"** (చెప్పిన రీతిలో చేసిన స్వామి) అని వ్యవహరిస్తారు. **"శతుముకనార్ వేళ్వితనై చ్చదిర్ కెడుక్క చ్చెఱిన్దోడుమ్ కతియుడైయ వేకవతిక్కు అణైయాక వన్దుతిత్తాయ్"** అనే రీతిలో భగవానుని సాక్షాత్కరింపజేసి కోవడంకోసం బ్రహ్మ నిర్వహించిన అశ్వమేధ యాగాన్ని పాడు చేయాలని భావించిన సరస్వతి వేగవతీరూపంలో గొప్ప ప్రవాహంగా ప్రవహించగా, యాగంలో స్వాహాకారాలు అణగి, హాహాకారాలు మిన్నుముట్టాయి. అపుడు "ఈ అటంకాన్ని తీర్చి నన్ను రక్షించాలి" అని బ్రహ్మ భగవానుని ప్రార్థించగా అతని ప్రార్థనను అంగీకరించి సేతువుగా అవతరించి స్వామి ఆ ఆటంకాన్ని తీర్చాడు. ఈ కారణంవల్లనే **"యథోక్తకారి"** (బ్రహ్మ వేడిన వేడికోలు ప్రకారం చేసినవాడు) అనే తిరునామం ఈ మూర్తికి ఏర్పడింది.

ఇంతేకాక, తిరుమఴిశైప్పిరాన్ కణ్ణిక్కణ్ణన్ అనే తమ శిష్యునితో కలసి ఈ దివ్యదేశంలో నివసించిన కాలంలో పల్లవరాజు చేసిన దుష్కృత్యాలవల్ల ఆ కణిక్కణ్ణన్, తిరుమఴిశై యాఴ్వార్లు ఇంకొక ఊరికి పోవలసివచ్చినపుడు **"కణిక్కణ్ణన్ పోకిన్టాన్ కామరుపూమ్ కచ్చిమణి వణ్ణా! నీ కిడక్క వేణ్డా నీయు ముష్టన్ పైన్నాకప్పాయ్ శురుట్టి క్కొళ్"** అని ముందు, **"కణిక్కణ్ణన్ పోక్కొఴిన్దాన్ కామరు పూమ్ కచ్చి మణివణ్ణా! నీ కిడక్క వేణ్డుమ్ ... నీయు ముష్టన్ పైన్నాక ప్పాయ్ విరిత్తుక్కొళ్"** అని తరువాత ఆఴ్వార్లు ప్రార్థించిన రీతిలోనే శేషశయనాన్ని చుట్టుకొని బయలుదేరడం, తిరిగి వచ్చి శయనించడం చేసినందువల్ల ఇచటిస్వామికి **"యథోక్తకారి"** అనే తిరునామం కల్గిందనికూడా పెద్దలంటారు.

వేదాంతదేశికులు తమ విభవకాలంలో ప్రతిదినం ఈ అర్చామూర్తికి మంగళా శాసనాన్ని చేసేటపుడు అనుసంధించిన శ్లోకాలే ఈ యథోక్తకారిస్తోత్రంగా రూపొందాయి. భక్తుల ప్రార్థనవల్ల వీటిని దేశికులు అనుగ్రహించారు.



1. **ఏకం వేగవతీ మధ్యే హస్తిశైలే చ దృశ్యతే ।**
**ఉపాయఫలభావేన స్వయం వ్యక్తం పరం మహః ॥**

స్వయం వ్యక్తం = స్వయంగా ఆవిర్భవించినది, పరం = గొప్పది అయిన, ఏకం మహః = ఒకానొక అద్వితీయమైన తేజస్సే, వేగవతీ మధ్యే = వేగవతీనది మధ్యలో, హస్తిశైలే చ = హస్తిగిరిలోను, ఉపాయఫలభావేన = ఉపాయంగాను, ఉపేయంగాను, దృశ్యతే = సాక్షాత్కరిస్తున్నది.

లోకంలో, పొందబడే వస్తువు ఉపేయమని, పొందింపబడే వస్తువు ఉపాయమని వ్యవహరింపబడుతుంది. ఉపేయమని, ప్రాప్యమని, ఫలమనేవి పర్యాయ పదాలు. సాధనమని, ఉపాయమని, ప్రాపకమనేవి పర్యాయ పదాలు. ఉపాయం వేఱుగా, ఉపేయం వేఱుగా ఉండడం లోకంలో సాధారణంగా కన్పించే క్రమం. భగవానుని విషయంలో ఇది వ్యత్యస్తం. అతనిని ఉపాయంగా పరిగ్రహించినవారు ఆ స్వామినే ఉపాయంగా గ్రహిస్తారు. **"ఉపాయోపేయత్వే తదిహ తత్త్వం న తు గుణౌ"** అని శ్రీపరాశరభట్టర్‌కూడా అనుగ్రహించారు. కర్మజ్ఞానభక్త్యాదులు ఉపాయాలుగా గ్రహించదగినవిగా తోచినా అవి అజ్ఞులకు ఉపాయాలుగాను, జ్ఞానులకు అపాయాలుగాను తోస్తాయి కనుక **"పత్తి ముదలానవ***గ్ర్ర్రిల్*** పదియెనక్కు క్కూడామల్"** అనే రీతిలో అవి హేయాలుగా ఉంటాయి, ఉపేయమైన భగవానుడే ఉపాయభూతుడుగా ఉంటాడు. పరమైకాంతులకు. వరదరాజస్వామి అనే ఒకే రూపమే ఉపాయంగాను, ఉపేయంగాను ఉన్నా, "ఒక రూపంతో ఉపాయభావాన్ని, వేఱొక రూపంతో ఉపేయంగాను సాక్షాత్కరిస్తాను" అని భావించి వేగవతీనది మధ్యలో యడోక్తకారిగా ఆవిర్భవించి ఉపాయభావాన్ని, శ్రీహస్తిశైలంలో ఆవిర్భవించి ఉపేయభావాన్ని చూపి సేవను అనుగ్రహిస్తున్నాడు- అని అనడం చమత్కారవిలసితచాటూక్తి. ఉపాయోపేయాలు రెండు రెండు రూపాలలోను ఏ లోటు లేనివే అయినా, ఈవిధంగా ఇక్కడ పల్కడం కథావృత్తాంతానికి అనురూపం.



2. **ఈష్టే గమయితుం పారం ఏష సేతు రభంగురః ।**
**యత్ర సారస్వతం స్రోతో విశ్రామ్యతి విశృంఖలమ్ ॥**

యత్ర సారస్వతం స్రోతః = (వేగవతీసేతువైన) ఏ భగవానుని విషయంలో సమస్తవాఙ్మయప్రపంచం, విశృంఖలం విశ్రామ్యతి = ఏ అడ్డు లేకుండా పర్యవసిస్తున్నదో, (ఏ అడ్డు లేకుండా ప్రవహించే సరస్వతీ నదీప్రవాహం ఏ సేతువులో నిలిచిపోతున్నదో) అభంగురః = భంగం లేని, ఏష సేతుః = ఈ సేతువు, పారంగ మయితుమ్ ఈష్టే= (మనలను) తీరానికి చేర్చగలదు.

ఈ శ్లోకం శ్లేషాలంకారప్రక్రియలో రచింపబడింది. యథోక్తకారిస్వామికి సంస్కృతభాషలో వేగాసేతువు అని, తమిళభాషలో **"వెంఙిక్ణై"** అని పేరు. **"వెంఙిక్ణై"** అనేది **"వె.∴కా"** అనే రూపాన్ని పొందిందని అంటారు. **"వేగాసేతు"** అనే తిరునామాన్ని తలచేటపుడే **"అమృతస్యైష సేతుః"** ఇతాద్యుపనిషద్వాక్యాలు స్మరణకు వస్తాయి. వేదాంతాలలో సేతువుగా చెప్పబడ్డ భగవానుడు ఇక్కడ ప్రత్యక్షంగా సేతువుగా సాక్షాత్కరిస్తున్నాడని అనుసంధించాలి. వేదాంత వ్యపదిష్టసేతువైన ఈ భగవానుని విషయంలో-

**(సారస్వతం స్రోతః విశృంఖలం విశ్రామ్యతి)** - సరస్వతీప్రవాహం విశృంఖలంగా విశ్రమిస్తుంది. సమస్తవాక్ప్రపంచంకూడా ఈ భగవానుని విషయంలో ముఖ్యవృత్తితో **(అభిధావృత్తితో)** పర్యవసిస్తుందని తాత్పర్యం. ఈ వేగాసేతుభగవానుని విషయంలో అయితే, విశృంఖలంగా ప్రవహించి వచ్చిన సరస్వతీనదీప్రవాహం అడ్డగింపబడి విశ్రమించిందని కథాపరంగా భావం.

**(అభంగురః ఏష సేతుః)** లోకంలో నదులకు కట్టే ఆనకట్టలు ఏదో ఒక దినాన భంగాన్ని పొందేవే. ఈ భగవానుడనే సేతువు అటువంటివంటిది కాదు. **"ఏష సేతుః"** అనే నిర్దేశం సదృశమైన ఉపనిషద్వాక్యానికి స్మారకం.

**(పారం గమయితుం ఈష్టే)** సంసారంనుండి ఉద్ధరించగల్గినదని భావం.

3. **జయతి జగదేకసేతుః వేగవతీమధ్యలక్షితో దేవః ।**
**ప్రశమయతి యః ప్రజానాం ప్రథితాన్ సంసారజలధికల్లోలాన్ ॥**

యః = ఏ భగవానుడు, ప్రజానాం = జనులయొక్క, ప్రథితాన్ = సుప్రసిద్ధాలైన, సంసారజలధికల్లోలాన్ = సంసారసాగరంలోని కెరటాలను,

ప్రశమయతి= శాంతిప జేస్తున్నాడో, జగత్+ఏకసేతుః = జగత్తుకు అద్వితీయ సేతువు అయిన (సః = ఆ) దేవః =భగవానుడు, వేగవతీమధ్యే లక్షితః = వేగవతీనది మధ్యలో సాక్షాత్కరించే వాడై, జయతి = సర్వోత్కృష్టంగా వెలుగుచున్నాడు.

లోకంలో నదులకు కట్టబడే సేతువు కెరటాలు పైకి లేస్తూ ప్రవహించే నీటి ప్రవాహాన్ని అడ్డుకుంటుంది. సాగరతరంగాలను నిలువరించే సేతువు లోకంలో ఎక్కడా కట్టబడలేదు. వేగాసేతు వనబడే భగవత్సేతువు అత్యంత విలక్షణంగా ఉన్నది. వేగవతి నదిమధ్యలో సాక్షాత్కరించడం ఒక విశేషం. అంతకుమించి సముద్ర కెరటాలను సైతం అడ్డుకోవడం ఇంకొక విశేషం. అయితే, ఇక్కడ సముద్రమన్నది ఏది? అని అంటే,

**(ప్రజానాం సంసారజలధికల్లోలాన్) - "సంసారం సాగరం ఘోరమ్"** అని, **"పిఱవిక్కడలుళ్ అన్ఱు నాన్ తుళఙ్గ"** అని చెప్పే రీతిలో మనం బాధపడే (మునిగే) సంసారసాగరతరంగాలున్నాయి. అవి, తాపత్రయాత్మకాలైన పలు విధాలుగా ఉండే క్లేశాలే. అది ఎటువంటివి ? అని అంటే,

**(ప్రథితాన్)** - సుప్రసిద్ధాలని ఒక అర్థం. చాలా పెద్దవి అని ఇంకొక అర్థం. వీటిని శాంతపరుస్తూ ఈ సేతువు ఉన్నది- అని శ్లోకతాత్పర్యం.

**4. విభాతు మే చేతసి విష్ణుసేతుః వేగాపగావేగవిఘాతహేతుః ।**
**అంభోజయోనే ర్యదుపజ్ఞ మాసీత్ అభంగరక్షా హయమేధదీక్షా ॥**

అంభోజయోనేః = తామరపూవును జన్మస్థానంగా కల బ్రహ్మయొక్క, హయమేధదీక్షా = అశ్వమేథయాగదీక్ష, ఆసీత్ = ఏ అడ్డు లేని దీక్షను కల్గినదిగా- నిర్విఘ్నంగా నెరవేరినదిగా అయినదో, వేగాపగా = వేగవతీనదియొక్క, వేగ = వేగం యొక్క, విఘాతహేతుః = ఆటంకానికి హేతువు అయిన, సః = ఆ, విష్ణుసేతుః= వేగాసేతు భగవానుడు, మే చేతసి = నా మనస్సులో, విభాతు = ప్రకాశించుగాక.

శ్రీయథోక్తకారిస్వామి అవతారం చేసి ఉండకపోతే బ్రహ్మయొక్క అశ్వమేథ యాగదీక్ష శిథిలమై పోయి ఉండేదికదా! ఆ విధంగా శిథిలం కాకుండా ఉండే రీతిలో వేగవతి యొక్క వేగాన్ని అడ్డుకోవడంకోసం సేతువుగా ఆవిర్భవించిన వేగాసేతు భగవానుడు ఎల్లప్పుడు నా మనస్సులోపల నిరంతరం ప్రకాశించాలి.



**5. చతురాననసప్తతంతుగోప్తా సరితం వేగవతీ మసౌ నిరుంధన్ ।**
**పరిపుష్యతి మంగళాని పుంసాం భగవాన్ భక్తిమతాం యథోక్తకారీ ॥**

వేగవతీం సరితం = వేగవతీనదిని, నిరుంధన్ = అడ్డుకొంటూ ఉన్నవాడై, చతురాననసప్తతంతుగోప్తా = బ్రహ్మచేసిన అశ్వమేథయాగాన్ని రక్షించినవాడైన, అసౌ =ఈ, యథోక్తకారీ భగవాన్ = యథోక్తకారిస్వామి, భక్తిమతాం పుంసాం = భక్తిని కల్గిన మానవులకు, మంగళాని పరిపుష్యతి = శుభాలను పోషిస్తున్నాడు.

పూర్వం, చతుర్ముఖుడు శ్రియఃపతిని దర్శించగోరి తపస్సు చేశాడు. అయినా, అతడు భగవానుని శ్రీచరణపద్మాలలో స్థిరమైన చిత్తం లేనివాడయ్యాడు. ఏవో వేర్వేరు లౌకిక విషయాలలో చిక్కుకొని పరుగులు తీసే తన మనస్సును నియంత్రించలేక, దుఃఖాన్ని పొంది కింకర్తవ్యతా విమూఢుడై దిగ్భ్రమను పొందినపుడు ఆకాశంలోనుండి ఒక అశరీరవాణి అతనికి ఈ విధంగా వినిపించింది- "ఓ బ్రహ్మదేవా! వేయి అశ్వమేథయాగాలు అనుష్ఠించినపుడే చిత్తశుద్ధి కల్గి, శ్రియఃపతిని కన్నుల విందుగా దర్శించగలవు. శీఘ్రంగా భగవానుని దర్శించగోరి వేయి అశ్వమేథయాగాలను చేసే ఆలస్యం నీవు సహించలేకపోతే, తొండమండలంలో ఉండే సత్యవ్రతక్షేత్రాన్ని చేరి, అక్కడ అశ్వమేథయాగాన్ని చేసి, భగవానుని సాక్షాత్కారాన్ని పొందు. అక్కడ ఏ కర్మను అనుష్ఠించినా అది సహస్రముఖంగా ఫలసిద్ధిని కల్గిస్తుంది. ఇది ఆ క్షేత్రానికి ఉండే గొప్పతనం''. ఆ దివ్యవాణిని విని పరమానందం పొందిన బ్రహ్మ మేరుపర్వతాగ్రంపై నుండి నిలచి వెంటనే లేచి సత్యవ్రతక్షేత్రానికి వచ్చి చేరి, అక్కడ తపస్సు అనుష్ఠించే పలువురు మునులు అధివసించి ఉండే అనంతసరస్సును, తత్సమీపంలో ప్రకాశించే హస్తిశైలాన్ని దర్శించి, ఆనందించి, ఆసరస్తీరంలోనే పవిత్రమైన అశ్వమేథయాగాన్ని చేయాలని నిశ్చయించుకొన్నాడు. అందుకోసం సకలసన్నాహాలను చేసికొన్న సమయంలో యాగపురోహితుడైన బృహస్పతి -"ఓ బ్రహ్మదేవా! నీ ధర్మపత్ని అయిన సరస్వతి లేకుండా యాగాన్ని నిర్వహించడం సాధ్యం కాదు. కనుక ఆమెను ఇక్కడకు రప్పించు'' అని అన్నాడు. ప్రబలమైన ఒకానొక కారణంవల్ల చిరకాలంగా తనను విశ్లేషించిన ఆమెను ఏ ఉపాయంతోను తనవద్దకు బ్రహ్మ రప్పించలేక పోయాడు. అపుడు ఆమె లేకుండానే సావిత్రి మొదలైన మిగిలిన భార్యలను పురస్కరించుకొని యాగాన్ని చేయడానికి బ్రహ్మ ఆరంభించగానే, అసురులు చేసిన దుర్బోధవల్ల చాలా కోపాన్ని పొందిన సరస్వతి భర్త చేసే అశ్వమేథయాగాన్ని

అడ్డుకోవాలని తలచి, వేగవతీ నదీరూపంలో చాలా భయంకర మైన వేగంతో ప్రవహిస్తూ సత్యవ్రతక్షేత్రాన్ని చేరింది. బ్రహ్మ తన యోగదృష్టితో "అసురులచేత ప్రేరేపింపబడ్డ సరస్వతి చేసిన పని ఇది'' అని గ్రహించి, మనస్సులో చాలా భీతిల్లి, శరీరం కంపించగా, కంఠం గద్గదంకాగా దుఃఖాశ్రువులు శరీరమంతా తడువగా, భగవానుని రక్షించమని ప్రార్థించాడు. **"అణియాక వేకవతి అలైయోడు కొణ్డోడియాలిక్క అణైయా క్కిడన్ద పెరుమాళ్"** అని కీర్తించే రీతిలో ఆ వేగవతీ నదీప్రవాహాన్ని అడ్డుకోగల సేతువుగా ఆ ప్రవాహానికి అడ్డంగా శయనించాడు. ఆ శయనసన్నివేశాన్ని చూచిన సరస్వతి లజ్జతో ఇకపై ప్రవహించలేక దిగ్భ్రమ చెంది నిలిచి అంతర్వాహినిగా సాగి సముద్రుని చేరింది- అనే ఇతిహాసం ప్రకృతంలో అనుసంధేయం.

6. శ్రీమాన్ పితామహవధూపరిచర్యమాణః
శేతే భుజంగశయనే స మహాభుజంగః ।
ప్రత్యాదిశంతి భవసంచరణం ప్రజానాం
భక్తానుగంతు రిహ యస్య గతాగతాని ॥

భక్త+అనుగంతుః = తిరుమழிశైప్పిరాన్ అనే పరమభక్తశిఖామణిని అనుసరించేవాడైన, యస్య = ఏ యథోక్తకారిస్వామి యొక్క, గతాగతాని = రాకపోకలు అనే లీలలు (చింతింపబడినవై), ఇహ ప్రజానాం =ఈ లోకంలో ఉండే మనబోటి జనుల, భవసంచరణం = సంసారకాంతారసంచరణాన్ని, ప్రత్యాదిశంతి= తీరుస్తున్నావో, సః = ఆ, మహాభుజంగః = గోపీవిటుడు అయిన శ్రియఃపతి, పితామహవధూ పరిచర్యమాణః = సరస్వతిచేత సేవింపబడేవాడై, భుజంగశయనే= ఆదిశేషశయనంపై, శేతే = శయనిస్తూ ఉన్నాడు.

**(పితామహవధూపరిచర్యమాణః)** - పితామహుడంటే బ్రహ్మ. అతని వధువు సరస్వతి. ఆమెచే ఆరాధింపబడే భగవానుడని తాత్పర్యం. భగవానునకు దక్షిణదిశలో పయనించిన వేగవతిని. వశిష్ఠమహర్షి మొదలైన మునులు బ్రహ్మ ఆదేశం ప్రకారం వచ్చి నమస్కరించి "తల్లీ ! సరస్వతీ ! యాగశాలలోకి ఇకపై అయినా వచ్చి చేరి నీ నాథునితో కలసి, ఈ మహాయాగాన్ని నెఱవేర్చాలి. అన్ని నదులకంటే నీకే గొప్ప ఉన్నదని చతుర్ముఖుడు అంటున్నాడు'' అని పల్కి ప్రార్థించగా, ఆమెకూడా చాలా ఆనందంతో నదిలోనుండి వేగంగా పైకి వచ్చి,



చతుర్ముఖునితో చేరి, భగవానుని సేవించింది. ఈనాటికీ భగవానుని సేవిస్తున్న సన్నివేశాన్ని అర్చావతారరూపంలో సేవించవచ్చు.

**(సః మహాభుజంగః భుజంగశయనే శేతే)** - ఒక గొప్ప సర్పం ఇంకొక మహాసర్పంపై పరుండి ఉన్నది అనడం చాటూక్తి. సంస్కృతంలో భుజంగశబ్దం సర్పాన్ని, జారుని తెలుపుతుంది. గోపీజారుడని, పల్లవీవిటుడని పేరు పొందినవాడుకదా శ్రీకృష్ణభగవానుడు. నమ్మాழ்వార్లు తమ ప్రథమప్రబంధం అయిన తిరువిరుత్తంలో ఈ దివ్యదేశాన్ని **"కణ్ణన్ వెఃకా"** అని కీర్తించినందువల్ల, తదనుగుణంగా శ్రీకృష్ణుని స్మరించి **"మహాభుజంగః"** అని శ్రీదేశికులు అన్నారు.

ఇక, శ్లోకం ఉత్తరార్ధంలో తిరుమழிశైప్పిరాన్‌కు సంబంధించిన ఐతిహ్యాన్ని దేశికులు అనుసంధిస్తున్నారు. అది ఈ స్తోత్రవ్యాఖ్యానావతారికలో ఇంతకు ముందే తెలుపబడింది. తిరుమழிశైప్పిరాన్‌కోసం ఈ అర్చామూర్తి రాకపోకలను చేశాడనే చరిత్రను అనుసంధించగానే అస్మదాదుల సంసారకాంతారసంచరణ గతాగతాలు తొలగిపోతాయని అంటున్నారు. యాదవాభ్యుదయంలో **"బద్ధం తథా భావయతాం ముకుంద మయత్నవిచ్ఛేదిని కర్మబంధే"** అని అనుగ్రహించిన శ్లోకం ఇక్కడ ఒకవిధంగా అనుసంధించాలి. వెన్నను దొంగిలించిన శ్రీకృష్ణుడు యశోదచే రోటికి కట్టుబడ్డాడనే వృత్తాంతాన్ని స్మరించగానే మన కర్మబంధాలు అన్నీ కట్టువిడిచి తొలగిపోతాయి- అని అన్నట్లే ఇదికూడా.

7. ప్రశమితహయమేధవ్యాపదం పద్మయోనేః
శ్రితజనపరతంత్రం శేషభోగే శయానమ్ ।
శరణ ముపగతా స్మః శాంతనిశ్శేషదోషం
శతమఖమణిసేతుం శాశ్వతం వేగవత్యాః ॥

పద్మయోనేః = బ్రహ్మయొక్క, ప్రశమితహయమేధవ్యాపదం = అశ్వమేధ యాగ విఘ్నాన్ని పోగొట్టినవాడు, శ్రితజనపరతంత్రం = భక్తజనులకు పరాధీనుడు, శేషభోగే= ఆదిశేషుని శరీరంపై, శయానం = పరుండిఉన్నవాడు, వేగవత్యాః = వేగవతీనదికి, శాశ్వతం = శాశ్వతమైన, శతమఖమణిసేతుం = ఇంద్రనీలమణి మయమైన సేతువు అయిన యథోక్తకారి స్వామిని, శాంతనిశ్శేష దోషం = సకలదోషాలు ఉపశమించిన, శరణం = శరణంగా, ఉపగతాః స్మః = ఆశ్రయించిన వారమై ఉన్నాము.

"పద్మయోనేః" అనే పదం "హయమేధే"త్యాది సమాసంలో ఏకదేశంలో అన్వయిస్తున్నా, ఏకదేశాన్వయ దోషం రాదు. అభేద సంబంధంతో అన్వయం ఉన్నపుడే ఈదోషం ప్రవర్తిస్తుంది. ఇక్కడ భేదసంబంధంతోనే అన్వయం కనుక దోషం లేదు.

'శ్రితజనపరతంత్రమ్' - ఈ విశేషణం "అర్చకపరాధీనాఖిలాత్మస్థితిః" అని పొగడబడే అర్చాసామాన్యానికి సాధారణం అయినా, తిరుమఙ్గైప్పిరాన్‌కు సంబంధించిన ఐతిహ్యంలో ఇచటి అర్చామూర్తికి ప్రత్యేకమైన సంబంధం ఉండడం స్మరించదగినది. "శాంతనిశ్శేషదోషమ్" అనేది భగవానునకు విశేషణంగా గ్రహించడంలో కంటే క్రియావిశేషణంగా చేసి అన్వయించడంలో ఎక్కువ స్వారస్యం ఉన్నది. "తారణియిల్ మన్నియయనార్ తనిత్తవమ్ కాత్తపిరాన్" అనే దేశికుల పాశురంలోని "తిరణుకెణ్ణియ శిత్తిరకుత్తన్ తెరిత్తు వైత్త కరుణైయిలేటియ శూఙ్గ్‌వినై ముఱ్ఱ్రుమ్ తుఱన్దనమే" అనే సూక్తికి చాలా పొసగుతుంది.

**(శాశ్వతం శతమఖమణిసేతుమ్)** - రాళ్ళతో కట్టబడి, కొన్ని దినాలలో కూలిపోయే సేతువు కాదు ఇది- అనే వైలక్షణ్యం ఇక్కడ స్ఫురిస్తున్నది.

8. శరణ ముపగతానాం సోయ మాదేశకారీ
శమయతి పరితాపం సమ్ముఖ స్సర్వజంతోః ।
శతగుణపరిణామః సన్నిధౌ యస్య నిత్యం
వరవితరణభూమా వారణాద్రీశ్వరస్య ॥

యస్య సన్నిధౌ = ఏ యథోక్తకారిస్వామియొక్క సన్నిధిలో, వారణ+ అద్రి+ ఈశ్వరస్య = వరదరాజస్వామియొక్క, వరవితరణభూమా = వరాలను అనుగ్రహించడంలోని గొప్పతనం, నిత్యం శతగుణపరిణామః = ఎల్లప్పుడు వందరెట్లు వృద్ధి అవుతున్నదో, సః అయమ్ = ఆఈ యథోక్తకారి స్వామి, శరణమ్ ఉపగతానాం = శరణు పొందినవారి ఆదేశాన్ని పాటించేవాడు, సర్వజంతోః = సకలజీవులకు, సమ్ముఖఃసన్ = సులభుడై, పరితాపం శమయతి = వారి అన్ని తాపాలను తీరుస్తున్నాడు.

శ్రీహస్తిశైలశిఖరోజ్జ్వలపారిజాతం అయిన వరదరాజస్వామికి "వరన్తరుమ్ పెరుమాళ్" అనే తిరునామం, ఆ తిరునామానికి తగినట్లు వరాలను ఇచ్చే గొప్పతనం యథోక్తకారి స్వామియొక్క సాన్నిధ్యవిశేషం వల్లనే కల్గిందని తమ అనుభవాన్నిబట్టి ఇందులో దేశికులు అనుగ్రహిస్తున్నారు. వీరు ముందుగా అవతరించి ఉండకపోతే వరదరాజస్వామి అవతరించే ప్రసక్తి లేకపోయేది- అన్నది నిజం కనుక అది ఇక్కడ తెలుపబడింది.



9. కాంచీభాగ్యం కమలనిలయా చేతసోఽభీష్టసిద్ధిః
కల్యాణానాం నిధి రవికలః కోఽపి కారుణ్యరాశిః ।
పుణ్యానాం నః పరిణతి రసౌ భూషయన్ భోగిశయ్యాం
వేగాసేతు ర్జయతి విపులో విశ్వరక్షైకహేతుః ॥

కాంచీభాగ్యం = కాంచీనగరంయొక్క భాగ్యం అనదగినవాడు, కమల నిలయా చేతసః+ అభీష్టసిద్ధిః = కోమలవల్లిత్తాయార్ మనస్సును పూర్తిచేసినవాడు, కల్యాణానాం అవికలః నిధిః = శుభాలకు అక్షయమైన నిధి అయినవాడు, కః కారుణ్యరాశిః అపి = అద్వితీయమైన కరుణాగుణరాశి, నః పుణ్యానాం = మనం చేసికొన్న పుణ్యాలయొక్క, పరిణతిః = ఫల పరిణామంగా రూపొందినవాడు, విశ్వరక్షైకహేతుః = సకలజగద్రక్షకుడు, విపులః వేగాసేతుః = మిక్కిలి పెద్ద (గొప్ప) వేగాసేతువు అయినవాడు, భోగిశయ్యాం = శేషశయనాన్ని, భూషయన్ = అలంకరిస్తూ, జయతి = సర్వోత్కర్షతో వెలుగుతున్నాడు.

ఈశ్లోకంలో **"కాఽపి కారుణ్యసీమా"** అని, **"విశ్వభోగైకహేతుః"** అని పాఠాంతరాలున్నాయి. మునుముందుగా యథోక్తకారిస్వామి అవతరించినందు వల్లనే మిగిలిన అక్కడి అర్చామూర్తులు అవతరించే ప్రసక్తి ఏర్పడినందువల్ల **"కాంచీభాగ్యమ్"** అనే ప్రయోగం ఇక్కడ సార్థకం.

10. వేగాసేతో రిదం స్తోత్రం వేంకటేశేన నిర్మితమ్ ।
యే పఠంతి జనా స్తేషాం యథోక్తం కురుతే హరిః ॥

వేంకటేశేన నిర్మితం = శ్రీమద్వేంకటనాథార్యులచే రచింపబడిన, ఇదం = ఈ, వేగాసేతోః స్తోత్రం = వేగాసేతుస్తుతిని, యే పఠంతి = ఎవరు అనుసంధిస్తున్నారో, తేషాం = వారికి, హరిః = భగవానుడు, యథా ఉక్తం = చెప్పిన రీతిలో, కురుతే = చేస్తున్నాడు.

**"యథోక్తకారి"** అని **"శొన్న వణ్ణమ్ శెయ్‌త పెరుమాళ్"** అని కేవలం రాతలలో, శ్రవణంలో మాత్రమేకాదు; నిజంగానే ఇక్కడి స్వామి, ఈ స్తుతిని అనుసంధించే వారికి స్వానుభవంలో ఆ నామసార్థక్యాన్ని అనుభవింపజేస్తాడు- అని అంటూ శ్రీదేశికులు ఈ స్తుతిని ముగించారు.



శ్రీవేదాంతదేశికులు రచించిన

# శ్రీహయగ్రీవస్తోత్రం

శ్రీమాన్ వేంకటనాథార్యః కవితార్కిక కేసరీ ।
వేదాంతాచార్యవర్యో మే సన్నిధత్తాం సదా హృది ॥

జ్ఞానానందమయం దేవం నిర్మలస్ఫటికాకృతిమ్ ।
ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవ ముపాస్మహే ॥

జ్ఞాన + ఆనందమయం = జ్ఞానానంద స్వరూపుడు, నిర్మల =(స్వచ్ఛమైన÷ దోషము లేని, స్ఫటిక = స్ఫటికమువంటి, ఆకృతిం = ఆకారమును కల్గినవాడు, సర్వవిద్యానాం = అన్ని విద్యలకు, ఆధారం =ఆధారభూతుడును అగు, హయగ్రీవం దేవం = హయగ్రీవభగవానుని, ఉపాస్మహే = ఉపాసించుచున్నాము.

ఈ శ్లోకమున భగవానుని శాస్త్రచోదితమైన స్వరూపము ధ్యానింపబడు చున్నది.

జ్ఞానానందములను స్వరూపనిరూపకములుగా కల్గినవాడు, ఏ దోషము లేని, స్వచ్ఛమైన, స్ఫటికమువంటి ఆకారమును కల్గినవాడు, సమస్తవిద్యలకు ఆధారమైనవాడగు శ్రీహయగ్రీవభగవానుని ధ్యానించుచున్నాను.

ఈ శ్లోకము వేదాంతదేశికులు రచించినదని కొందరు, కాదని కొందరు అభిప్రాయపడుచున్నారు.

1. స్వతస్సిద్ధం శుద్ధస్ఫటికమణిభూభృత్ ప్రతిభటమ్
సుధాసధ్రీచీభిః ద్యుతిభి రవదాత త్రిభువనమ్ ।
అనంతై స్త్రయ్యంతై రనువిహిత హేషాహలహలమ్
హతాశేషావద్యం హయదన మీడీమహి మహః ॥

స్వతస్సిద్ధం = కర్మమూలముగా పుట్టినదిగా కాక, సహజముగా అవతరించి నది, శుద్ధ = పరిశుద్ధమైన, స్ఫటికమణి = స్ఫటికమను మణులతో కూడిన,



భూభృత్ = పర్వతముతో, ప్రతిభటం = స్పర్థించునది (పోలినది, మించినది), సుధాసధ్రీచీభిః = అమృతముతో పోలిన, ద్యుతిభిః = కాంతులచే, అవదాత = తెల్లగా చేయబడిన, త్రిభువనం = ముల్లోకములను కల్గినది, అనంతైః = అవధి లేని, త్రయ్యంతైః = వేదములచే, అనువిహిత =అనువదింపబడిన, హేషాహలహలం = హలహలమను హేషారవమును కల్గినది, హత= నశించిన, అశేష = సమస్తమైన, అవద్యం = దోషములను కల్గినది అగు, హయవదనం = హయగ్రీవరూపమగు, మహః = కాంతిని, ఈడీమహి = స్తుతింతుము.

శ్రీదేశికుల హయగ్రీవస్తోత్రమున ఈ శ్లోకము మొదటిది. ఇందు శ్రీహయగ్రీవరూపము ధ్యానింపబడుచున్నది.

**"అజాయమానో బహుధా విజాయతే"** అనునట్లు కర్మఫలితమువలన కాక నిర్హేతుక కృపవలన అవతరించినది, నిర్మలమైన, స్ఫటికమణులతో కూడిన పర్వతముతో స్పర్థించునది, అమృతమువంటి కాంతులతో ముల్లోకములను తెల్లగా చేయునది, అసంఖ్యాకములగు, వేదముల ప్రతిరూపములగు హలహలమని శబ్దించు హేషారవములను చేయునది, ఎట్టి హేయగుణమును లేనిది అగు హయగ్రీవులనెడి పరంజ్యోతిని స్తుతింతుము- అని భావము.

2. ప్రాచీ సంధ్యా కాచి దంతర్నిశాయాః
ప్రజ్ఞాదృష్టే రంజనశ్రీ రపూర్వా ।
వక్త్రీ వేదాన్ భాతు మే వాజివక్త్రా
వాగీశాఖ్యా వాసుదేవస్య మూర్తిః ॥

అంతః నిశాయాః = అజ్ఞానము అను రాత్రియొక్క (అంతమును సూచించు), కాచిత్ = అనిర్వచనీయమైన, ప్రాచీ సంధ్యా = ప్రాతఃసంధ్య, ప్రజ్ఞాదృష్టేః = ప్రతిభ అను నేత్రమునకు, అపూర్వా = ఇంతకు ముందు లేని (గొప్పదైన), అంజనశ్రీః = అంజనము (కాటుక) యొక్క సిరి, వేదాన్ = వేదములను, వక్త్రీ = పల్కునది, వాజివక్త్రా = హయవదనమును కల్గినది, వాక్+ఈశ + ఆఖ్యా = హయగ్రీవులను పేరు కల్గినది అగు, వాసుదేవస్య = వాసుదేవుడను పరమాత్మయొక్క, మూర్తిః = రూపము, మే = నాకు, భాతు = ప్రకాశించునుగాక !

తమ కన్నులముందు సాక్షాత్కరించిన హయగ్రీవుల రూపము నిత్యము మనస్సున ప్రకాశింపవలెనను కోరికను కవి ఇందు ప్రకటించుచున్నారు. తైలధారవలె అవిచ్ఛిన్నమైన భావనయేకదా భక్తి. అట్టి నిరంతరధ్యానమువలన పరభక్తి, తన్మూలముగా నిత్యము మనస్సున భగవానుని రూపసాక్షాత్కర రూపమైన పరజ్ఞానము, దానివలన పునర్విశ్లేషభీరుత్వరూపమగు పరమభక్తియు క్రమముగా కల్గును. ఈ మూడును ఇచట కవికి అపేక్షితములని చెప్పనగును.

అజ్ఞాన మను రాత్రిని అంతము చేయు, అనిర్వచనీయమైన ప్రాతఃసంధ్య, త్రైకాలికజ్ఞానరూపమైన ప్రజ్ఞ అను నేత్రమునకు లోకోత్తరమైన కాటుకయు, వేదములను వ్యక్తము చేయునది, హయవదనమును కల్గినది, హయగ్రీవులను పేరు కల్గినది అగు వాసుదేవుడను పరమాత్మయొక్క హయగ్రీవమూర్తి నామనస్సున నిరంతరము భాసించునుగాక !

3. విశుద్ధవిజ్ఞానఘనస్వరూపం
విజ్ఞానవిశ్రాణనబద్ధదీక్షమ్ ।
దయానిధిం దేహభృతాం శరణ్యం
దేవం హయగ్రీవ మహం ప్రపద్యే ॥

విశుద్ధ = నిర్మలమైన, విజ్ఞానఘన = విజ్ఞానమనే నిబిడమైన, స్వరూపం = స్వరూపమును కల్గినవాడు, (నిర్మలజ్ఞానస్వరూపుడు), అందువలననే, విజ్ఞాన = శాస్త్ర జ్ఞానమును, విశ్రాణన = అనుగ్రహించుటలో, బద్ధదీక్షం = దీక్షను కల్గినవాడు, దయానిధిం = కరుణకు నిధి, దేహభృతాం = ప్రాణులకు, శరణ్యం = గొప్ప శరణమును అగు, హయగ్రీవం దేవం = హయగ్రీవుడను పేరును కల భగవానుని, అహం = నేను, ప్రపద్యే = శరణు వేడుచున్నాను.

తమకు ప్రత్యక్షమైన శ్రీహయగ్రీవ భగవానుని దేశికులు ప్రపత్తి చేయుచున్నాడు.

నిర్మలమైన విజ్ఞానమే స్వరూపముగా కల్గినవాడు, అట్టి విజ్ఞానమును అనుగ్రహించుటయే దీక్షగా కల్గినవాడు, దయకు నిధి, ప్రాణులకు గొప్ప శరణము అగు శ్రీహయగ్రీవదేవుని శరణు వేడుచున్నాను.



4. సమాహార స్సామ్నాం ప్రతిపద మృచాం ధామ యజుషాం
లయః ప్రత్యూహానాం లహరివితతి ర్బోధజలధేః ।
కథాదర్పక్షుభ్యత్కథకకుల కోలాహలభవం
హరత్వంతర్ధ్వాంతం హయవదన హేషాహలహలః ॥

సామ్నాం = సామవేదముయొక్క, సమాహారః = సమూహము, ఋచాం = ఋగ్వేదముయొక్క, ప్రతిపదం = ప్రతిరూపము, యజుషాం = యజుర్వేదము యొక్క, ధామ = స్థానము (శరీరము), ప్రత్యూహానాం = ప్రతిబంధకములయొక్క, లయః = ధ్వంసము (చేయునది), బోధజలధేః = జ్ఞానసముద్రముయొక్క, లహరివితతిః = కెరటముల సమూహము అగు, హయవదన = శ్రీహయగ్రీవ మూర్తియొక్క, హేషాహలహలః = హలహలమని శబ్దించు హేషారవము, కథాదర్ప = వాదగర్వముచే, క్షుభ్యత్ = అహంకరించు, కథకకుల = ప్రతివాదుల సమూహముయొక్క, కోలాహల = కలకలముచే, భవం = పుట్టిన, అంతర్ధ్వాంతం= అజ్ఞానమును, హరతు = పోగొట్టునుగాక!

మొదటి శ్లోకములోని ఉత్తరార్ధమును ఈ శ్లోకము విశదీకరించుచున్నది. అనగా- హయగ్రీవుల హేషాధ్వనియొక్క వైశిష్ట్యము ఈ శ్లోకములోని ప్రతిపాదితార్థము. పూర్వశ్లోకమున దేశికులు హయగ్రీవులను ధ్యానించి "ఈడీమహి" అని పలుకగానే భక్తపరతంత్రుడగు హయవదన భగవానుడు తావన్మాత్రముననే తృప్తిచెంది, వారి ముందు హలహలమను హేషారవమును చేయుచు ప్రత్యక్షము కాగా, దానిని విని పరవశులైన దేశికులు ఆ ధ్వనిని స్తుతించుచున్నారనియు చెప్పవచ్చును. హయవదనస్తుతితో పనియే లేదు, ఆ స్వామి హేషాహలహలరవము మాత్రమే ధ్యానించువారికి ఇష్టప్రాప్తిని, అనిష్టప్రాప్తిని కలుగచేయుచున్నదని పల్కుచున్నారనియు చెప్పవచ్చును.

సామవేదముల సమాహారము, ఋగ్వేదప్రతిరూపము, యజుర్వేదము యొక్క నిలయము, జ్ఞానసముద్రముయొక్క కెరటముల సమూహము అగు శ్రీహయగ్రీవుల హేషారూపమైన హలహలధ్వని ప్రతివాదులు మిక్కిలి గర్వించి చేయు కోలాహలమువలన తన భక్తుల మనస్సులలో కల్గు సంశయవిపర్యయాది రూపమైన అజ్ఞానాంధకారమును పోగొట్టును గాక ! -అని భావము.

5. అపౌరుషేయై రపి వాక్ప్రపంచై
రద్యాపి తే భూతి మదృష్టపారామ్ ।
స్తువ న్నహం ముగ్ధ ఇతి త్వయైవ
కారుణ్యతో నాథ ! కటాక్షణీయః ॥

నాథ ! = స్వామీ !, అపౌరుషేయైః = మానవనిర్మితములు కాని వేదముల రూపములో నున్న, వాక్ ప్రపంచైః= వాక్సమూహములచే, అపి = కూడ, అద్య అపి = ఈనాటికిని, అదృష్టపారాం = చూడబడని అంతును కల, తే = నీయొక్క, భూతిం = సంపదను, స్తువన్ = స్తోత్రముచేయుచున్న, అహం = నేను, ముగ్ధ + ఇతి =మోహవశుడను కారణముచే, త్వయా = నీచే, కారుణ్యతః ఏవ = సహజమైన కారుణ్యము కారణముచేతనే, కటాక్షణీయః ఏవ = కరుణింపబడవలసినవాడనే సుమా !

పూర్వశ్లోకమున హయగ్రీవభగవానుని శరణుజొచ్చిన దేశికులు, ఆ స్వామి విషయమున స్వరూపానుగుణమైన వాచిక కైంకర్యమును చేయనెంచిరి. అట్టి వాచిక కైంకర్యము "శూழ்ந்திருந்து ஏத்துவர்" అనునట్లు స్తుతించుటయేకదా ! కాని, భగవానుని స్తుతించుట తమ శక్తికి మించినది కావున అట్టి ప్రయత్నమును చేయు తమను క్షమింపవలయునని స్వామిని దేశికులు ఇందు కోరుచున్నారు.

స్వామీ ! ఉభయవిభూతులకు ప్రభువగు నీ ఐశ్వర్యము ఎంత గొప్పదో అపౌరుషేయములగు వేదములుకూడ ఈ నాటికినీ తెలియలేకున్నవి. అట్టి నీ గొప్పతనమును కీర్తించు నేను ఎంత మూర్ఖుడను ! ఇట్టి నన్ను నీవు నీ నిర్హేతుకకృపవలననే కరుణింపవలయును సుమా !- అని భావము.

6. దాక్షిణ్యరమ్యా గిరిశస్య మూర్తిః
దేవీ సరోజాసనధర్మపత్నీ ।
వ్యాసాదయోఽపి వ్యపదేశ్యవాచః
స్ఫురంతి సర్వే తవ శక్తిలేశైః ॥

దాక్షిణ్యరమ్యా =విద్యాదిప్రదానములచే రమ్యమైన, గిరిశస్య = రుద్రుని యొక్క, మూర్తిః = రూపము, సరోజాసనధర్మపత్నీ = బ్రహ్మదేవుని ధర్మపత్ని అగు, దేవీ = సరస్వతీదేవి, వ్యపదేశ్యవాచః = లోకప్రసిద్ధిని పొందిన కవులగు, వ్యాస + ఆదయః +అపి = వ్యాసభగవానుడు మొదలగువారును, సర్వే = అందఱు, తవ = నీయొక్క, శక్తిలేశైః = (నీవు అనుగ్రహించిన) స్వల్పమైన శక్తులచే, స్ఫురంతి = ప్రకాశించుచున్నారు.

భగవానుని గుణసంపదను పొగడుట వేదములకే సాధ్యము కానిచో, శ్రీరామాయణ, మహాభారతాది ప్రసిద్ధగ్రంథములను రచించిన వాల్మీకి వ్యాసాదుల ప్రయత్నములనుగూర్చి ఏమనవలెను? అనినచో, వారికట్టి కవితాశక్తి నీవను గ్రహించుటవలననే కల్గినది. అంతేకాక, దక్షణామూర్తిగా పేరొందిన రుద్రుడు, చదువుల తల్లి సరస్వతియు నీ అనుగ్రహమువలననే ప్రకాశించుచున్నారు. కావున, నీ కరుణవలన నేనీ స్తుతిని చేయుట సాధ్యమేననుట ప్రస్తుత శ్లోక ప్రమేయము.

"ఓయీ! నీవిట్లు సంకోచపడనేల ! నీకు సహజముగా నున్న శక్తి సామర్థ్యములతో స్తుతింపవచ్చునుకదా !" అని భగవానుడు అనగా, అందులకు సమాధానముగా "స్వామీ ! లోకములో విద్యాప్రదానాదిశక్తిచే రమ్యమైన దక్షిణా మూర్తి, వాగ్రూపిణియైన సరస్వతి, వ్యాసాదిప్రసిద్ధగ్రంథకర్తలు అందఱు నీవు అనుగ్రహించిన స్వల్పశక్తిచే మిణుగురులవలె మినుకు మినుకు మనుచున్నారు"- అని భావము -అని ద్రావిడవ్యాఖ్యానము.

విద్యాదిప్రదానములచే రమ్యమైన రుద్రుని మూర్తి, బ్రహ్మదేవుని ధర్మపత్ని అయిన సరస్వతీదేవి, లోకములో గొప్ప కవులుగా పేరు పొందిన వ్యాసవాల్మీకి పరాశరాది మహర్షులు - మీరు అందఱు నీవు అనుగ్రహించిన అత్యల్పమైన శక్తులచే భాసిల్లుచున్నారు.

7. మందో భవిష్యన్ నియతం విరించో
వాచాం నిధే ! వంచితభాగధేయః ।
దైత్యాపనీతాన్ దయయైవ భూయోఽ
ప్యధ్యాపయిష్యో నిగమాన్ న చేత్ త్వమ్ ॥

వాచాం నిధే = వాక్కులకు నిధి అగు, ఓ హయగ్రీవస్వామీ !, త్వం = నీవు, దైత్య+ అపనీతాన్ = మధుకైటభులచే అపహరింపబడిన, నిగమాన్ =

వేదములను, దయయా + ఏవ = నీ నిర్హేతుకకృపచేతనే, భూయః + అపి = మఱల, న అధ్యాపయిష్యః చేత్ = ఉపదేశింపకపోయినచో, విరించిః = బ్రహ్మ, వంచితభాగధేయః = మోసగింపబడిన భాగ్యము కలవాడై (అపహరింపబడిన వేదమనెడి భాగ్యమును కలవాడై), నియతం = తప్పక, మందః = అజ్ఞుడు, అభవిష్యత్ = అయియుండును.

పూర్వశ్లోకమున "సరోజాసనధర్మపత్నీ" అనుచు బ్రహ్మపేరును పరోక్షముగా ప్రస్తుతింపగానే భగవానుడు "ఓయీ ! నీకున్న శక్తియుక్తులు నన్ను స్తోత్రము చేయుటకు చాలకున్నను, శీఘ్రఫలప్రదుడు, ఎల్లప్పుడును వేదమును నాల్గు ముఖములతో అభ్యసించువాడగు బ్రహ్మను ప్రార్థించిన అతడు నీకట్టి కవనశక్తిని ప్రసాదింపగలడు కదా !" అనగా, అందులకు సమాధానముగా దేశికులు, ఈ శ్లోకమున "స్వామీ ! ఆ బ్రహ్మకు కూడ నీవు సృష్టిప్రారంభమున వేదముల నిచ్చి, అతడు వానిని కోల్పోయిన ఆపత్సమయమున సహాయపడి, వేదములను తిరిగి అతనికి అనుగ్రహించితివి కదా ! కావున నీవే కటాక్షింపవలెను" అని అనుచున్నారు.

వాక్కులకు నిధి అగు ఓ హయగ్రీవప్రభూ ! మధుకైటభులనెడి దైత్యులు వేదములను అపహరించినపుడు నీవు నిర్హేతుకకృపతో హయగ్రీవరూపమును దాల్చి వారిని మర్దించి, తిరిగి వేదములను బ్రహ్మకు "వేద మధ్యాపయద్విధిమ్" అని, "యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యో వై వేదాం శ్చ ప్రహిణోతి తస్మై" అనునట్లు అనుగ్రహించియుండక పోయినచో, ఆ బ్రహ్మకూడ సృష్టికి అవసరమైన జ్ఞానము లేని అభాగ్యుడై అలమటించి, మందబుద్ధియై యుండును కదా ! -అని భావము.

8. వితర్కడోలాం వ్యవధూయ (త) సత్త్వే
బృహస్పతిం వర్తయసే యతస్త్వమ్ ।
తేనైవ దేవ ! త్రిదశేశ్వరాణామ్
అస్పృష్టడోలాయిత మాధిరాజ్యమ్ ॥

దేవ = స్వామీ !, యతః = ఎందువలన, త్వం = నీవు, బృహస్పతిం = సురుల గురువగు బృహస్పతిని, వితర్కడోలాం = దురూహలచే కల్గు



చిత్తచాంచల్యమునుండి, వ్యవధూయ= నివారించి, సత్త్వే = సత్త్వ (గుణ) మార్గమున, వర్తయసే = ప్రవర్తించునట్లు చేయుచున్నావో, తేన +ఏవ = ఆ కారణముచేతనే, త్రిదశ+ఈశ్వరాణం = ఇంద్రాదులయొక్క, ఆధిరాజ్యం = ఆధిపత్యము, అస్పృష్టడోలాయితం = ఊగిసలాటను లేనిదిగా (స్థిరమైనదిగా) అగుచున్నది.

భగవానుడు కవితో "ఓయీ ! నీవు బ్రహ్మదేవుని ప్రార్థింపకున్నను ఆ బ్రహ్మకు పిమ్మట బుద్ధిశాలిగా, జ్ఞాననిధిగా చెప్పబడు బృహస్పతిని ప్రార్థింపవచ్చును కదా !" అనగా అందులకు కవి, "ఆ బృహస్పతికూడ నీవు కటాక్షించుటవలనే సత్త్వమార్గమున ప్రవర్తించుచున్నాడు; కావుననే ఇంద్రాదుల ఐశ్వర్యము సైతము అవిచాల్యముగా నున్నది" అని పల్కుచున్నారు.

స్వామీ ! నీవు దేవగురువగు బృహస్పతికి కల్గు దురూహలను పోగొట్టి, అతనికి సన్మార్గమును చూపించుచున్నావు. అట్టి ఆ బృహస్పతియొక్క బుద్ధిబలముచేతనే ఇంద్రాది సురప్రభువుల అధికారము స్థిరముగా నున్నది - అని భావము.

బృహస్పతి దేవగురువు అయినను నాస్తికవాదములను ప్రవర్తింపజేసి, చార్వాకుడైనట్లు దర్శనశాస్త్రమున ప్రసిద్ధము. "అగ్నిహోత్రం త్రయీ వేదాః త్రిపుండ్రం భస్మగుంఠనమ్, ప్రజ్ఞాపౌరుషనిస్స్వానాం జీవో జల్పతి జీవికామ్" ఇత్యాదిగా వైదిక ధర్మవిరుద్ధములైన నాస్తిక వాదములను ప్రచారము చేసినవాడు బృహస్పతి. అట్టి బృహస్పతికి నీవు గురువు - అని తాత్పర్యము. అనగా- బృహస్పతి కేవలము గురువు; హయగ్రీవ స్వామి "గురూణా మపి గురుః" కదా !

9. అగ్నౌ సమిద్ధార్చిషి సప్తతంతోః-
రాతస్థివాన్ మంత్రమయం శరీరమ్ ।
అఖండసారై ర్హవిషాం ప్రధానై
రాప్యాయనం వ్యోమసదాం విధత్సే ॥

సమిద్ధార్చిషి = దీప్తజ్వాలలను కల, సప్తతంతోః = సప్తతంతువనబడు క్రతువుయొక్క, అగ్నౌ = అగ్నియందు, మంత్రమయం = వేదమంత్రరూపమైన,

శరీరం = శరీరమును, ఆతస్థివాన్ = పొందినవాడవై, అఖండసారైః = సమగ్రమైన సారమును కల, హవిషాం ప్రధానైః = ప్రధానములైన చరుపురోడాశాది హవిస్సులతో, వ్యోమసదాం = దేవతలకు, ఆప్యాయనం = తృప్తిని, విధత్సే = కల్గించుచున్నావు.

పూర్వశ్లోకములలో ప్రస్తుతింపబడిన బ్రహ్మ, రుద్రుడు, బృహస్పతి, ఇంద్రుడు మొదలగు దేవతలు స్వతంత్రులు కదా ! యజ్ఞములలో స్వతంత్రరూపముగ ఆరాధ్యులు కదా ! అనినచో, యజ్ఞయాగాదులలో వారి పేర్లు ప్రత్యేకముగా ఉచ్చరింపబడినను, యజ్ఞమున అగ్నిరూపుడవై, మంత్రమయమైన శరీరమును దాల్చు నీవే ఆ హవిస్సులను ఆస్వాదించి, ఆ దేవతలకు తృప్తిని కల్గించుచున్నావు. కావున వారందఱు సర్వథా నీకు పరతంత్రులు అని పల్కుట ఇందలి విశేషము.

దేవా! మిక్కిలిగా వెలుగొందు జ్వాలలను కల్గిన మఖాగ్నియందు మంత్రమయమైన శరీరమును కల్గినవాడవై, ఆ క్రతువులో సమర్పింపబడిన చరుపురోడాశాది హవిస్సులను నీవు గ్రహించి, ఆయా దేవతలకు తృప్తిని కల్గించుచున్నావు -అని భావము.

**10. యన్మూల మీదృక్ ప్రతిభాతి తత్త్వం**
**యా మూల మామ్నాయమహాద్రుమాణామ్ ।**
**తత్త్వేన జానంతి విశుద్ధసత్త్వాః**
**తా మక్షరా మక్షరమాతృకాం తే ॥**

ఈదృక్ = ఇట్టి (కంటికి కనుపించు), తత్త్వం = ఆకాశాదితత్త్వ సమూహము, యత్ + మూలం = దేనిని కారణముగా కల్గినదై, ప్రతిభాతి = ప్రతీయమానమగుచున్నదో, ఆమ్నాయ మహాద్రుమాణాం = వేదములనబడు మహావృక్షముల యొక్క, యా = ఏ అక్షరమాతృక, మూలం = ఆదిభాగమో, అట్టి, అక్షరాం = నశింపని, తాం =ఆ, అక్షరమాతృకాం = అకారాది అక్షరమాతృకను, తే = నీకు సంబంధించినదిగా, విశుద్ధసత్త్వాః = నిర్మలమైన సత్త్వగుణమును పకలవారు, తత్త్వేన = యథార్థతత్త్వముగా, జానంతి = తెలిసికొనుచున్నారు.



"స్తోత్రమును చేయుటకు అవసరమైన జ్ఞానము మీకు కావలయునన్న అక్షర సమిష్టిరూపమైన మాతృకను ప్రార్థించినచో, మీ కోరిక తీరును కదా !" అని భగవానుడనగా, అందులకు కవి "స్వామీ ! ఆ అక్షరమాతృకయు నీకు శేషమే కదా ! ఆమెకును అంతర్యామియై, తచ్ఛబ్దవాచ్యుడవై యున్నవాడవు నీవే కదా ! కావున నిన్నే ప్రార్థింతును'' అనుచున్నారు. లేక, "సర్వప్రపంచమునకును మూలకారణము నీవే'' అనుచున్నారనియు చెప్పవచ్చును.

స్వామీ ! కంటికి కనుపించు ఆకాశాది సర్వప్రపంచతత్త్వములకు, వేదములనెడి మహావృక్షములకు మూలమును, అనశ్వరమును అగు అక్షరమాతృక నీకు శేషమైనదిగా విశుద్ధస్వభావమును కల్గిన మహాత్ములు తెలిసికొనుచున్నారు.

**11. అవ్యాకృతాత్ వ్యాకృతవా నసి త్వం**
**నామాని రూపాణి చ యాని పూర్వమ్ ।**
**శంసంతి తేషాం చరమాం ప్రతిష్ఠాం**
**వాగీశ్వర! త్వాం త్వదుపజ్ఞవాచః ॥**

వాక్ + ఈశ్వర = వాక్కులు ప్రభువగు హయగ్రీవస్వామీ !, త్వం = నీవు, పూర్వం =సృష్టిసమయమున, అవ్యాకృతాత్ = నామరూపములు లేని, మఱియు, సత్ అను పేరును కల్గిన జగత్తునందు ప్రవేశించి, ఆ జగత్తుయొక్క, యాని = ఏ, నామాని = పేర్లను, చ = మఱియు, రూపాణి = రూపములను (స్వభావములను), వ్యాకృతవాన్ = విభాగమును చేసినవాడవై, అసి = ఉన్నావో, తేషాం = ఆ నామరూపములయొక్క, చరమాం ప్రతిష్ఠాం = పర్యవసానభూమివిగా, త్వాం = నిన్ను, త్వత్ +ఉపజ్ఞవాచః = నీచే దర్శింపబడిన వేదములను కల మహాత్ములు (నీ అనుగ్రహమువలన జ్ఞానమును పొందిన మహనీయులు), శంసంతి = కీర్తించుచున్నారు.

సృష్టిచేయబడిన ప్రపంచముయొక్క పర్యవసానస్థితియు నీవే అనుచు కవి స్తుతించుచున్నారు.

ఓ వాగీశ్వరా ! నీవు సృష్టిప్రారంభమున నామరూపవిభాగానర్హమై, 'సత్' పేరుతో మాత్రము వ్యవహరింపబడు ఈ జగత్తుయందు అనుప్రవేశించి, దానిని

నామరూపములతో విభాగించితివి. కావున, లోకములోని వస్తువుల ఆయా నామములయొక్క, రూపములయొక్క పర్యవసానరూపము నీవే అని నీచే దర్శింపబడిన (నీకృపమూలముగా) జ్ఞానమును పొందిన మహాత్ములు పొగడుచున్నారు.

**12. ముగ్ధేందునిష్యందవిలోభనీయాం**
**మూర్తిం తవానందసుధాప్రసూతిమ్ ।**
**విపశ్చిత శ్చేతసి భావయంతే**
**వేలా ముదారా మివ దుగ్ధసింధోః ॥**

ముగ్ధ + ఇందు= బాలచంద్రునియొక్క, నిష్యంద =వెన్నెలవలె, విలోభనీయాం = మనోహరమైనది, ఆనంద = ఆనందమనెడి, సుధా = అమృతమునకు, ప్రసూతిం = జన్మస్థానము (కావుననే), దుగ్ధసింధోః = పాలసముద్రముయొక్క, ఉదారాం =గొప్పదైన, వేలాం = సేతువువలె, (అభివృద్ధివలె, తీరమువలె) ఉన్న, తవ = నీయొక్క, మూర్తిం = రూపమును, విపశ్చితః = విద్వాంసులు, చేతసి = మనస్సుయందు, భావయంతే = భావించుచున్నారు (ఉపాసించుచున్నారు).

యోగులును మోక్షసిద్ధికొఱకు నిన్నే ఉపాసించుచున్నారనుట ఇందలి ప్రధానవిషయము. లేక, "నీవు పల్కు విధముగా నన్ను సర్వాధికునిగా ఎవరైనను ఉపాసించిరా ?" అని భగవానుడు ప్రశ్నింపగా, అందులకు సమాధానమును కవి ఇందు తెలుపుచున్నారనియు చెప్పవచ్చును.

బాలచంద్రుని వెన్నెలవలె మనస్సును హరించునది. ఆనందమను అమృతప్రవాహమును ప్రవహింపచేయునది, పాలసముద్రముయొక్క అవధివలె నున్నదగు నీ రూపమును యోగులు తమ మనస్సున నిలుపుకొని, ధ్యానము చేయుచున్నారు- అని భావము.

**13. మనోగతం పశ్యతి య స్సదా త్వాం**
**మనీషిణాం మానసరాజహంసమ్ ।**
**స్వయం పురోభావవివాద (విభావ) భాజః**
**కింకుర్వతే తస్య గిరో యథార్హమ్ ॥**



మనీషిణాం = బుద్ధిమంతులయొక్క, మానసరాజహంసం = మనస్సు అనెడి మానససరస్సులో క్రీడించు గొప్ప హంస అగు, త్వాం = నిన్ను, యః = ఎవడు, సదా = ఎల్లప్పుడు, మనోగతం = మనస్సున నిలచినవానినిగా, పశ్యతి = చూచుచున్నాడో, తస్య = ఆ వ్యక్తియొక్క, గిరః = వాక్కులు, స్వయం = స్వయముగా, పురోభావ = అహమహమికతో, వివాదభాజః = వివాదమును కల్గినవై, యథార్హం = యథాయోగ్యముగా, కింకుర్వతే = కైంకర్యమును చేయుచున్నవి.

శ్రీహయగ్రీవమూర్తిని ఉపాసించినవారికి అప్రయత్నముగానే విద్య లభించునని పల్కుట ఇందలి సారము. లేక, "నన్ను ఆరాధించిన వారికి ఫలితము సిద్ధించుననుట ఎట్లు" అని భగవానుడు ప్రశ్నింపగా, అందులకు కవి "స్వామీ ! నిన్ను ఎల్లప్పుడు మనస్సున ధ్యానించువారి హృదయమును స్థిరనివాసముగా కల్గియున్నావు. వాక్సిద్ధిని కోరి, ఆరాధించువారికి అట్టికి సిద్ధి తనకుతానే కల్గునట్లు అనుగ్రహించుచున్నావు" అని సమాధానమును పల్కుచున్నారనియు చెప్పనగును.

స్వామీ! గొప్ప బుద్ధిని కల్గిన మహాత్ముల మనస్సు అనెడు మానస సరోవరమున విహరించు రాజహంసవు అగు నిన్ను ఏ సాధకుడు తన హృదయమున నిత్యము ధ్యానించునో అతనికి అమోఘములైన వాక్కులు ప్రథమదశలోనే అహమహమికతో స్ఫురించి, సేవచేయును. వారు కోరిన వాక్సిద్ధి వారికి కల్గును -అని భావము.

**14. అపి క్షణార్ధం కలయంతి యే త్వామ్**
**ఆప్లావయంతం విశదై ర్మయూఖైః ।**
**వాచాం ప్రవాహై రనివారితై స్తే**
**మందాకినీం మందయితుం క్షమం తే ॥**

విశదైః = స్వచ్ఛమైన, మయూఖైః = కిరణములచే, ఆప్లావయంతం = (అమృతధారతో తడపునట్టి) చల్లపఱచునట్టి, త్వాం = నిన్ను, యే = ఎవరు, క్షణ+ అర్ధం అపి = ఒక అరక్షణమైన, కలయంతి = ధ్యానింతురో, తే = వారు, అనివారితైః = అడ్డులేని (ప్రత్యర్థులచే నివారింపబడని), వాచాం ప్రవాహైః = వాక్ ప్రవాహములచే, మందాకినీం = గంగానదినికూడ, మందయితుం = అల్ప వేగమును కల్గినదిగా చేయుటకు, క్షమంతే = సమర్థులగుచున్నారు.

నిన్ను కొల్చువారికి విద్యాలాభము మాత్రమే కాదు; వారికి అప్రతిహతకవితా రచనాశక్తియు కలుగును అనుచున్నారు. లేక, "నీవు పల్కిన సిద్ధి చిరకాలము సాధకులు ఆరాధించిన పిమ్మట కదా కల్గునది ! శీఘ్రముగా పొందినవారు కలరా ?" అని భగవానుడు పలుకగా అందులకు కవి "స్వామీ ! నిన్ను చిరకాలము ఆరాధింప పనిలేదు; అరక్షణము ధ్యానించిన మాత్రముననే, గంగానదీప్రవాహ వేగమును సైతము మించిన వేగమును కల్గిన వాక్కులు వారికి కల్గును'' అని పల్కుచున్నారనియు చెప్పవచ్చును.

స్వామీ ! (తెల్లని) స్వచ్ఛమైన కిరణములతో నీ భక్తులను సర్వాంగము చల్లపఱచునట్టి నిన్ను అరక్షణమైనను ఎవరు మనఃపూర్వకముగా ధ్యానింతురో వారు తమ వాగ్వేగముతో గంగానదినికూడ తక్కువ వేగమును కల్గినట్లు చేయగల్గుదురు- అని భావము.

**"యోగో జ్ఞానం తథా సాంఖ్యం విద్యాః శిల్పాది కర్మ చ, వేదాః శాస్త్రాణి విజ్ఞాన మేతత్ సర్వం జనార్దనాత్"** అనునట్లు సమస్త వాఙ్మయము, కళలు స్వామి అనుగ్రహముచే కలుగునుకదా ! ఇక కవితను గూర్చి చెప్పవలసిన పని ఏమి ? ఇందులకు ప్రస్తుత స్తోత్రకర్త అగు దేశికులే సాక్షి.

**15. స్వామిన్ ! భవద్ధ్యానసుధాభిషేకాత్**
**వహంతి ధన్యాః పులకానుబంధమ్ ।**
**అలక్షితే క్వాపి నిరూఢమూల**
**మఙ్గేష్వివానందథు మంకురంతమ్ ॥**

స్వామిన్ = స్వామీ !, ధన్యాః= అదృష్టవంతులు, భవత్ = నీయొక్క, ధ్యాన = ధ్యానము అనెడి, సుధా + అభిషేకాత్ = అమృతసేచనమువలన, అలక్షితే అపి = కనుపింపనిది అయినను, క్వ = ఒకానొక ప్రదేశమున, నిరూఢమూలం = స్థిరమైన మూలమును కల్గినది, అంగేషు = అవయవములయందు, అంకురతం= ఉద్భవించునదియు, ఆనందథుమ్ ఇవ = ఆనందమువలె నున్నదియు అగు, పులక = అనుబంధం = గగుర్పాటును, వహంతి = పొందుచున్నారు.



కవి ఇందు, ధన్యులు మాత్రమే నీయందు గొప్ప భక్తిని కల్గియుందురను చున్నారు. లేక, "నన్ను ధ్యానించినవారు ఎట్టి ఫలితమును పొందిరో? ఏమో ! అది అట్లుండనిమ్ము. వారి అనుభవమును తెలుపుటకు చిహ్నము లేమైన కలవా'' అని భగవానుడనగా, అందులకు కవి ఈ శ్లోకముద్వారా భక్తులకు కల్గు రోమాంచనము, అనంతరశ్లోకమునందు ఆనందబాష్పములను వర్ణించుచున్నా రనియు చెప్పవచ్చును. ఉత్కటమైన భక్తి కల్గినపుడు **"స్వరనేత్రాంగ విక్రియా"** అనునట్లు కంఠస్వరమున, నేత్రమున, శరీరమున మార్పు కల్గును కదా !'' **"ఆహ్లాదశీతనేత్రాంబుః పులకీకృతగాత్రవాన్, సదా పరగుణావిష్టో ద్రష్టవ్య స్సర్వదేహిభిః"** అను ప్రసిద్ధప్రమాణ మిచట స్మరణీయము.

స్వామీ ! నీ ధ్యాన మనెడిఅమృతాభిషేకమువలన మహాత్ములు కంటికి కనుపింపని హృదయప్రదేశమున స్థిరమైన మూలమును కల్గి, అవయవము లనన్నిటియందు ఉద్భవించి, వ్యాపించు ఆనందమువలె, తమ శరీరమునందు అంతట గగుర్పాటును పొందుచున్నారు -అని భావము. (ఆనందథువనగా ఆనందమే).

**16. స్వామిన్ ! ప్రతీచా హృదయేన ధన్యాః**
**త్వద్ధ్యానచంద్రోదయవర్ధమానమ్ ।**
**అమాంత మానందపయోధి మంతః**
**పయోభిః రక్ష్ణాం పరివాహయంతి ॥**

స్వామిన్ = స్వామీ !, ధన్యాః = భాగ్యవంతులు, ప్రతీచా = అంతర్ముఖమైన, హృదయేన = హృదయముతో, త్వత్ = నీయొక్క, ధ్యాన= ధ్యానము అనెడి, చంద్ర+ఉదయ = చంద్రోదయమువలన, వర్ధమానం = పెంపొందు, అంతః = మనస్సులోన, అమాంతం = నిరవధికమైన, ఆనందం = ఆనందమనెడి, పయోధిం= సముద్రమును, అక్ష్ణాం = కన్నులయొక్క, పయోభిః = నీటిచే, పరివాహయంతి = ప్రవాహమును కల్గినదానినిగా చేయుచున్నారు.

హయగ్రీవభగవానుని ధ్యానించువారు బ్రహ్మానందమును పొందుదు రనుట ఇందలి సారాంశము. పూర్వశ్లోకమున భగవద్భక్తుల పులకాంకురములు వర్ణింపబడగా, ఇందు ఆనందబాష్పములు వర్ణింపబడుచున్నవి.

స్వామీ! అంతర్ముఖమైన మనస్సుతో నీ భక్తులు చేయు ధ్యానము చంద్రోదయము వంటిది. వారి మనస్సులో (భగవద్యానమువలన) కల్గిన ఆనందము అను సముద్రమును ధ్యానమనెడి చంద్రోదయము వృద్ధి పొందించు చున్నది. వారి మనస్సులో ఈ విధముగా పెంపొంది, పెల్లుబికిన అంతు లేని ఆనందసముద్రము బాష్పముల రూపమున బయటకు ప్రవహించుచున్నదని భావము.

**17. స్వైరానుభావా స్త్వదధీనభావాః**
**సమృద్ధవీర్యాః (సం రుద్ధవీర్యాం) స్త్వదనుగ్రహేణ ।**
**విపశ్చితో నాథ ! తరంతి మాయాం**
**వైహారికీం మోహనపింఛికాం తే ॥**

నాథ = స్వామీ !, స్వైర+అనుభావాః = నిరంకుశమైన ప్రభావమును కల, త్వత్ + అధీనభావాః = నీయందు ఎల్లప్పుడును (లగ్నమైన) అధీనమైన భావమును కల, విపశ్చితః= జ్ఞానులు, త్వత్ + అనుగ్రహేణ = నీయొక్క ప్రసాదము కారణముచే, (నీసంకల్పముచే) సమృద్ధవీర్యాః = మిక్కిలి అభివృద్ధి చెందిన ఆనందానుభవమును కల్గినవారై, (సంరుద్ధవీర్యాం = అడ్డగింపబడిన శక్తిని కల్గినది), వైహారికీం = నీ లీలకు ఉపకరణమైనది, మోహనపింఛికాం = సకలలోకములను సమ్మోహనపఱచు ఇంద్రజాలిక పింఛమువలె నున్నదగు, తే = నీయొక్క, మాయాం = ప్రకృతిని, తరంతి = దాటుచున్నారు.

భగవానుని అనన్యమైన మనస్సుతో ధ్యానించువారు, భగవన్మాయకు లోనుకారను విషయమిచట ప్రస్తుతింపబడుచున్నది. లేక, "నన్ను ధ్యానము చేయువారికి పులకలు కల్గుట, ఆనందబాష్పములు కల్గుటవంటి దృష్టఫలములే తప్ప, సంసారబంధమునుండి వారు విడివడిరా ?" అని భగవానుడు ప్రశ్నింపగా, అందువలకు కవి, "స్వామీ ! నీ అనుగ్రహముచే వారు ప్రకృతిసంబంధమునుండి దూరము కాగల్గుచున్నారు" అని పల్కుచున్నారనియు చెప్పవచ్చును.

స్వామీ ! నిరంకుశప్రభావమును కల్గినవారు, నీయందు నిత్యము అగ్నమైన మనస్సును కలవారు, కావుననే మిక్కిలి వృద్ధి చెందిన, అడ్డు లేని ఆనందానుభవ



మును కలవారు అగు విద్వాంసులు (నీ అనుగ్రహమువలన నిరోధింపబడిన మోహనశక్తిని కల్గినది) నీకు ఉపకరణమైనది, సర్వజగత్తును మోహింపచేయు ఇంద్రజాలికుని చేతిలోని పింఛమువలె నున్నదియును అగు మాయను దాటుచున్నారు- అని భావము.

**18. ప్రాఙ్నిర్మితానాం తపసాం విపాకాః**
**ప్రత్యగ్ర నిఃశ్రేయససంపదో మే ।**
**సమేధిషీరం స్తవ పాదపద్మే**
**సంకల్పచింతామణయః ప్రణామాః ॥**

ప్రాక్ +నిర్మితానాం = పూర్వము సంపాదించిన, తపసాం = తపస్సుల యొక్క, విపాకాః = ఫలములవంటివి, మే = నాకు, ప్రత్యగ్ర = నూతనమైన, నిః శ్రేయససంపదః = మోక్షసంపదను కల్గించునవి, సంకల్ప = కోరికల విషయమున, చింతామణయః = చింతామణివంటివి అగు, తవ =నీయొక్క, పాదపద్మే = పద్మములవంటి పాదములయందలి, ప్రణామాః = (నా) నమస్కారములు, సమేధిషీరన్ = అభివృద్ధినొందునుగాక !

పూర్వజన్మమున గొప్ప తపస్సు చేసినవారికిని నీ మాయను దాటుటలో నీ పాదారవిందములందు ప్రణమిల్లుటయే సాధన మనుచున్నారు. లేక, ఇంతవరకును భక్తియోగనిష్ఠులనుగూర్చి పల్కిన కవి, ఇందు ప్రపత్తినిష్ఠులను గూర్చి పల్కుచున్నారు అని చెప్పనగును. అనగా- జన్మాంతరసుకృతఫలము వలన భగవానుని పాదారవిందములలో ప్రపత్తిని చేసినవారు ఆ స్వామి అనుగ్రహముచే సంసారమును దాటి కృతార్థులగుచున్నారు. కావున ప్రపత్తి సకలఫలసాధనమని పల్కుచున్నారు. లేక, పూర్వశ్లోకమున తెలుపబడిన మాయను పోగొట్టు ఉపాయము ఇందు తెలుపబడుచున్నది- అని చెప్పవచ్చును.

నీ పాదపద్మములయందలి నా ప్రణామములు పూర్వజన్మార్జితములైన తపస్సులయొక్క ఫలములవంటివి, వెంటనే ఈ జన్మలోనే మోక్షమను సంపదను నాకు అనుగ్రహించునవి, నా కోరికను సఫలములు చేయు చింతామణులవంటివి. అవి వృద్ధి పొందునుగాక !

19. విలుప్తమూర్ధన్యలిపిక్రమాణాం
సురేంద్రచూడాపదలాలితానామ్ ।
త్వదంఘ్రిరాజీవరజఃకణానాం
భూయాన్ ప్రసాదో మయి నాథ ! భూయాత్ ॥

నాథ = స్వామీ !, విలుప్త = లోపింపజేయబడిన, మూర్ధన్య = లలాట మందలి, లిపిక్రమాణాం = (విపరీతమైన లేక వ్యతిరేకమైన) వర్ణక్రమమును కల్గినవి, (నుదుటి రాతను సైతము మార్చునవి -అని భావము), సుర + ఇంద్ర = ఇంద్రుడు, బ్రహ్మ మొదలగువారియొక్క, చూడాపద = శిఖాబంధములచే, లాలితానాం = గౌరవింపబడినవి, త్వత్ = అంఘ్రి = నీ పాదములనెడి, రాజీవ = పద్మములయొక్క, రజఃకణానాం = పరాగకణములయొక్క, భూయాన్ = గొప్పదైన, ప్రసాదః = అనుగ్రహము, మయి = నాయందు, భూయాత్ = కలుగుగాక !

పూర్వశ్లోకమున ప్రణామముల అభివృద్ధిని ప్రార్థించిన కవి ఇందు తాము నమస్కరించు భగవత్పాదారవిందపరాగముయొక్క అనుగ్రహమును ప్రార్థించుచున్నారు. లేక, భగవానుడు కవిని చూచి "ఓయీ ! నీ అపేక్షితమును తెలుపుము" అనగా అందులకు "స్వామీ! నీ శ్రీపాదరేణువులను అనుగ్రహింపుము" అనుచున్నారనియు చెప్పవచ్చును -అని మణిప్రవాళవ్యాఖ్య. లేక, భగవన్నమనము నకు ప్రతిబంధకమైన లలాటలిపిని తుడిచివేయుమని స్వామిని ప్రార్థించు చున్నారనియు చెప్పవచ్చును.

స్వామీ ! బ్రహ్మచే నుదుటిపై వ్రాయబడిన వ్రాతను సైతము మార్చునవి, బ్రహ్మ, ఇంద్రుడు మొదలగువారి శిరస్సులచే దాల్చబడునవి అగు నీ పాదారవింద రజఃకణములయొక్క పరమానుగ్రహము నాకు లభించునుగాక !

20. పరిస్ఫురన్ నూపురచిత్రభాను-
ప్రకాశనిర్ధూతతమోఽనుషంగామ్ ।
పదద్వయీం తే పరిచిన్మహేఽంతః
ప్రబోధరాజీవవిభాతసంధ్యామ్ ॥



పరిస్ఫురత్ = అంతటప్రకాశించు, నూపుర = మణిమంజీరములనెడి, చిత్రభాను =సూర్యునియొక్క, ప్రకాశ = వెలుగుచే, నిర్ధూత = పోగొట్టబడిన, తమోఽనుషంగాం = చీకటి సంబంధమును కల్గినది, ప్రబోధ = జ్ఞానమనెడి, రాజీవ = పద్మమునకు, విభాతసంధ్యాం = వికసింపచేయు ప్రాతఃసంధ్యయు అగు, తే = నీయొక్క, పదద్వయీం = పదద్వంద్వమును, అంతః = మనస్సులో, పరిచిన్మహే = ధ్యానింతుము.

అజ్ఞానాంధకారమును తొలగించునది, జ్ఞానోదయమును కల్గించునది అగు నీ పాదద్వంద్వమును ధ్యానింతును - అని ఇందు కవి పల్కుచున్నారు. పూర్వశ్లోకమున కవి భగవానుని పాదధూళిని శిరోభూషణముగా అపేక్షించిరి. భగవానుడును పరమకృపతో అట్లే అనుగ్రహింపగా, పరమానందమును పొందిన కవి, ఆ పాదధూళికి ఆశ్రయమగు పాదారవిందములను స్తుతించుద్వారా వానిపట్ల తమ కృతజ్ఞతను తెలుపుకొనుచున్నారనియు చెప్పవచ్చును.

అంతటను ప్రకాశించు మణిమంజీరము లనెడి సూర్యునిచే దూరము చేయబడిన చీకటిని -అనగా -అజ్ఞానమనెడి చీకటిని కల్గినది, జ్ఞానమనెడి పద్మములకు ప్రాతఃసంధ్యవంటిది అగు నీ పదద్వంద్వమును నా మనస్సున ధ్యానింతును.

21. త్వత్కింకరాలంకరణోచితానాం
త్వయైవ కల్పాంతరపాలితానామ్ ।
మంజుప్రణాదం మణినూపురం తే
మంజూషికాం వేదగిరాం ప్రతీమః ॥

మంజుప్రణాదం = మనోహరమైన ధ్వనిని కల్గినది (చేయునది) అగు, తే = నీయొక్క, మణినూపురం = మణిమయమైన పాదకటకమును, త్వత్ = నీయొక్క, కింకర = సేవకులయొక్క, (భక్తులయొక్క), అలంకరణ = అలంకారమునందు, ఉచితానాం = తగినవి, త్వయా + ఏవ = నీచేతనే, కల్ప+ అంతర = వేర్వేరు కల్పములలో (సమయములలో), పాలితానాం = రక్షింపబడినవి అగు, వేదగిరాం = వేదవాక్కులయొక్క, మంజూషికాం =భద్రపఱచు పెట్టెగా, ప్రతీమః = తెలిసికొందుము.

పూర్వశ్లోకమున భగవానుని మంజీరముల ప్రస్తావనకు రాగా, ఇందు ఆ మంజీరమును కవి అభివర్ణించుచున్నారు.

నీ భక్తులకు తగిన అలంకారముల వంటివియు, నీచేతనే వేర్వేరు కల్పములలో హయగ్రీవరూపమున (హంసరూపమున) రక్షింపబడినవి అగు వేదములను దాచు రత్నపేటికగా మనోహరముగా ధ్వనించు నీ మణిమంజీర మును భావింతును -అని భావము.

**22. సంచింతయామి ప్రతిభాదశాస్థాన్**
**సంధుక్షయంతం సమయప్రదీపాన్।**
**విజ్ఞానకల్పద్రుమపల్లవాభం**
**వ్యాఖ్యానముద్రామధురం కరం తే ॥**

విజ్ఞాన = విజ్ఞానమను, కల్పద్రుమ = కల్పవృక్షముయొక్క, పల్లవ+ ఆభం= చిగురుయొక్క కాంతివంటి కాంతిని కల్గినది. (చిగురుతో పోలినది), వ్యాఖ్యానముద్రామధురం =వ్యాఖ్యానముద్రచే మనోహరమైనది అగు, తే = నీయొక్క, కరం, చేతిని, ప్రతిభా = మేథ అను దశాస్థాన్ = వత్తియందు కల, సమయ = సిద్ధాంతము అను, ప్రదీపాన్ = గొప్ప దీపములను, సంధుక్షయంతం= పెంపొందించునదిగా, (వెలుగునట్లు చేయునదిగా) సంచింతయామి = భావించుచున్నాను.

పూర్వశ్లోకమున తెలిపిన విధముగా కవి తన ఆభరణముల శోభయందు ఆసక్తులగుటను గమనించిన హయగ్రీవస్వామి, "ఓయీ ! ఈ ఆభరణముల శోభనే కాక, నా దివ్యాంగముల సొబగును దర్శింపుము'' అని సేవను అనుగ్రహింపగా, భగవానుని దివ్యరూపమును దర్శించి సంతుష్టులైన కవి, వ్యాఖ్యానముద్రతో అందమైన భగవానుని దక్షిణకరమును వర్ణించుట ఇందలి విషయము. వరుసగా మూడు శ్లోకములలో శ్రీహయగ్రీవస్వామియొక్క కరవర్ణము చేయబడుచున్నది.

విజ్ఞానమను కల్పవృక్షముయొక్క చిగురువలె ఉన్నది. వ్యాఖ్యానముద్రచే మనోహరమైనది అగు నీ కరమును ప్రతిభ అను వత్తిచివర వెలుగు సిద్ధాంతదీపము లను ప్రజ్వరిల్లచేయుదానినిగా భావింతును- అని భావము.



**23. చిత్తే కరోమి స్ఫురితాక్షమాలం**
**సవ్యేతరం నాథ ! కరం త్వదీయమ్ ।**
**జ్ఞానామృతోదంచనలాలసానాం (లంపటానాం)**
**లీలాఘటీయంత్ర మివాఽఽశ్రితానామ్ ॥**

నాథ = స్వామీ !, స్ఫురిత+అక్షమాలం = ప్రకాశించు జపమాలను కల, త్వదీయం = నీకు చెందిన, సవ్య+ ఇతరం కరం = దక్షిణహస్తమును, జ్ఞాన+అమృత = జ్ఞానము అను అమృతముయొక్క, ఉదంచన = పైకి తెచ్చుటయందు (ఉద్ధరణమందు), లాలసానాం (లంపటానాం) = ఆసక్తిని కల, ఆశ్రితానాం =భక్తులకు, లీలాఘటీయంత్రం +ఇవ = లీలార్థమైన ఘటీయంత్రమునువలె (ఏతామువలె), చిత్తే = (నా) మనస్సున, కరోమి = చేయుదును. (నిలుపుకొందునని భావము).

అక్షమాలను ధరించియున్న శ్రీహయగ్రీవ భగవానుని దక్షిణహస్తమును కవి ఇందు వర్ణించుచున్నారు.

స్వామీ ! ప్రకాశించు జపమాలను ధరించియున్న నీ దక్షిణహస్తమును జ్ఞానమును అమృతమును పైకి తెచ్చుటలో మిక్కిలి ఆసక్తిని కల్గిన నీ భక్తులకు ఉపయోగించు సులభమైన ఘటీయంత్రమును (ఏతామువలె) నా మనస్సున భావించుచున్నాను.

**24. ప్రబోధసింధో రరుణప్రకాశైః**
**ప్రవాళసంఘాత మివోద్వహంతమ్ ।**
**విభావయే దేవ ! సపుస్తకం తే**
**వామం కరం దక్షిణ మాశ్రితానామ్ ॥**

దేవ = స్వామీ !, సపుస్తకం = పుస్తకముతో కూడినది, ఆశ్రితానాం = భక్తులకు, దక్షిణం = జ్ఞానమును అనుగ్రహించుటలో సమర్థమైనదగు, (ఉదారమైనదగు), తే = నీయొక్క, వామం = ఎడమ, కరం = చేతిని, అరుణైః= ఎఱ్ఱని, ప్రకాశైః = కాంతుల కారణముచే, ప్రబోధ సింధోః = జ్ఞానమను

సముద్రములోని, ప్రవాళసంఘాతం = పగడపు సమూహమును, ఉద్వహంతమ్ ఇవ = ధరించుచున్నదానివలె, విభావయే = భావింతును.

ఇందు పుస్తకమును ధరించియున్న హయగ్రీవస్వామి ఎడమ చేయి వర్ణింపబడుచున్నది.

స్వామీ ! పుస్తకమును కల్గినది, భక్తులను రక్షించుటలో సమర్థమైనది అగు నీయొక్క ఎడమ చేయి ఎఱ్ఱని కాంతులను కల్గియుండుటచే, దానిని జ్ఞాన సముద్రమునుండి పైకి తీయబడిన పగడపు సమూహమును ధరించియున్నట్లు భావింతును.

**25. తమాంసి భిత్త్వా విశదై ర్మయూఖైః (ప్రకాశైః)**
**సంప్రీణయంతం విదుష శ్చకోరాన్ ।**
**(నిశామయే) విభావయే త్వాం నవపుండరీకే**
**శరద్ఘనే చంద్ర మివ స్ఫురంతమ్ ॥**

విశదైః = స్వచ్ఛమైన, మయూఖైః = కిరణములచే, తమాంసి = చీకట్లను, భిత్త్వా = భేదించి, విదుషః = విద్వాంసులు అను, చకోరాన్ = చోకరపక్షులను, సంప్రీణయంతం = (ఆ కిరణములతో) ఆనందపఱచునట్టి, నవపుండరీకే = నూతనమైన తెల్లతామరలో, స్ఫురంతం = ప్రకాశించునట్టి, త్వాం = నిన్ను, శరద్ఘనే= శరత్కాలములోని తెల్లని మేఘముపై గల, చంద్రమ్ ఇవ = చంద్రునివలె, విభావయే = భావింతును.

ఇంతవరకును హయగ్రీవభగవానుని యొక్క అవయవశోభను వర్ణించిన కవి. ఇకపై ఆస్వామి దివ్యమంగళవిగ్రహ శోభను వర్ణించుచున్నారు. సౌందర్యవర్ణనకు పిమ్మట లావణ్యావర్ణను చేయుచున్నారని తాత్పర్యము. లావణ్యమనగా సముదాయ శోభ. సౌందర్యమనగా ప్రత్యవయవ శోభ.

తన తెల్లని కాంతులతో చీకట్లను పారద్రోలి, జ్ఞానులు అను చకోరపక్షులను తృప్తిపఱచునది, అప్పుడే వికసించిన తామరపూవులో ప్రకాశించునది అగు నీ రూపమును, తెల్లని శరత్కాలమేఘముపై ప్రకాశించు చంద్రునిగా భావింతును.



**26. దిశంతు మే దేవ ! సదా త్వదీయాః**
**దయాతరంగానుచరాః కటాక్షాః ।**
**శ్రోత్రేషు పుంసా మమృతం క్షరంతీం**
**సరస్వతీం సంశ్రితకామధేనుమ్ ॥**

దేవ= స్వామీ !, దయాతరంగ +అనుచరాః = దయా (ప్రవాహ) కెరటములను అనుసరించునవి(దయ అను నదియొక్క కెరటములవంటివి), అగు, త్వదీయాః = నీకు సంబంధించిన, కటాక్షాః = కడగంటిచూపులు, పుంసాం = జనులయక్క, శ్రోత్రేషు = చెవులయందు, అమృతం = సుధను, క్షరంతీం = స్రవించునది, సంశ్రితకామధేనుం = భక్తులకు (స్తోత్రములను పఠించువారికి) అభీష్టప్రదమైనది అగు, సరస్వతీం = కవిత్వసంపదను, సదా = ఎల్లప్పుడు, మే= నాకు, దిశంతు = ఇచ్చునుగాక !

శ్రీహయగ్రీవభగవానుని దేశికులు తమకు గొప్ప కవిత్వశక్తిని ప్రసాదింపుమని ఇందు ప్రార్థించుచున్నారు. ఈ శ్లోకమునకు ముందు రెండు శ్లోకములలో కవి **"విభావయే"** అనుచు శ్రీహయగ్రీవమూర్తిని ధ్యానించిరి. అందులకు భగవానుడు "ఓయీ ! నీవు నా రూపమును ధ్యానించితివి కదా ! నన్ను నోరార కీర్తింపుము'' అనగా, అందులకు "స్వామీ ! నాకు అట్టి స్తుతించు శక్తిని నీవే ప్రసాదింపుము'' అని అనుచున్నారనియు చెప్పవచ్చును- అని మణిప్రవాళ వ్యాఖ్య.

స్వామీ ! దయానదీతరంగములకు సహచరములు (పోలినవి) అగు నీకడగంటి చూపులు శ్రోతల చెవులలో అమృతమును ఒలికించునది, పఠించిన వినిన వారికి అభీష్టసిద్ధిని కల్గించునది అగు గొప్ప వాక్శక్తిని నాకు అనుగ్రహింపవలయును- అని భావము.

**27. విశేషవిత్పారిషదేషు నాథ !**
**విదగ్ధగోష్ఠీసమరాంగణేషు ।**
**జిగీషతో మే కవితార్కికేంద్రాన్**
**జిహ్వాగ్రసింహాసన మభ్యుపేయాః ॥**

నాథ= స్వామీ !, విశేషవిత్ = సర్వశాస్త్రములలోని విశేషములను తెలిసిన, వారియొక్క, గోష్ఠీ = సభ అను, సమరాంగణేషు = (వాదమను) యుద్ధస్థానము

లలో, కవితార్కికేంద్రాన్ = గొప్ప కవులను, తార్కికులను, జిగీషతః = జయింప గోరు, మే = నాయొక్క, జిహ్వా +అగ్ర= నాలుక చివర అను, సింహాసనం = ఇంద్రపీఠమును, అభి+ ఉపేయాః = అధిష్ఠింతువు గాక !

కవి ఇందు వాదసమయములలో ప్రతివాదులను ఓడించుటకు భగవానుని సాన్నిధ్యమును ప్రార్థించుచున్నారు. పూర్వశ్లోకమున తమకు గొప్ప కవనశక్తిని అనుగ్రహింపుమని ప్రార్థించిన కవిని చూచి భగవానుడు "ఓయీ ! అట్లే కానిమ్ము ! నీకు అట్టి శక్తిని అనుగ్రహించితిని'' అనగానే, అందులకు కవి సమాధానమును ఈ శ్లోకమున పల్కుచున్నారు.

"స్వామీ ! అది చాలదు; **"ఆముదల్వనివన్"** అను పాశురములోవలె ఆళ్వార్ల జిహ్వాగ్రమున అధివసించి, తిరువాయ్మొళ్ళి ప్రబంధమును వారిచే పాడించిన విధముగా, నీవు నా జిహ్వాగ్రమున నిలచి, స్తోత్రమును రచింపజేసి, కవితార్కికులను జయింపగోరు నా జిహ్వాగ్ర మను సింహాసనమును అధిరోహించి, నన్ను అనుగ్రహించి, వారిని జయించునట్లు చేయుము.

**28. త్వాం చింతయన్ త్వన్మయతాం ప్రపన్నః**
**త్వాముద్గృణన్ శబ్దమయేన ధామ్నా ।**
**స్వామిన్ ! సమాజేషు సమేధిషీయ**
**స్వచ్ఛందవాదాహవబద్ధశూరః ॥**

స్వామిన్ = స్వామీ !, సమాజేషు = విద్వాంసుల సభలలో, త్వాం = నిన్ను, చింతయన్ = ధ్యానించు, త్వత్ + మయతాం = నీరూపమును, ప్రపన్నః = పొందినవాడనై, శబ్దమయేన = శబ్దరూపమగు, ధామ్నా = తేజస్సుతో (శరీరముతో), త్వాం = నిన్ను, ఉద్గృణన్ = స్తుతించుచు, స్వచ్ఛంద = సర్వతోముఖమైన, వాద+అహవే = వాదయుద్ధమున, బద్ధ = బంధింపబడిన, శూరః = ప్రతివాదులను కల్గినవాడనై, సమేధిషీయ = వృద్ధిని పొందును గాక !

భగవానుని సాన్నిధ్యవశముచే ప్రతివాదులను ఓడింతుననుట ఇందలి సారము. తమ జిహ్వాగ్రమున అధిష్ఠించి, పరమతనిరసనమును చేయునట్లు తమను అనుగ్రహింపవలసినదిగా పూర్వశ్లోకమున ప్రార్థించిన కవిని చూచి భగవానుడు "ఓయీ ! నీవు కోరినట్లే చేయుదును. కాని, మఱి నీవు పొందు



లాభ మేమి ?'' అని ప్రశ్నింపగా, అందులకు దేశికులు "స్వామీ ! నా నాలుకతోనే స్తుతించుటచే **"నణ్ణి త్తెన్కురుకూర్ నమ్బి ఎన్టక్కాల్ అణ్ణిక్కుమ్ అముదూఱుమ్ ఎన్నావుక్కే"** అనునట్లు నేను స్తుతి చేసినట్లును అగును. నాకును కొంత ఆనందము కల్గును. మఱియు నన్ను సాధనముగా గొని పరమతనిరసనముతో కూడిన స్వమతస్థాపనము చేయుటకే కదా దాసుడనగు నన్ను నీవు సృజించినది. ఈ సందర్భమున ప్రధానఫలమును పొందువాడవు నీవే అయినను, నేను నీ క్రీడాపరికరమే అయినను, **"రమమాణా వనే త్రయః"** అనునట్లు **"అహమన్న మదంత మద్మి"** అనునట్లును అప్రధానమైన ఫలితము నాకును కల్గును- అని పల్కుచున్నారని మణిప్రవాళవ్యాఖ్యలో తెలుపబడినది.

స్వామీ! నిన్ను నిరంతరము చిరకాలము ధ్యానించుచు, తత్ఫలితముగా నీ సారూప్యమును పొంది, వాగ్రూపమున నిన్ను స్తుతించుచు, సభలలో సర్వశాస్త్ర నిష్ణాతులైన ప్రతివాదులను, శూరులను వాదయుద్ధమున ఓడించినవాడనై, కీర్తిని పొందెదను.

**29. నానావిధానా మగతిః కలానాం**
**న చాపి తీర్థేషు కృతావతారః ।**
**ధ్రువం తవానాథపరిగ్రహాయాః**
**నవం నవం పాత్ర మహం దయాయాః ॥**

నానావిధానాం = అనేకవిధములైన, కలానాం = విద్యలకు, అగతిః= స్థానము కానివాడను (నేర్వనివాడను), తీర్థేషు = పుణ్యతీర్థములయందు, (గురువుల సన్నిధిలో), కృత+అవతారః + న = స్నానమాడని వాడను కాదు (సేవించినవాడను కాదు), (కావున, అహం =నేను) అనాథపరిగ్రహాయాః = అనాథులను పరిగ్రహించునట్టి (రక్షించునట్టి), తవ = నీయొక్క, దయాయాః = కరుణకు, నవం నవం = మిక్కిలి నూతనమైన, పాత్రం = విషయమును అయితిని, ధ్రువం= నిజము.

ఇంతవఱకు శ్రీహయగ్రీవస్వామివలన సకలాభీష్టములను ప్రార్థించిన కవి, ఇందు ఆ స్వామి నిర్హేతుకకరుణ తమపై ప్రసరించుటకై తమ యొక్క అనన్యగతికత్వమును అనుసంధించుచున్నారు. ఇట్లు అనుసంధించుట ప్రపన్నుని

స్వరూపము. "నోఱ్ఱ నోన్బిలేన్, నుణ్ణరివిలేన్" అని ఆఴ్వార్లు, "అఱివొన్ఱుమిల్లాద" అని ఆణ్డాళ్, "న ధర్మనిష్ఠోఽస్మి న చాత్మవేదీ న భక్తిమాన్ త్వచ్చరణారవిందే" అని శ్రీయామునులు, ఇదే విధముగా కూరేశులు, భట్టరు మొదలగు పూర్వాచార్యులందఱు స్వరూపప్రకాశమగు అనన్యగతికత్వమును ప్రకటించిరి. దేశికులును ఆ పద్ధతిని ఇందు అనుసరించిరి. లేక, భగవానుడు కవిని చూచి, "ఓయీ! నీవు పల్కినట్లే అన్నియు చేయుదుము, కాని నీ ప్రయత్నము కొంచమైనను కావలయును కదా !" అని పల్కగా అందులకు కవి ఇందు సమాధానమును పల్కుచున్నారనియు చెప్పనగును. లేక, రక్షణదీక్షను వహించిన స్వామికి తనకంటె రక్షణీయుడు వేఱొకడు లేడని పల్కుచున్నారనియు చెప్పవచ్చును. ఇదే భావమును దేశికులు దేవనాయకపంచాశత్ స్తోత్రమున "కిం నామ పాత్ర మపరం మను తే కృపాయాః" అనుచు ప్రకటించుట ఇచట గుర్తింపదగినది.

30. అకంపనీయాన్యపనీతిభేదై
రలంకృషీరన్ హృదయం మదీయమ్ ।
శంకాకలంకాపగమోజ్జ్వలాని
తత్త్వాని సమ్యంచి తవ ప్రసాదాత్ ॥

అపనీతిభేదైః = పలు అపన్యాయములచేకూడ, అకంపనీయాని = అవిచాల్యములైనవి, శంకాకలంక +అపగ+ ఉజ్జ్వలాని= సంశయమనెడి దోషములను తొలగించుటచే మిక్కిలి ప్రకాశించునవి, సమ్యంచి = యథార్థములైనవి అగు, తత్త్వాని = చిదచిదీశ్వరములను తత్త్వత్రయములు, మదీయం = నాయొక్క, హృదయం = హృదయమును, తవ = నీయొక్క, ప్రసాదాత్ = అనుగ్రహమువలన, అలంకృషీరన్ = అలంకరించును గాక !

అనన్యశరణ్యుడవగు నీ అనుగ్రహమువలన సమస్తతత్త్వములు నా మనస్సున స్ఫుటముగా ప్రకాశించుచున్నవి- అని అనుచున్నారు.

ఎట్టి కుతర్కములచే అయినను చలింప సాధ్యము కానివి, సంశయ విపర్యయాది దోషములు అన్నియు పోవుటచే మిక్కిలి స్పష్టముగా ప్రకాశించునవి అగు తత్త్వములు నీ అనుగ్రహవిశేషమువలన నా మనస్సును అలంకరించునుగాక!



"తత్త్వాని" అనుటకు తత్త్వత్రయమని కాని, మహదహంకారాది ఇరువది నాల్గు తత్త్వములని కాని చెప్పవచ్చును. ఈ శ్లోకమున తత్త్వార్థములు కుతర్కము లచే చలింప వీలు కానట్లు, ఎట్టి సంశయవిపర్యయాది దోషములు లేకుండునట్లు ఉండవలెనను విషయము తెలుపబడినది.

31. వ్యాఖ్యాముద్రాం కరసరసిజైః పుస్తకం శంఖచక్రే
బిభ్రద్భిన్నే స్ఫటికరుచిరే పుండరీకే నిషణ్ణః ।
అమ్లానశ్రీ రమృతవిశదై రంశుభి ప్లావయ న్మాం
ఆవిర్భూయా దనఘమహిమా మానసే వాగధీశః ॥

కరసరసిజైః = పద్మములవంటి నాల్గు హస్తములచే, వ్యాఖ్యాముద్రాం = ఉపదేశముద్రను, పుస్తకం = పుస్తకమును, శంఖచక్రే = శంఖమును, చక్రమును, బిభ్రత్ = ధరించుచు, భిన్నస్ఫటిక = ఛేదింపబడిన (భిన్నమైన) స్ఫటికమణివలె, రుచిరే = మనోహరమైన, తెల్లని, పుండరీకే = తెల్ల తామరయందు, నిషణ్ణః = ఆసీనుడై, అమ్లానశ్రీః = వాడని కాంతిని (నూతనమైన కాంతిని) కల్గిన, అనఘమహిమా = దోషము లేని గొప్పతనమును కల్గిన, వాక్+ అధీశః = వాక్కులకు ప్రభువగు హయగ్రీవమూర్తి, అమృతవిశదైః = అమృతమువలె తెల్లని, అంశుభిః = కాంతులతో, మాం = నన్ను, ప్లావయన్= తడపుచు, మానసే = (నా) మనస్సున, ఆవిర్భూయాత్ = ప్రకాశించును గాక !

ఈ శ్లోకమున కవి శ్రీహయగ్రీవమూర్తియొక్క అసాధారణస్వరూపమును ధ్యానించుచున్నారు.

పద్మములవంటి నాల్గు చేతులయందు వ్యాఖ్యానముద్రను, పుస్తకమును, శంఖచక్రములను దాల్చిన, స్ఫటికప్రాంతభాగమువలె అందమైన, తెల్లని పుండరీకమున ఆసీనులైయున్న, వన్నె తగ్గని శోభను కల్గిన దోషము లేని మహిమను కల వాగధీశ్వరుడు (శ్రీహయగ్రీవస్వామి) తన తెల్లని, నిరవధికములైన కాంతులతో సంసారమున తాపమును పొందిన నన్ను సేదదీర్చుచు నా మనస్సున ప్రత్యక్షమగు గాక !

32. వాగర్థసిద్ధిహేతోః పఠత హయగ్రీవసంస్తుతిం భక్త్యా ।
కవితార్కికకేసరిణా వేంకటనాథేన విరచితా మేతామ్ ॥

కవితార్కికకేసరిణా = 'కవితార్కికకేసరి' అని బిరుదును కల, వేంకట నాథేన = వేంకటనాథకవిచే, విరచితాం = రచింపబడిన, ఏతాం = ఈ, హయగ్రీవ సంస్తుతిం = హయగ్రీవస్తోత్రమును, వాక్ + అర్థసిద్ధిహేతోః = శబ్దార్థముల సిద్ధిని పొందుటకై, భక్త్యా = భక్తితో, పఠత = పఠింపుడు.

స్తోత్రము చివర కవి తన నామమును కూర్చుట ఆ స్తోత్రముయొక్క విశ్వసనీయతను తెలుపును. మఱియు, **"ప్రయోజన మనుద్దిశ్య న మందోఽపి ప్రవర్తతే"** అను లౌకికన్యాయము చొప్పున తమ స్తోత్రమును చదివినవారికి కల్గు ఫలితమును తెలుపవలయును. ఈ రెండు అంశములను దేశికులు ఈ చివరి శ్లోకమున తెలియజేయుచున్నారు.

హయగ్రీవభగవానుని స్తోత్రమును ఈ విధముగా పూర్తిచేసిన కవి, ఎంతయో శ్రమపడి తాము పొందిన ఫలమును మిగిలినవారు ఎట్టి శ్రమ లేకుండ పొందవలెనను ఔదార్యముతో, **"తొణ్డీర్ ఎల్లీరుమ్ వారీర్, తొ*ழு*దు తొ*ழு*దు నిన్హార్త్తుమ్"** అనునట్లు భక్తులనందఱును పిలచి, ఈ స్తోత్రమును పఠించిన మాత్రముననే తాము పొందినవారును ఫలమును పొందెదరని ఉపదేశించు చున్నారని మణిప్రవాళవ్యాఖ్యాత వివరించెను.

ఓ భక్తులారా! కవితార్కిక కేసరి అను పేరును కల వేంకటనాథకవిచే చక్కగా రచింపబడిన ఈ హయగ్రీవస్తోత్రమును భక్తిశ్రద్ధలతో పఠింపుడు. మీకు వాగర్థసిద్ధి కలుగగలదు - అని భావము. **"కవితార్కికకేసరిణా వేంకటనాథేన విరచితామ్"** అనుటచే స్తోత్రముయొక్క విశ్వసనీయత, **"వాగర్థసిద్ధిహేతోః"** అనుటచే స్తోత్రపఠనప్రయోజనమును సూచింపబడినవి. కవి తమను ప్రథమ పురుషలో నిర్దేశించుకొనుట కవియొక్క వినయమును తెలుపుచున్నది. **"వాగర్థసిద్ధిహేతుమ్"** అను పాఠాంతరమును సంస్తుతికి విశేషణముగా అన్వయింప నగును. ఇచట వాగర్థములనగా లక్ష్మీనారాయణులే -అని కవి అభిప్రాయము. విష్ణుపురాణమున శ్రీపరాశరభగవానులు **"నిత్యైవైషా జగన్మాతా విష్ణోః**



**శ్రీరనపాయినీ,... తథైవేయం ద్విజోత్తమ, అర్థో విష్ణు రియం వాణీ నీతి రేషా నయో హరిః"** అనుచు జగన్మాత అగు లక్ష్మీదేవి ఎల్లప్పుడు భగవానుని వెంటనుండు నని, విష్ణువువలె ఆమెయు సర్వగత అని, విష్ణువు అర్థము కాగా ఈమె వాక్కు అని, అతడు నయము, ఈమె నీతి అని తెలిపిరి. ఈ విధముగా వాగర్థముల ప్రతిరూపములగు లక్ష్మీనారాయణులు ఈ శ్లోకమున ప్రస్తుతింపబడిరి. కావున ఈ స్తుతిలో లక్ష్మీహయగ్రీవతత్త్వము ప్రతిపాదితమని పెద్దల అభిప్రాయము.



## శ్రీవేదాంత దేశికులు రచించిన

# శ్రీసుదర్శనాష్టకము

**శ్రీమాన్ వేంకటనాథార్యః కవితార్కిక కేసరీ ।**
**వేదాంతాచార్యవర్యో మే సన్నిధత్తాం సదా హృది ॥**

వేదాంతదేశికులు శతాధికగ్రంథకర్తలుగా, శ్రీవేంకటేశ ఘంటావతారులుగా, సర్వతంత్రులుగా, కవితార్కికకేసరిగా ప్రసిద్ధి నొందిన ఆచార్యవర్యులు. వీరి ప్రతిభ అసాధారణము, అనుపమేయము. ఈ మహనీయులు రచించిన పలు స్తోత్రములలో సుదర్శనాష్టకమొకటి. ఇది సుదర్శనమను పేరు కల్గిన భగవానుని ఆయుధరాజమును స్తుతించు గొప్ప స్తుతి. ఈ స్తుతి అసేతుహిమాచలము నిత్యానుసంధేయమై, భగవద్భక్తులకు సర్వాభీష్టప్రదమై అలరారుచున్నది.

ఈ స్తుతిని కవి రచించుటకు గల కారణములను వ్యాఖ్యాతలు రెండు విధములుగ వివరించిరి. పూర్వము ఒకానొక సమయమున గృధ్రసరస్తీరమున (తిరుపుళ్ కుழி అను దివ్యదేశమున) నివసించు భగవద్భక్తులకు శీతజ్వరబాధ కలుగగా, దేశికులు తన్నివారణార్థమై ఈ కృతిని రచించిరని- సంస్కృతవ్యాఖ్యాత తెలిపెను. "**శ్రీమత్ గృధ్రసరస్తటావనిజుషాం శ్రీవైష్ణవానాం పురా యశ్శీతజ్వర నుత్తయే వ్యతనుత శ్రీహేతిరాజాష్టకమ్**" అని ప్రస్తుత వ్యాఖ్యానకర్త షోడశాయుధ స్తోత్రవ్యాఖ్యాన ప్రారంభమున పల్కుట స్మరింపనగును. ద్రావిడ వ్యాఖ్యాత వేఱు కారణమును చూపెను. ఒకానొక సమయమున దేశికులు తిరువహీంద్రపురమున నివసించునపుడు వేదబాహ్య, కుదృష్టి సిద్ధాంతములను ఖండించుచు, పరమత భంగమును ఒక ప్రౌఢమైన శాస్త్రగ్రంథమును రచింపవలెనను అభిప్రాయ పడిరి. అట్టి మహత్కార్యము శ్రీసుదర్శనుల అనుగ్రహమువలననే సిద్ధించునని తలచిన దేశికులు తమకు ఉపాస్యులును, సకలఫలప్రదులగు శ్రీసుదర్శన భగవానుని ప్రస్తుతించుచు ప్రస్తుత స్తోత్రమును రచించిరి. పిమ్మట ఈ స్తోత్రమునకు సంగ్రహరూపముగా "**ఎణ్డల వమ్బుయత్తుళ్**" అను పాశురమును అనుగ్రహించిరి. పరమతభంగమును నిర్విఘ్నముగా పూర్తిచేసిన పిదప శ్రీసుదర్శనులపట్ల కృతజ్ఞతా సూచకముగా "**షోడశాయుధస్తోత్రమ**"ను వేఱొక సుదర్శనస్తుతి రూపమైన కృతిని



రచించి, దానికి సంగ్రహరూపముగా, "**తికిరి ముழு**" అను పాశురమును రచించిరి. కావున శ్రీసుదర్శనాష్టకము, శ్రీషోడశా యుధస్తోత్రమును ప్రత్యేకస్తోత్రములుగా పరిగణింపబడుచున్నవి.

---

1. **ప్రతిభటశ్రేణిభీషణ ! వరగుణస్తోమభూషణ !**
**జనిభయస్థానతారణ ! జగదవస్థానకారణ ।**
**నిఖిలదుష్కర్మకర్శన ! నిఖిలసద్ధర్మదర్శన !**
**జయ ! జయ ! శ్రీసుదర్శన ! జయ ! జయ ! శ్రీసుదర్శన ! ॥**

ప్రతిభట = ప్రత్యర్థిభటుల, శ్రేణి = వరుసలకు (సమూహమునకు), భీషణ= భయంకరుడా, (భయమును కల్గించు నాదములను కల్గినవాడా !), వరగుణస్తోమ= శ్రేష్ఠములైన గుణముల సమూహమును, భూషణ = అలంకారముగా కల్గినవాడా!, జనిభయస్థాన = జన్మము అను భయమునకు స్థానమగు సంసారమునుండి, తారణ = దాటించువాడా!, జగదవస్థాన = లోకముల స్థితికి, కారణ = కారణమగు వాడా!, నిఖిలదుష్కర్మ = సమస్తపాపము లను, కర్శన =పోగొట్టువాడా, (నిగమ) నిఖిలసద్ధర్మ = (వేదములందు చెప్పబడిన) సకలములైన, గొప్ప ధర్మములను, దర్శన = దర్శింపచేయువాడా, శ్రీసుదర్శన = ఓ సుదర్శనమా, జయ జయ = విజయీ భవ, విజయీ భవ, శ్రీసుదర్శన జయ జయ =ఓ సుదర్శనమా! విజయీ భవ, విజయీ భవ.

"యస్య నాదేన దైత్యానామ్", "స ఘోషో ధార్తరాష్ట్రాణామ్" అనునట్లు ప్రత్యర్థులను తన ధ్వనితో బలహీనులను చేసి, వారి గుండెలను బ్రద్దలు చేయువాడవు, "**సమస్తకల్యాణగుణాత్మకోఽసౌ**" అనునట్లు సమస్తకల్యాణ గుణము లను సహజముగా కల్గినవాడవు, "**తేషా మహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్**" అనునట్లు సంసారసాగరమునుండి భక్తులను తీరమునకు చేర్చువాడవు, "**స్వాధీనత్రివిధచేతనాచేతనస్వరూపప్రవృత్తిభేదః**" అనునట్లు సంసారుల స్థితి ప్రవృత్త్యాదులకు కారణమగువాడవు, "**సర్వపాపేభ్యో మోక్షయిష్యామి**" అనునట్లు సమస్తపాపములను నశింపచేయువాడవు, "**శంఖప్రాంతేన పస్పర్శ బాలమ్**" అనునట్లు ఆశ్రితులకు (ధ్రువాదులకు) జ్ఞానమును కల్గించువాడవు, భక్తులకు

జయమును కల్గించునదిగా మంత్రశాస్త్రమున కీర్తింపబడినవాడవు, విజయలక్ష్మీ కటాక్షమునకు లక్ష్యమైనవాడవు అగు ఓ శ్రీసుదర్శనమా ! విజయీ భవ, విజయీ భవ.

2. **శుభజగజ్రూపమండన ! సురజనత్రాసఖండన !**
**శతమఖబ్రహ్మవందిత ! శతపథబ్రహ్మనందిత !।**
**ప్రథితవిద్వత్సపక్షిత ! భజదహిర్బుధ్న్యలక్షిత !**
**జయ ! జయ ! శ్రీసుదర్శన ! జయ ! జయ ! శ్రీసుదర్శన ! ॥**

శుభ = శుభాశ్రయమగు, జగద్రూప = భగవానుని విరాడ్రూపమునకు, మండన = అలంకారమైనవాడా!, సురజన= దేవజనులకు, త్రాస = (అసురులవలన కల్గు) భయమును, ఖండన = నశింపచేయువాడా !, శతమఖ = ఇంద్రుడు, బ్రహ్మ = బ్రహ్మయు అను వీరిచే, వందిత = నమస్కరింప బడినవాడా !, శతపథబ్రహ్మ = శతోపనిషత్తులచే, నందిత = కీర్తింపబడినవాడా !, ప్రథిత = ప్రసిద్ధులగు, విద్వత్ = పండితులచే, సపక్షిత = తమ పక్షమునకు చెందినవానినిగా చేసికొనబడినవాడా !, భజత్ = తనను భజించు, అహిర్బుధ్న్య = అహిర్బుధ్న్యుడని పాంచరాత్రమున చెప్పబడిన రుద్రునిచే, లక్షిత = లక్షింపబడినవాడా ! (తెలిసికొన బడిన మహిమను కలవాడా!), శ్రీసుదర్శన జయ జయ = ఓ సుదర్శనచక్రమా ! సర్వోత్కర్షతో వెలుగొందుము, శ్రీసుదర్శన జయ జయ = ఓ సుదర్శన చక్రమా! సర్వోత్కర్షతో విలసిల్లుము.

ఈ శ్లోకమున గల **"సురజనత్రాసఖండన", "శుభజగద్రూపమండన"** ఇత్యాది విశేషణముల అర్థస్వారస్యమునుబట్టి శ్రీదేశికులు పాశురమున **"తికిరి"** అని కీర్తించిన చక్రముయొక్క కార్యములు సూచితములని మణిప్రవాళవ్యాఖ్యాత అభిప్రాయము. **"అణియార్ ఆళి"** అని, **"అశరర్ నేమియార్ పాఱు పాఱాక్కినాన్"** అని, **"దానవరై వీళ తన్నాళిప్పడై తొట్టు"** అనియు ఆళ్వార్లు చక్రమును భగవానునకు అలంకారముగా, సురులకు భయమును కల్గించు అసురులను, దానవులను నశింపచేయునదిగా కీర్తించిరికదా ! ముందు శ్లోకమున శ్రీసుదర్శనుని సమస్తకల్యాణగుణాకరత్వము ప్రతిపాదింపబడగా ఇందు వేదపాంచరాత్రాది శాస్త్ర ప్రతిపాద్యత్వము చెప్పబడినది.



**"ఆళి యెళ"** అని, **"ఆణియ త్తికిరి"** అనియు కీర్తింపబడిన విధముగా విశ్వరూపుడగు భగవానునకు అలంకారమైనవాడవు, **"సురద్విషాం ప్రాణవినాశి"** అనునట్లు దేవతలను బాధించునట్టి రాక్షసులను నశింపచేయువాడవు, ఇంద్రుడు మొదలగువారిచే నమస్కరింపబడువాడవు, ఉపనిషత్శతముచే ప్రతిపాదింపబడు వైభవమును కల్గినవాడవు, ఆశ్రితులగు విద్వాంసులచే కీర్తింపబడువాడవు, అహిర్బుధ్న్యుడను భక్తునిచే (రుద్రునిచే) గ్రహింపబడిన మహిమను కల్గినవాడవు అగు ఓ సుదర్శనచక్రమా ! జయ ! విజయీ భవ ! జయ ! విజయీ భవ !

3. **స్ఫుటతటిజ్జాలపింజర ! పృథుతరజ్వాలపంజర !**
**పరిగతప్రత్నవిగ్రహ ! పటుతరప్రజ్ఞదుర్గ్రహ !**
**ప్రహరణగ్రామమండిత ! పరిజనత్రాణమండిత !**
**జయ ! జయ ! శ్రీసుదర్శన ! జయ ! జయ ! శ్రీసుదర్శన ! ॥**

స్ఫుటతటిత్ +జాలపింజర = ప్రకాశించు మెఱపుల సమూహమువలె బంగారు వర్ణమును (రూపమును) కలవాడా, పృథుతర = మిక్కిలి పెద్దవి అగు, జ్వాలపంజర = అగ్నిజ్వాలల సమూహము అను పంజరమును కలవాడా (జ్వాల అను పంజరముమధ్యనున్నవాడా) పరిగతప్రత్నవిగ్రహ = పరిగ్రహింపబడిన పురాతనమైన విగ్రహమును కలవాడా ! పటుతర = మిక్కిలి పటిష్ఠమైన, ప్రజ్ఞ = బుద్ధిని కలవారిచే కూడ, దుర్గ్రహ = గ్రహింప సాధ్యము కానివాడా, ప్రహరణగ్రామ = ఆయుధసమూహముచే, మండిత = అలంకరింపబడినవాడా, పరిజనత్రాణ = భక్తులను సంరక్షించుటలో, పండిత = సామర్థ్యమును కలవాడా, శ్రీసుదర్శన జయ జయ = ఓ సుదర్శనమా ! జయము జయము. శ్రీసుదర్శన జయ జయ = ఓసుదర్శనమా ! జయము జయము.

పాశురమున **"వళై వాయ్ ముశల"** మని పొగడబడిన ముసలము (రోకలి) అను ఆయుధముయొక్క కార్యములు ఈ శ్లోకమున సూచితములని మణిప్రవాళవ్యాఖ్యలో, యోగులకు సైతము అర్థము చేసికొనుటకు సాధ్యము కాని దివ్యవిగ్రహాది వైశిష్ట్యము తెలుపబడినదని సంస్కృతవ్యాఖ్యానములో కలదు.

ప్రకాశించు మెఱపుల సమూహముయొక్క వర్ణమువలె పసిడివన్నెను కలవాడా! మిక్కిలి పెద్దవి అయిన అగ్నిజ్వాలల సమూహమును కలవాడా! పురాతన మైన (నిత్యమైన) దివ్యమంగళవిగ్రహమును కలవాడా ! మిక్కిలి పటిష్ఠమైన బుద్ధిని

కలవారిచేకూడ తెలిసికొనుటకు సాధ్యము కానివాడా ! పలు దివ్యాయుధ సమూహముచే అలంకరింపబడినవాడా ! ఆశ్రితసంరక్షణలో సామర్థ్య మును కలవాడా ! ఓ సుదర్శనమా ! నీకు జయము జయము, నీకు జయము జయము.

**4.** **నిజపదప్రీతసద్గణ ! నిరుపధిస్ఫీతషడ్గుణ !**
**నిగమనిర్వ్యూఢవైభవ ! నిజపరవ్యూహవైభవ ।**
**హరిహయద్వేషిదారణ ! హరపురప్లోషకారణ !**
**జయ ! జయ ! శ్రీసుదర్శన ! జయ ! జయ ! శ్రీసుదర్శన ! ॥**

నిజ = తనయొక్క, పద = స్థానముయొక్క, ప్రీత = (ప్రాప్తిచే) సంతోషమును పొందిన, సత్ + గణ = సత్పురుషుల సమూహమును కలవాడా!, నిరుపధిస్ఫీత = సహజమైన వృద్ధినొందిన, షడ్గుణ =జ్ఞానము మొదలగు ఆఱు గుణములను కలవాడా !, నిగమ = వేదములచే, నిర్వ్యూఢ = నిర్వహింపబడిన, వైభవ = మహిమను కలవాడా !, నిజపరవ్యూహవైభవ = నిత్యములైన పరము, వ్యూహము మొదలగు రూపముల వైభవమును కలవాడా !, హరిహయద్వేషి = ఇంద్రశత్రువులను, దారణ = నశింపచేయువాడా !, హరపుర = వారాణసీపురము యొక్క, ప్లోష= దాహమునకును, కారణ = కారణమైనవాడా !, శ్రీ సుదర్శన జయ జయ = ఓ సుదర్శనమా ! జయ విజయీ భవ, శ్రీసుదర్శన జయ జయ= ఓ సుదర్శనమా! జయ, విజయీ భవ.

**"వళైవిల్"** అని పాశురమున స్తుతింపబడిన శార్ఙ్గమను వింటియొక్క కార్యము లిందు సూచితములని మణిప్రవాళవ్యాఖ్యలో కలదు. ఈ శ్లోకమున ఆశ్రితవిరోధినిరోధకత్వాదులు వర్ణింపబడినవని సంస్కృతవ్యాఖ్యలో కలదు.

నీయొక్క స్థానమును పొందుటద్వారా సంతోషించిన సత్పురుషులను కలవాడా ! జ్ఞానము, బలము, ఐశ్వర్యము, వీర్యము, శక్తి, తేజస్సు -అను ఆఱు గుణములను కలవాడా. వేదములందు కీర్తింపబడిన వైభవమును కలవాడా ! నిత్యములగు పరము, వ్యూహము మొదలగు అయిదు రూపములను కలవాడా ! ఇంద్రశత్రువులను సంహరించువాడా ! కాశీనగరదాహమునకు కారణమగువాడా! ఓ శ్రీసుదర్శనమా ! జయ ! విజయీ భవ. జయ ! విజయీ భవ.

**5.** **దనుజవిస్తారకర్తన ! దనుజవిద్యానికర్తన !**
**జగదవిద్యానివర్తన (జనితమిస్రావికర్తన) ! భజదవిద్యానివర్తన ।**



**అమరదృష్టస్వవిక్రమ ! సమరజుష్టభ్రమిక్రమ !**
**జయ ! జయ ! శ్రీసుదర్శన ! జయ ! జయ ! శ్రీసుదర్శన ! ॥**

దనుజ = అసురులయొక్క, విస్తార = (సంపదయొక్క) విస్తృతిని, కర్తన= ఖండించువాడా !, దనుజ = అసురులయొక్క, విద్యా = మాయను, వికర్తన = సమూలముగా నశింపచేయువాడా !, జగత్ = లోకమునందలి, అవిద్యా = అజ్ఞానమును, నివర్తన = పోగొట్టువాడా !, (జనితమిస్రా = సంసారమను చీకటిరాత్రికి, వికర్తన = సూర్యునివంటివాడా !), భజత్ = భక్తులయొక్క, అవిద్యా= అజ్ఞానమును, నివర్తన = నిశ్శేషముగా పోగొట్టువాడా !, అమర =దేవతలచే, దృష్ట= చూడబడిన, స్వవిక్రమ = తనయొక్క (నీయొక్క) విక్రమమును కలవాడా!, సమర = యుద్ధమందు, జుష్ట = ఆశ్రయింపబడిన (చేయబడిన), భ్రమిక్రమ = భ్రమణ భంగిని కలవాడా !, శ్రీసుదర్శన జయ జయ = శ్రీసుదర్శనమా ! జయము జయము, శ్రీసుదర్శన జయజయ = శ్రీసుదర్శనమా! జయము జయము.

**"భజదవిద్యానికర్తన"** అను విశేషణస్వారస్యమునుబట్టి ఈ శ్లోకమున భక్తుల సాంసారిక సకలదుఃఖనివర్తకత్వము తెలుపబడినదని సంస్కృతవ్యాఖ్యాత వివరించెను. **"శెజ్గమల"** మని పాశురమున ప్రస్తుతింపబడిన కరుణారవింద రూపమైన ఆయుధముయొక్క కార్యమిందు సూచితమని మణిప్రవాళవ్యాఖ్యాత సూచించెను.

అసురుల విస్తృతిని నశింపజేయువాడా ! రాక్షసమాయను పారద్రోలువాడా ! లోకములందలి అవిద్యను పోగొట్టువాడా ! (సంసారమను చీకటి రాత్రికి సూర్యునివంటివాడా !) భక్తుల అజ్ఞానమును నాశనము చేయువాడా ! దేవతలచే దర్శింపబడిన తనయొక్క విక్రమమును కలవాడా ! యుద్ధములందు విచిత్రము లైన భ్రమణములను కలవాడా ! శ్రీసుదర్శనమా ! జయము జయము. జయము జయము.

**6.** **ప్రతిముఖాలీఢబంధుర ! పృథుమహాహేతిదంతుర !**
**వికటమాయాబహిష్కృత ! వివిధమాలాపరిష్కృత ।**
**పృథుమహాయంత్రతంత్రిత ! దృఢదయాతంత్రయంత్రిత**
**జయ ! జయ ! శ్రీసుదర్శన ! జయ ! జయ ! శ్రీసుదర్శన ! ॥**

ప్రతిముఖాలీఢ = ఎడమ కాలును ముందుకు చాచి, కుడి కాలును మడచిన పెట్టిన ప్రత్యాలీఢమను సన్నివేశవిశేషమున, బంధుర = మనోహరమైన వాడా !, పృథు = విపులమైన, మహా = గొప్పవైన, హేతి = ఆయుధములచేే, దంతుర = వ్యాప్తమైనవాడా !, వికటమాయా = వికటమైన మాయకు, బహిష్కృత = దూరమైనవాడా!, వివిధ = అనేకములైన, మాలా = మాలికలచే, పరిష్కృత = అలంకరింపబడినవాడా !, పృథు = గొప్పదైన, మహాయంత్ర = గొప్పదైన యంత్రమున, తంత్రిత = ప్రతిష్ఠింపబడినవాడా !, దృఢ =దృఢమైన, దయా = దయ అను, తంత్ర = తంత్రముచే, యంత్రిత = వశీకరింప జేసికొనబడినవాడా!, శ్రీసుదర్శన జయ జయ = ఓ సుదర్శనమా ! జయము జయము, శ్రీసుదర్శన జయ జయ = శ్రీసుదర్శనమా ! జయము జయము.

ప్రత్యలీఢమను సన్నివేశముచే మనోహరమైన రూపమును కలవాడా ! బలిష్ఠమైన, గొప్పవైన ఆయుధములచే వ్యాప్తమైనవాడా ! వికటమైన మాయకు దూరమైనవాడా ! అనేకవిధములైన మాలికలచే అలంకరింపబడినవాడా !, గొప్పదైన యంత్రమున ప్రతిష్ఠింపబడినవాడా ! దయ అనెడి తంత్రముచే వశము చేసికొనబడినవాడా ! శ్రీసుదర్శనమా ! జయము జయము, జయము జయము.

7. **మహితసంపత్‌సదక్షర ! విహితసంపత్ షడక్షర !**
**షడరచక్రప్రతిష్ఠిత ! సకలతత్త్వప్రతిష్ఠిత ।**
**వివిధసంకల్పకల్పక! విబుధసంకల్పకల్పక!**
**జయ ! జయ ! శ్రీసుదర్శన ! జయ ! జయ ! శ్రీసుదర్శన ! ॥**

మహిత = గొప్పదైన, సంపత్ = ఐశ్వర్యముచే, సత్+అక్షర = బ్రహ్మజ్ఞానులకు మోక్షరూపమైనవాడా !, విహిత = అనుగ్రహింపబడిన, సంపత్= ఐశ్వర్యమును కల, షట్ + అక్షర = ఆరు అక్షరములను కల్గిన మంత్రమును కలవాడా!, షట్ + అర = ఆఱు అరలను (కోణములను) కల్గిన, చక్ర= చక్రము నందు, ప్రతిష్ఠిత = ఉన్నవాడా !, సకలతత్త్వ = సమస్తతత్త్వముతలందు (భావము లందు), ప్రతిష్ఠిత = అంతర్యామి రూపమున నున్నవాడా!, వివిధ =పలువిధములైన, సంకల్ప = కోరికలకు, కల్పక = కల్పవృక్షమువంటివాడా!, విబుధ = దేవతల యొక్క, సంకల్ప= కోరికలను, కల్పక = కలుగజేయువాడా ! (ఉత్పాదకుడా !) శ్రీసుదర్శన జయ జయ = ఓ సుదర్శనమా ! జయము జయము, శ్రీసుదర్శన జయ జయ = ఓ సుదర్శనమా! జయము జయము.



ఈ శ్లోకమున "వివిధసంకల్పకల్పక", "విబుధసంకల్పకల్పక" అను విశేషణముల స్వారస్యమునుబట్టి శ్రీసుదర్శనముయొక్క సకలఫలప్రదత్వము వర్ణింపబడినదని చెప్పనగును. "అంకుశ" మను ఆయుధముయొక్క కార్యములు సూచితములని మణిప్రవాళవ్యాఖ్య. మొదటి పాదమున "మహితసంపత్ క్షతక్షర" అని, "మహితసంవిత్ క్షతక్షర" అని పాఠాంతరములు కలవు.

గొప్ప ఐశ్వర్యమును ఇచ్చువాడా !, బ్రహ్మజ్ఞానులకు మోక్షరూపమైనవాడా! ఐశ్వర్యమును అనుగ్రహించు, ఆఱు అక్షరములను కల్గిన మంత్రముచే ఉపాస్యుడా!, షట్కోణచక్రవర్తీ!, అంతర్యామిరూపమున సకలతత్త్వములందు వ్యాపించి యున్నవాడా!, సమస్తములైన కోరికలను అనుగ్రహించువాడా! దేవతల అభీష్టములను తీర్చువాడా ! ఓ శ్రీసుదర్శనమా ! జయము జయము, జయము జయము.

8. **భువననేత్ర త్రయీమయ ! సవనతేజస్త్రయీమయ !**
**నిరవధిస్వాదుచిన్మయ ! నిఖిలశక్తే ! జగన్మయ ।**
**అమితవిశ్వక్రియామయ ! శమితవిష్వగ్భయామయ !**
**జయ ! జయ ! శ్రీసుదర్శన ! జయ ! జయ ! శ్రీసుదర్శన ! ॥**

భువననేత్ర = లోకములకు నేత్రమువంటివాడా ! త్రయీమయ = వేదస్వరూపుడా !, సవనతేజస్త్రయీమయ = యాగములోని మూడు విధములైన అగ్నుల రూపమైనవాడా !, నిరవధి = అవధి లేని, స్వాదు = భోగ్యమైన, చిత్+మయ = జ్ఞానాత్మకమైన స్వరూపమును కలవాడా !, నిఖిలశక్తే = సర్వవిధమైన శక్తిని కలవాడా !, జగత్+మయ = జగదాకారమును కలవాడా !, అమిత = అంతు లేని, విశ్వ = లోకములయొక్క, క్రియామయ = క్రియల రూపమైనవాడా!, (సర్వకర్మ సమారాధ్యుడా !), శమిత =ఉపశమింప జేయబడిన, విష్వగ్భయ = సంసారభయమను (నలు వైపుల గల భయమను), ఆమయ = వ్యాధిని కలవాడా!, శ్రీసుదర్శన జయజయ = శ్రీసుదర్శనమా ! జయము జయము, శ్రీసుదర్శన జయ జయ = శ్రీసుదర్శనమా ! జయము, జయము.

ముల్లోకముకు నేత్రమైనవాడా ! వేదస్వరూపుడా ! యాగములలో ఆరాధింపబడు గార్హపత్య - ఆహవనీయ- దక్షిణాగ్నులను మూడు అగ్నుల రూపమైనవాడా ! నిరవధికమైన, భోగ్యమైన జ్ఞానముయొక్క స్వరూపమైనవాడా!

సకలవిధమైన శక్తిని కలవాడా ! జగద్రూపుడా ! సర్వకర్మసమారాధ్యుడా ! భక్తుల సమస్త భయములు అను రోగమును పోగొట్టువాడా ! శ్రీ సుదర్శనమా ! జయము, జయము, శ్రీసుదర్శనమా ! జయము జయము.

**9. ద్విచతుష్క మిదం ప్రభూతసారం**
**పఠతాం వేంకటనాయకప్రణీతమ్ ।**
**విషమేఽపి మనోరథః ప్రధావన్**
**న విహన్యేత రథాంగధుర్యగుప్తః ॥**

వేంకటనాయకప్రణీతం = వేదాంతదేశికులచే అనుగ్రహింపబడినది, ప్రభూతసారం = గొప్ప సారమును (శక్తిని) కల్గినది అగు, ఇదం = ఈ, ద్విచతుష్కం = సుదర్శనాష్టకమును, పఠతామ్ = పఠించువారియొక్క, మనోరథః = మనస్సు అను రథము, విషమే = అసమమైన మార్గమున (తగని కోరికల యందు), ప్రధావన్ అపి = పరుగిడునది అయినను, (ఆసక్తమైనదైనను), రథాంగధుర్య = గొప్పవాడైన శ్రీసుదర్శన మూర్తిచే (శ్రీసుదర్శనమును దాల్చు శ్రీరంగనాథునిచే), గుప్తః = రక్షింపబడినదై, న విహన్యేత = భంగమును పొందదు (నశింపదు).

శ్రీసుదర్శనాష్టకమను స్తోత్రమును రచించిన పిమ్మట శ్రీదేశికులు **"అంతేఽనుష్టుభ మార్యాం వా కవికృత్యాఖ్యయాఽన్వితామ్, కుర్యాత్ చాటుప్రబంధానా మేష సాధారణో విధిః"** అను సూక్తినిబట్టి తనయొక్క కీర్తి చిరకాలము నిలచుటకై తన పేరు, గ్రంథము పేరును కల్గియుండు శ్లోకముతో ఈ స్తోత్రమును పఠించినవారికి కలుగు ఫలములను తెలియజేయుచున్నారు.

శ్రీవేంకటనాథులచే అనుగ్రహింపబడినది, గొప్ప అర్థములను కల్గినది అగు ఈ సుదర్శనాష్టకమును పఠించు భక్తుల మనస్సు ప్రమాదవశమున అప్రాప్త విషయములందు సంచరించినను, భగవానునిచే (సుదర్శనముచే) రక్షింపబడినదై, ఉజ్జీవించును; నశింపదు. అది ఎట్లనగా- చక్కని, పటిష్ఠములైన చక్రములను కల్గిన రథము విషయమైన (ఎత్తు పల్లములతో కూడిన) దారిలో పయనించినను అది భగ్నము కాదుకదా !





# శ్రీషోడశాయుధస్తోత్రము

శ్రీ మద్వేదాంతదేశికులు అనుగ్రహించిన స్తోత్రములలో ఒకటి అగు షోడశాయుధ స్తోత్రముకూడ సుదర్శనాష్టకమువలెనే శ్రీసుదర్శనమూర్తియొక్క స్తుతి. దీనిని రచించుటలో గల ఐతిహ్యము సుదర్శనాష్టకము అనుగ్రహించుటలోని ఐతిహ్యము, రెండును ఒకటిగానే వ్యాఖ్యాతలు తెలిపిరి. గృధ్రసరస్తీరము (తిరుప్పుళ్ కుழி) అను దివ్యదేశములోని శ్రీవైష్ణవులకు కల్గిన శీతజ్వరముయొక్క నివారణార్థమని సంస్కృత వ్యాఖ్యాత తెలుపగా, మణిప్రవాళవ్యాఖ్యానమున పరమత భంగమను వాదగ్రంథమును నిర్విఘ్నముగా పరిసమాప్తిని చేసిన దేశికులు అందులకు శ్రీసుదర్శనుల కరుణయే కారణమని తలచి, ఆ భగవానునిపట్ల కృతజ్ఞతగా **"తికిరి ముழு"** అను పదునాఱు పాదములను కలిగిన పాశురమును, దానిని అనుసరించు శ్రీషోడశాయుధస్తోత్రము అనుగ్రహించిరని తెలుపబడినది.

శ్రీసుదర్శనమూర్తి తన పదునాఱు బాహువులందు పదునాఱు ఆయుధము లను ధరించి యుండును. ఇందులకు ప్రమాణముగా **"చక్రం కుంతం కృపాణం పరశుహుతవహౌ వంకుశం దండశక్తీ శంఖం కోదండపాశౌ హలముసల గదావజ్ర శూలాం శ్చ హేతీన్, దోర్భిః సవ్యాపవ్యైః దధదతులబలస్తంభితారాతిదర్పైః"** అను శ్రీసుదర్శనశతకశ్లోకము, **"శంఖం చక్రం చ చాపం పరశుమసి మిషుం శూలపాశాం కుశాగ్నీన్, బిభ్రాణం వజ్రఖేటౌ హలముసలగదాన్ శూలమత్యు గ్రదంష్ట్రమ్"** అను శ్రీసుదర్శనమూర్తి ధ్యానశ్లోకమును, అహిర్బుధ్న్యసంహితలోని సప్తమాధ్యాయమున షోడశభుజ సుదర్శనమూర్తి వర్ణనలో గల **"క్రమేణ చక్రపరశుకుంతదండాంకుశాని చ, శస్త్రాణి శతవక్త్రాణి ఖడ్గశక్తీ చ బిభ్రతమ్, కరై రూర్ధ్వముఖైః దీర్ఘైః దక్షిణై పరైః, వామైః శంఖధనుః పాశహలవజ్రాణి చ క్రమాత్, గదాముసలశూలాని భీమస్యైతాని బిభ్రతమ్"** అను శ్లోకములును స్మరణీయములు.

శ్రీసుదర్శనమూర్తికి సంబంధించిన ఆఱు చక్రములలో పురుషచక్రమును అధిష్ఠించియుండు మూర్తి పదునాఱు బాహువులను కల్గియుండును- అని అహిర్బుధ్న్యసంహిత తెలుపుచున్నది. ఆ పురుషచక్రము త్ర్యరము (మూడు అరలను కల్గినది)గా అచట తెలుపబడినది. అట్లే, శ్రీసుదర్శనాష్టోత్తరశతనామ స్తోత్రములోని **"ఉద్యత్షోడశదోర్దండకింకిణీదామభూషిత"** అను నామమును, సహస్రనామ స్తోత్రములోని **"ద్విరష్టాయుధభృత్"** అను నామమును ఈ సందర్భమున స్మరింప

నగును. మఱియు, ఆ స్తోత్రము చివర గల "చక్రీ కుంతధరః ఖడ్గీ పరశ్వధధరోఽగ్నిభృత్, ధృతాంకుశో దండధరః, శక్తిహస్తః సుశంఖభృత్, ధన్వీ ధృతమహాపాశః హలీ ముసలభూషణః, గదాయుధధరో వజ్రీ మహాశూలలసద్భుజః" అను పదునాఱు నామములను షోడశభుజుడగు ఆసుదర్శనమూర్తి ధరించి యుండు ఆయుధముల వివరములను తెలుపుచున్నది.

అహిర్బుధ్న్యసంహితలో నారదుడు శివుని చూచి సుదర్శనమూర్తి పదు నాఱు బాహువులను కల్గియుండునట్లుగా ఎప్పుడు ఎందుకు ఆరాధన చేయ వలయును? అని ప్రశ్నింపగా అందులకు సమాధానముగా పరమేశ్వరుడు "పరైః పరిభవే ప్రాప్తే రాజ్ఞాం బలసమన్వితైః, నగరేషు ప్రదగ్ధేషు రాజ్ఞాం విద్రావితే బలే, కారయేత్ షోడశభుజం సుదర్శన మవారితమ్" అని తెలుపుటయు ఇచట స్మరణీయము. అట్లే, సప్తమాధ్యాయమున గల షోడశభుజ సుదర్శనమూర్తి వర్ణన శ్లోకములును ఇచట ఉట్టకింపబడుచున్నవి. "అపార మపరిచ్ఛేద్య మవాఙ్మానస గోచరమ్, రక్తవర్ణ ముదారాంగం పీతకౌశేయవాససమ్, విద్యుత్ పుంజ ప్రతీకాశైః కేశైః రూర్ధ్వముఖైః యుతమ్, పింగళాఘూర్ణమానోగ్రనేత్ర త్రితయభీషణమ్, దష్టాధరస్ఫుటాలక్ష్య దంష్ట్రా నిష్ఠ్యూతపావకమ్, క్వణత్కింకిణి జాలేన కాంచీదామ్నా విరాజితమ్, నితంబలంబినోపేతం జ్వలత్ కౌక్షేయకేణ చ, దధానం కింకిణీమాలాం త్వలిమాలానినాదితామ్, ఆపాదలంబినీం దివ్యాం ముక్తారత్నాంచితాం తథా, ఝణత్ఝణితమంజీరశోభమాన - పదాంబుజమ్, హారకేయూర తాటంకముకుటై రుపశోభితమ్, అన్యైః మణిమయైః చిత్రైః భూషణైః సమలంకృతమ్, క్రమేణ చక్రపరశుకుంతదండాంకుశాని చ, శస్త్రాణి శతవక్త్రాణి ఖడ్గశక్తీ చ బిభ్రతమ్, కరై రూర్ధ్వముఖైః దీర్ఘైః దక్షిణై రష్టభిః పరైః, వామైః శంఖధనుః పాశహలవజ్రాణి చ క్రమాత్, గదాముసలశూలాని భీమాన్యేతాని బిభ్రతమ్"- అనునవి ఆ శ్లోకములు.

ప్రస్తుత శ్లోకమున దేశికులు తాము రచింపబోవు షోడశాయుధ స్తుతియొక్క నిర్విఘ్న పరిసమాప్తికై షోడశాయుధబాహువగు సుదర్శనమూర్తిని ప్రార్థించు చున్నారు. ఇట్లు షోడశాయుధమూర్తిని స్తుతించుట సముచితదేవతను, ఇష్టదేవతను ప్రార్థించినట్లయినది. షోడశాయుధబాహువగు శ్రీసుదర్శనమూర్తి కవికి ఇష్టదైవము. అట్లే, ప్రస్తుతస్తుతికి ప్రతిపాద్యుడును అతడే. కావున సముచితదైవము. సముచిత దైవమును కాని, ఇష్టదైవమును కాని గ్రంథారంభమున స్తుతించుట సత్సంప్ర దాయము కదా!



1. **స్వసంకల్పకలాకల్పై రాయుధై రాయుధేశ్వరః ।**
**జుష్టః షోడశభిర్దివ్యై జుషతాం వః (నః) పరః పుమాన్ ॥**

స్వసంకల్ప = తన సంకల్పజ్ఞానముయొక్క, కలాకల్పైః = పదునాఱవ భాగముతో సమానములగు, దివ్యైః = లోకోత్కృష్టములైన, షోడశభిః = పదునాఱు అగు, ఆయుధైః = ఆయుధములతో, జుష్టః = కూడియున్న, ఆయుధ+ఈశ్వర= (కావుననే) భగవానుని ఆయుధములలో ముఖ్యుడగు, పరః పుమాన్ = సుదర్శన రూపములోని పరమపురుషుడు, వః =మిమ్ములను, (నః = మనలను), జుషతాత్= సంతోషింపజేయును గాక !

తన సంకల్పజ్ఞానముయొక్క పదునాఱవ భాగములా ! అనునట్లున్న పదునాఱు ఆయుధములతో కూడినవాడును, శ్రీసుదర్శనమూర్తి రూపములోనున్న పరమపురుషుడు మిమ్ములను (మనలను) ఆనందపఱచును గాక !

2. **యదాయత్తం జగచ్చక్రం కాలచక్రం చ శాశ్వతమ్ ।**
**పాతు వ (న) స్తత్ పరం చక్రం చక్రరూపస్య చక్రిణః ॥**

జగచ్చక్రం = చక్రమువలె మాటిమాటికిని పరిభ్రమించు లోకము, శాశ్వతం= నిత్యమైన, కాలచక్రం చ = ఆ విధముగానే పరిభ్రమణాత్మకమైన కాలచక్రమును, యత్+ ఆయత్తం = ఎవని ఆధీనమున నున్నదో, అట్టి, చక్రరూపస్య = సుదర్శనాత్మకుడైన, చక్రిణః = చక్రధారియగు శ్రీమన్నారాయణునియొక్క, తత్= అట్టి, పరం = గొప్పదైన, చక్రం = చక్రాయుధము, వః= మిమ్ములను, (నః = మనలను), పాతు = రక్షించును గాక !

వేదాంతదేశికులు షోడశాయుధస్తోత్రమును అంతకు ముందు తాము రచించిన "తికిరి ముழு" అను పాశురమును అనుసరించుచు అనుగ్రహించిరని పెద్దలందురు. ఆ పాశురమున మొదటగా చక్రాయుధము ప్రస్తావింపబడుటచే ఆ క్రమములోనే ఇచట మొదటగా చక్రాయుధమును స్తుతించుచు, తమను రక్షింపవలసినదిగా ప్రార్థించుచున్నారు. మొదట షోడశబాహువగు సుదర్శనమూర్తి కుడివైపున ధరించిన ఎనిమిది ఆయుధములు స్తుతింపబడుచున్నవి. వానిలో ముందుగా చక్రాయుధము ప్రస్తావింపబడుట గమనింపదగును.

జననమరణములతో చక్రమువలె పరిభ్రమించు లోకము, అట్టి పరిభ్రమణ స్వభావమునే కల్గిన శాశ్వతమైన కాలమును ఏ సుదర్శన చక్రము యొక్క

అధీనమున నున్నవో, అట్టి గొప్పదైన, భగవానుని ఆయుధమగు చక్రరాజము మిమ్ములను (మనలను) కాపాడుగాక !

**3. యత్ప్రసూతిశతై రాసన్ రుద్రాః పరశులాంఛనాః ।
స దివ్యో హేతిరాజస్య పరశుః పరిపాతు వః (నః) ॥**

పరశులాంఛనః = పరశువు అను (గండ్రగొడ్డలిని) ఆయుధమును గుర్తుగా కల్గిన, రుద్రాః = రుద్రులు, యత్ = దేనివలన, ప్రసూతిశతైః = పుట్టిన పలు జీవులతో పాటుగా (సమానులుగా), ఆసన్ = అయ్యిరో, హేతిరాజ్య = శ్రీసుదర్శనముయొక్క, దివ్యః = అప్రాకృతమైన, సః = అట్టి, (రుద్రోత్పత్తిచే ప్రసిద్ధినొందిన), పరశుః = పరశువు అను ఆయుధము, వః = మిమ్ములను, (నః= మనలను), పరిపాతు = సర్వత్ర సర్వదా రక్షించునుగాక !

**'మழு'** అని కీర్తింపబడు పరశువు అను ఆయుధమును ఇందు దేశికులు సకలవిధరక్షణకై ప్రార్థించుచున్నారు.

శ్రీసుదర్శనమును ప్రార్థించి, పరశువు అను ఆయుధమును వరముగా పొంది, అందువలన ఖండపరశువు అను ప్రసిద్ధిని పొంది, సంహారాధికారులగు రుద్రులు ఏ పరశువువలన జనించిన వారయ్యిరో, అట్టి పరశువు అను ఆయుధము మిమ్ములను (మనలను) రక్షించునుగాక !

**4. హేలయా హేతిరాజేన యస్మిన్ దైత్యాః సముద్ధృతే ।
శకుంతా ఇవ ధావంతి స కుంతః పాలయేతవః ॥**

హేతిరాజేన = ఆయుధప్రభువైన ఏ సుదర్శనునిచే, యస్మిన్ = ఏ ఈటె అనే ఆయుధం, హేలయా = విలాసంగా, సముద్ధృతే (సతి) = ఎత్తబడినది అయినపుడు, దైత్యాః = అసురులు, శకుంతాః ఇవ = పక్షులవలె, ధావంతి = పరుగుతీస్తున్నవో, సః కుంతః = ఆ ఈటె అనే ఆయుధం, వః పాలయేత = మిమ్ములను రక్షించుగాక!

ఆయుధ ప్రభువైన శ్రీసుదర్శన భగవానుడు ఈటె అనే ఆయుధమును విలాసంగా చేతితో ఎత్తగానే దానిని చూచి అసురులు భయముతో పక్షులవలే పరుగు తీయుదురు. అట్టి కుంతమనే ఆయుధము మనలను కాపాడుగాక!



**5. దైత్యదానవముఖ్యానాం దండ్యానాం యేన దండనమ్ ।
హేతిదండేశదండోఽసౌ భవతాం (పస్మాకం) దండయేత్ ద్విషః ॥**

దండ్యానాం = దండింపతగిన, దైత్యదానవముఖ్యానాం = దితి కుమారులు, దనుపుత్రులు అగు అసురులయొక్క, దండనం = దండించుట, యేన = ఏదండముచే చేయబడుచున్నదో, అసౌ = (అట్టి) ఈ, హేతిదండ + ఈశ దండః = ఆయుధప్రభువగు శ్రీసుదర్శనముయొక్క దండమను ఆయుధము, భవతాం= మీయొక్క, (అస్మాకం = మనయొక్క), ద్విషః = శత్రువులను, దండయేత్ = దండించును గాక.

పాశురమున **"తణ్డు"** అని నిర్దేశింపబడిన దండమును దేశికులు ఈ శ్లోకమున స్తుతించుచున్నారు.

దండింపదగిన దైత్యులు, దానవులు మొదలగువారిని ఏ దండాయుధ ముతో భగవానుడు దండించునో, అట్టి శ్రీసుదర్శనుని దండాయుధము మీ (మన) శత్రువులను దండించును గాక !

**6. అనన్యాయభక్తానాం రుంధన్నాశామతంగజాన్ ।
అనంకుశవిహారో వః (నః) పాతు హేతీశ్వరాంకుశః ॥**

అనన్య+ అన్వయభక్తానాం = వేఱొక దైవముపట్ల అన్వయము లేని (ప్రపత్తి చేయని), భక్తులయొక్క, ఆశామతంగజాన్ = ఆశలు అను మదగజములను, రుంధన్ = అవరోధించుచు, అనంకుశవిహారః = అడ్డు లేని విహారమును కల్గిన, హేతి + ఈశ్వర + అంకుశః = శ్రీసుదర్శన ప్రభువుయొక్క అంకుశము అను ఆయుధము, వః = మిమ్ములను, (నః = మనలను), పాతు = రక్షించుగాక !

**"అంకుశః"** మని పాశురమున ప్రస్తుతించిన అంకుశమును దేశికులు ఇందు ప్రార్థించుచున్నారు.

తనను తప్ప వేఱొకరిని ఆశ్రయింపని భక్తులయొక్క లౌకికములైన ఆశలు అను మదగజములను నిరోధించునది, ఎట్టి అడ్డు లేని విహారమును కల్గినదగు శ్రీసుదర్శనప్రభువుయొక్క అంకుశమను ఆయుధము మిమ్ములను (మనలను) కాపాడుగాక !

7. సంభూయ శలభాయంతే యత్ర పాపాని దేహినామ్ ।
స పాతు శతవక్త్రాగ్నిహేతిః హేతీశ్వరస్య వః (నః) ॥

యత్ర : ఏ శతముఖాగ్నియందు, దేహినాం = జీవులయొక్క, (ఆశ్రితుల యొక్క), పాపాని = పాపములు, సంభూయ = కలసి, శలభాయంతే= మిడతలగుచున్నవో, హేతి+ఈశ్వరస్య = ఆయుధప్రభువగు (ఆ) శ్రీసుదర్శనుని యొక్క, సః శతవక్త్రాగ్ని హేతిః = నూఱు ముఖములను కల ఆ శతవక్త్రాగ్ని అను ఆయుధము, వః (నః) పాతు = మిమ్ములను, (మనలను) రక్షించును గాక !

"పాఱి శిదఱు శతముక అఙ్గి" అని పాశురమున కీర్తింపబడిన శతముఖాగ్ని ఇందు ప్రస్తుతింపబడుచున్నది.

సంసారుల పాపసమూహములు అన్నియు కలసి ఏ (శతముఖాగ్ని అను) ఆయుధమునందు, అగ్నిలో మిడతలవలె, నిశ్శేషముగా దహింపబడుచున్నవో అట్టి శ్రీసుదర్శన భగవానునియొక్క శతముఖాగ్ని అను ఆయుధము మిమ్ములను (మనలను) కాపాడుగాక !

8. అవిద్యాం స్వప్రకాశేన విద్యారూప శ్ఛినత్తి యః ।
స సుదర్శననిస్త్రింశః సౌతు వః (నః) తత్త్వదర్శనమ్ ॥

విద్యారూపః = విద్యామూర్తి అగు, యః = ఏఖడ్గము, స్వప్రకాశేన = తన యొక్క ప్రకాశముచే, అవిద్యాం = అజ్ఞానమును, ఛినత్తి = ఛేదించుచున్నదో, సః = ఆ, సుదర్శననిస్త్రింశః = సుదర్శనభగవానుని ఖడ్గము, తత్త్వదర్శనం = పరతత్త్వ సాక్షాత్కారమును, వః = మిమ్ములను, (నః = మనకు) సౌతు = కల్గించును గాక !

"వాళ్" అని పాశురమున స్తుతింపబడిన ఖడ్గము ఇందు స్తుతింప బడుచున్నది. విద్యారూపమగు ఏ ఖడ్గము ప్రకృతిసంబంధమూలకమైన అజ్ఞానమును ఛేదించునో, అట్టి శ్రీసుదర్శనదేవుని ఖడ్గము మీకు (మనకు) పరతత్త్వదర్శనమును కల్గించును గాక !

9. క్రియాశక్తిగుణో విష్ణోః యో భవత్యతిశక్తిమాన్ ।
అంకుఠశక్తి స్సా శక్తి రశక్తిం వారయేత వః (నః) ॥



అతిశక్తిమాన్ = గొప్ప సామర్థ్యమును కల, యః = శక్తి అను ఏ ఆయుధము, విష్ణోః = సర్వవ్యాపి యగు భగవానునకు, క్రియాశక్తిగుణః= లోకములను సృష్టించుటకు అనుగుణమగు శక్తిరూపముగా, భవతి = అగుచున్నదో, అకుంఠశక్తిః = మొక్కవోని శక్తిని కల్గిన, సా = ఆ, శక్తిః= శక్తి అను ఆయుధము, వః = మీయొక్క, (నః = మనయొక్క), అశక్తిం = శక్తిరాహిత్యమును, వారయేత = నివారించును గాక !

"వేల్" అని పాశురమున కీర్తింపబడిన "శక్తి" అను ఆయుధ మిందు స్తుతింపబడుచున్నది.

భగవానుని జగత్కర్తృత్వమను గుణము ఏ శక్తి అను ఆయుధముయొక్క రూపమో, మొక్కవోని సామర్థ్యమును కల ఆ శక్తి మీ (మనయొక్క) అశక్తిని పోగొట్టును గాక. అనగా- మన జ్ఞానానుష్ఠానములయందు కల్గు ఆశక్తిని తొలగించునుగాక- అని తాత్పర్యము. దీనివలన ఆశ్రితరక్షణమున కేవలము వ్యాజమాత్రమును కోరువాడై, వారికి జ్ఞానశక్త్యాదులను అనుగ్రహించి, తనను ఆశ్రయించునట్లు చేసి, పరమసామ్యమును పొందించు భగవానునియొక్క పరమోదారత తెలుపబడినదని మణిప్రవాళవ్యాఖ్యలో తెలుపబడినది.

10. తారత్వం యస్య సంస్థానే శబ్దే చ పరిదృశ్యతే ।
ప్రభోః ప్రహరణేంద్రస్య పాంచజన్య స్స పాతు వః (నః) ॥

యస్య = ఏ పాంచజన్యముయొక్క, సంస్థానే = రూపమున, శబ్దే చ = స్వరముననూ, తారత్వం = తారత్వము (ప్రణవత్వము, ఔన్నత్యమును), పరిదృశ్యతే = స్పష్టముగా గోచరించుచున్నదో, సః = ఆ, పాంచజన్యః= పాంచజన్యమను శంఖము, వః = మిమ్ములను (నః= మనలను), పాతు = రక్షించుగాక !

భగవానుని శంఖమగు పాంచజన్యము రూపమున, స్వరమున తారత్వమును (ఔన్నత్యమును, ప్రణవరూపమును) కల్గియున్నది. అట్టి పాంచజన్యము మిమ్ములను, (మనలను) రక్షించునుగాక !

ఇంతవరకు దేశికులు శ్రీసుదర్శనభగవానుని కుడి వైపునగల ఎనిమిది భుజములలోని ఎనిమిది ఆయుధములను స్తుతించి, పిమ్మట, ఎడమ వైపున గల ఎనిమిది భుజములలోని ఆయుధములను స్తుతింపనెంచి, మొదటగా

పాంచజన్యమును ఇందు ప్రస్తుతించుచున్నారు. ఈ పాంచజన్యమును "తెళి పణిలమ్" అనుచు పాశురమున ప్రస్తుతించిరి.

**11. యం సాత్త్విక మహంకార మామనంత్యక్షసాయకమ్ ।**
**అవ్యా ద్వ (న్న) శ్చక్రరూపస్య తద్ధనుః శార్జ్గధన్వనః ॥**

అక్షసాయకం = ఇంద్రియములనెడి బాణములను కల్గిన (ఇంద్రియము లకు కారణమగు) యం = ఏ శార్జ్గమను వింటిని, సాత్త్వికం = సాత్త్వికమను పేరును కల, అహంకారం = అహంకార తత్త్వముగా, అమనంతి = చెప్పుచున్నారో, చక్రరూపస్య = శ్రీసుదర్శనచక్రరూపములో నున్న, శార్జ్గధన్వనః = శార్జ్గపాణి యొక్క, తత్ = ఆ, ధనుః = ధనుస్సు, వః (నః) అవ్యాత్ = మిమ్ములను (మనలను) రక్షించుగాక.

పాశురమున "శిలై" అని కీర్తించిన ధనస్సును ఇందు కవి ప్రస్తుతించు చున్నారు.

ఇంద్రియములు అను బాణములను కల్గిన ఏ శార్జ్గమను వింటిని పరాశరమహర్షి మొదలగు తత్త్వవిదులు పంచేంద్రియములకు మూలకమగు సాత్త్వికహంకారముయొక్క తత్త్వముగా పల్కిరో, అట్టి శ్రీసుదర్శనభగవానుని విల్లు అగు శార్జ్గము మిమ్ములను (మనలను) కాపాడును గాక !

**12. ఆయుధేంద్రేణ యేనైవ విశ్వసర్గో విరచ్యతే ।**
**స వః (నః) సౌదర్శనః కుర్యాత్ పాశః పాశవిమోచనమ్ ॥**

యేన = ఏ, ఆయుధ+ ఇంద్రేణ ఏవ = పాశమను ఆయుధశ్రేష్ఠము చేతనే, విశ్వసర్గః = జగత్తుయొక్క సృష్టి, విరచ్యతే = చేయబడుచున్నదో, సః = ఆ, సౌదర్శనః = శ్రీసుదర్శనభగవానునియొక్క, పాశః = పాశమను ఆయుధము, వః =మీయొక్క (నః= మనయొక్క), పాశవిమోచనమ్ = సంసారపాశ విమోచనమును, కుర్యాత్ = చేయును గాక !

పాశురమున **'కణ్ణి'** అని స్తుతింపబడిన పాశము అను ఆయుధములను శ్రీదేశికులు ఈ స్తోత్రమున ప్రార్థించుచున్నారు.

పాశమను ఏ ఆయుధముద్వారా భగవానుడు జగత్సృష్టిని చేయునో, అట్టి శ్రీసుదర్శన భగవానుని పాశమను ఆయుధము మిమ్ములను (మనలను) సంసారబంధమునుండి విడిపించునుగాక.



**13. విహారో యేన దేవస్య విశ్వక్షేత్రకృషీవలః ।**
**వ్యజ్యతేఽనేన సీరేణ నాసీరవిజయోఽస్తు వః (నః) ॥**

దేవస్య = జగత్సృష్టి మొదలగు క్రీడలను చేయు భగవానునియొక్క, విహారః = లీలావ్యాపారము, యేన = ఏ హలాయుధములచే అగుచున్నదో, మఱియు, విశ్వక్షేత్ర= ప్రపంచమను క్షేత్రముయొక్క, కృషీవలః= వ్యవసాయ దారుడుగా (భగవానుడు), వ్యజ్యతే = తెలిసికొనబడుచున్నాడో, అట్టి, అనేన = ఈ, సీరేణ = హలాయుధముచే, వః = మీకు, (నః = మనకు), నాసీరవిజయః = యుద్ధ ముఖమున విజయము, అస్తు = అగుగాక !

పాశురమున **"సీరజ్ఞై"** అని కీర్తింపబడిన హల మిందు స్తుతింపబడినది.

భగవానునియొక్క లీలావిహారము ఏ హలమను ఆయుధముచే చేయబడుచున్నదో, ఏ హలాయుధము భగవానుని ప్రపంచమును క్షేత్రమును పండించు వ్యవసాయదారునిగా తెలియజేయుచున్నదో, అట్టి హలాయుధము మీకు (మనకు) యుద్ధరంగమున విజయములను కల్గించును గాక !

**14. ఆయుధానాం మహం వజ్ర మిత్యగీయత య స్స వః (నః) ।**
**అవ్యాత్ హేతీశ వజ్రోఽయం దధీచ్యస్థిసముద్భవః ॥**

అహం = నేను, ఆయుధానాం = ఆయుధములలో, వజ్రం = వజ్రాయుధము, ఇతి = అని, యః = ఏ వజ్రాయుధము, అగీయత = భగవద్గీతలో భగవానునిచే కీర్తింపబడెనో, దధీచి + అస్థిసముద్భవః = దధీచి అను మునియొక్క వెన్నెముకనుండి పుట్టిన, సః = ఆ, అయం = ఈ, హేతి+ ఈశవజ్రః= శ్రీసుదర్శన భగవానుని వజ్రాయుధము, వః= మిమ్ములను, (నః = మనలను), అవ్యాత్ = రక్షించును గాక !

పాశురమున "శెవ్విడి" అని కీర్తింపబడిన వజ్రాయుధ మీ శ్లోకమున స్తుతింపబడుచున్నది.

విభూతిసందర్శనయోగమున **"యద్యత్ విభూతిమత్ సత్త్వం శ్రీమదూర్జిత మేవ వా, తత్తదేవావగచ్ఛత్వం మమ తేజోఽంశసంభవమ్"** అనుచు శ్రీకృష్ణభగ వానుడు గీతలో లోకములోని ఉత్కృష్టములైన వస్తువులన్నియు తన రూపములే అని పల్కు సందర్భమున వజ్రాయుధము తానే అనెను. అట్టి గొప్ప దనమును కల్గినది, భగవత్ స్వరూపాత్మకమైనదగు దధీచిముని వెన్నెముకనుండి నిర్మింప

బడిన శ్రీసుదర్శనభగవానుని వజ్రాయుధము మిమ్ములను (మనలను) కాపాడు గాక!

**15. విశ్వసంహృతిశక్తి ర్యా విశ్రుతా బుద్ధిరూపిణీ ।**
**సా (నః) సౌదర్శనీ భూయాద్గదప్రశమనీ గదా ॥**

బుద్ధిరూపిణీ = బుద్ధిఅధిష్ఠాన దేవతయగు, యా = ఏగద, విశ్వసంహృతి శక్తిః= భగవానుని లోకసంహారశక్తిగా, విశ్రుతా = (పాంచరాత్ర సంహితలలో) ప్రసిద్ధమైనదో, సౌదర్శనీ = శ్రీసుదర్శనభగవానునకు చెందిన, సా = ఆ, గదా = గదాయుధము, వః = మీయొక్క, (నః = మనయొక్క), గదప్రశమనీ = వ్యాధులను పోగొట్టునదిగా, భూయాత్ = అగును గాక !

పాశురమున **"శెఱ్రియ గదై"** అని కీర్తించిన గదాయుధమును శ్రీదేశికులు ఈ శ్లోకమున స్తుతించుచున్నారు.

**"సంహృతిక్రీడితమ్"** అను విధముగా భగవానుని లీలలో ఒకటిగా చెప్పబడుట లోకసంహారమునకు మూలమైన శక్తిగా, బుద్ధికి అధిష్ఠానదేవతగా చెప్పబడు శ్రీసుదర్శన భగవానుని గద మీ (మన) మనోవ్యాధులను పోగొట్టును గాక !

భగవద్రామానుజుల మతమును ద్వేషించువారగు పరవాదులను ఎట్లు జయించుట ? అను భీతియే ఇచట మనోవ్యాధి. ఆ వ్యాధిని భగవానుని గద పోగొట్టునుగాక ! అని తాత్పర్యము.

**16. యాత్యతిక్షోదశాలిత్వం ముసలో యేన తేన వః ।**
**హేతీశముసలేనాశు భిద్యతాం మోహమౌసలమ్ ॥**

యేన = ఏ రోకలి అను ఆయుధముతో, ముసలః = లోకంలోని మిగిలిన ముసలములు, అతిక్షోదశాలిత్వం = వస్తువులను చూర్ణముచేయు శక్తిని కలిగి యుండు స్వభావమును, యాతి = పొందుచున్నవో, తేన హేతీశముసలేన = సుదర్శనుని ముసలమను ఆయుధముచే, వః = మీయొక్క, మోహమౌసలం = అజ్ఞానము వలన కలుగు కాఠిన్యము, ఆశు = వేగముగా, భిద్యతాం = భేదింపబడు గాక.

శ్రీ సుదర్శన భగవానుడు ముసలమను ఆయుధం ధరించియున్నాడు. ఆ ముసలము లోకములోని మిగిలిన అన్ని ముసలములలో అనుప్రవేశించినందు



వలననే అవి వస్తువులను పొడిచేయు శక్తిని కలిగినవి అయినవి. ఇట్టి ఈ ముసలా యుధము మీకు అజ్ఞానమువలన కలిగిన కాఠిన్యమును త్వరగా పోగొట్టు గాక.

**17. శూలిదృష్టమనో ర్వాచ్యో యేన శూలయతి ద్విషః ।**
**భవతాం తేన భవతాత్ త్రిశూలేన విశూలితా ॥**

శూలిదృష్టమనోః = శివునిచే దర్శింపబడిన శ్రీరామతారకమంత్రము యొక్క, వాచ్యః = అభిధేయుడగు, (శ్రీసుదర్శనమునకు ప్రభువగు భగవానుడు), యేన = ఏ త్రిశూలముచే, ద్విషః = శత్రువులను, శూలయతి = శూలమను వ్యాధిని కల్గినవారివలె బాధించునో, తేన = ఆ, త్రిశూలేన = త్రిశూలమను ఆయుధముచే, భవతాం = మీకు, విశూలితా = పీడలు లేకుండుట, భవతాత్ = అగునుగాక !

పాశురమున **"తిరిశూల"** మనుచు కీర్తించిన త్రిశూలమను ఆయుధ మిచట స్తుతింపబడుచున్నది.

పరమశివునిచే దర్శింపబడిన శ్రీరామతారకమంత్రమునకు వాచ్యుడగు, భగవానుడగు శ్రీరామచంద్రుడు ఏ త్రిశూలమను ఆయుధముచే శత్రువులను శూలమను వ్యాధిని కల్గినవారిగా బాధించుచున్నాడో, అట్టి శ్రీసుదర్శన భగవానుని త్రిశూల మను ఆయుధము మీ పీడలను అన్నిటిని పోగొట్టునుగాక !

**18. అస్త్రగ్రామస్య కృత్స్నస్య ప్రసూతిం యం ప్రచక్షతే ।**
**సోఽవ్యాత్ సుదర్శనో విశ్వ మాయుధైః షోడశాయుధః ॥**

కృత్స్నస్య = సమస్తమైన, అస్త్రగ్రామస్య = ఆయుధసమూహమునకు, యం = ఏ సుదర్శనమును, ప్రసూతిం = ఉత్పత్తిస్థానముగా, ప్రచక్షతే = చెప్పుచున్నవో (వేదము మొదలగునవి అని భావము), షోడశ + ఆయుధః = (ప్రస్తుతము) పదునాఱు ఆయుధములను కల్గినవానినిగా అనుసంధింపబడిన, సః = ఆ, సుదర్శనః = శ్రీసుదర్శన భగవానుడు, ఆయుధైః = ఆయుధములతో, విశ్వం = లోకమును, అవ్యాత్ = రక్షించునుగాక !

ఇంతవరకు శ్రీసుదర్శనభగవానుని షోడశభుజములలోని షోడశాయుధము లను ప్రత్యేక ప్రత్యేకముగా ప్రార్థించిన శ్రీదేశికులు ఈ శ్లోకమున తదాయుధ విశిష్టుడగు శ్రీసుదర్శనభగవానుని ప్రార్థించుచున్నారు. లేక, "సహస్రదోః సహస్రారం

ప్రపద్యేऽహం సుదర్శనమ్" అని కీర్తింపబడు శ్రీసుదర్శనభగవానుని కేవలము పదునాఱు భుజములను కల్గినవానినిగా పరిచ్ఛేదించి పల్కితిమి కదా ! అని పరితపించిన దేశికులు స్వామిని అనంతబాహువుగా కీర్తించుచున్నారనియు చెప్పనగును.

"సర్వాస్త్రములకును కారణమగువాడు, సర్వాయుధములను దాల్చినవాడు, తదనుగుణముగా **"తోళ్‌గళ్ ఆయిరత్తాయ్"** అనునట్లు సహస్రబాహువులను కలవాడు, శ్రీసుదర్శనరూపి అగు భగవానుడు తన ఆయుధములతో విశ్వమును రక్షించుగాక ! -అని భావము.

**19. శ్రీమద్వేంకటనాథేన శ్రేయసే భూయసే సతామ్ ।**
**కృతోऽయమాయుధేంద్రస్య షోడశాయుధసంస్తుతిః ॥**

శ్రీమద్వేంకటనాథేన = భగవద్భక్తి అను సంపదను కల్గిన, శ్రీవేంకటనాథులను పేరు కల దేశికులచే, సతాం = సత్పురుషులయొక్క, భూయసే = గొప్పదైన, శ్రేయసే = మంచికొఱకై, ఆయుధేంద్రస్య = ఆయుధప్రభువగు శ్రీసుదర్శన భగవానునియొక్క, అయం = ఈ, షోడశ ఆయుధసంస్తుతిః = షోడశాయుధ స్తోత్రము, కృతః = రచింపబడినది.

ఈ విధముగా తాము అనుగ్రహించిన స్తోత్రము, పూర్వ శ్లోకమున సూచించిన విధముగా, సర్వప్రయోజనకరమగుటయే కాక, **"సత్సమృద్ధిం చ యుక్తామ్"** అను రచించిన రీతిగా సాధుజనసంతుష్టికరమనియు, దీనిని అనుసంధించువారలకు సకల శ్రేయస్సులు కల్గించుననియు పల్కుచు, గ్రంథ చోరులు తమ గ్రంథమును దొంగిలింపకుండుటకై చివరగా స్వనామాంకిత ముగా శ్రీదేశికులు ఈ శ్లోకమున తెలుపుచున్నారు.

---



# శ్రీగోదాస్తుతి

శ్రీమాన్ వేంకటనాథార్యః కవితార్కికకేసరీ ।
వేదాంతాచార్యవర్యో మే సన్నిధత్తాం సదా హృది ॥

---

1. శ్రీవిష్ణుచిత్తకులనందనకల్పవల్లీం
శ్రీరంగరాజహరిచందన యోగదృశ్యామ్ ।
సాక్షాత్ క్షమాం కరుణయా కమలామివాన్యాం
గోదామనన్యశరణః శరణం ప్రపద్యే ॥

2. వైదేశికః శ్రుతిగిరామపి భూయసీనాం
వర్ణేషు మాతి మహిమా న హి మాదృశాం తే ।
ఇత్థం విదంతమపి మాం సహసైవ గోదే !
మౌనద్రుహో ముఖరయంతి గుణాస్త్వదీయాః ॥

3. త్వత్ప్రేయసః శ్రవణయోరమృతాయమానాం
తుల్యాం త్వదీయమణినూపురశింజితానామ్ ।
గోదే! త్వమేవ జనని! త్వదభిష్టవార్హాం
వాచం ప్రసన్నమధురాం మమ సంవిధేహి ॥

4. కృష్ణాన్వయేన దధతీం యమునాऽనుభావం
తీర్థై ర్యథావదగాహ్య సరస్వతీం తే ।
గోదే! వికస్వరధియాం భవతీకటాక్షాత్
వాచః స్ఫురన్తి మకరన్దముచః కవీనామ్ ॥

5. అస్మాదృశా మపకృతౌ చిరదీక్షితానాం
అహ్నాయ దేవి ! దయతే యదసౌ ముకున్దః ।
తన్నిశ్చితం నియమిత స్తవ మౌళిధామ్నా
తన్త్రీనినాదమధురైశ్చ గిరాం నిగుమ్భైః ॥

6. శోణాధరేఽపి కుచయోరపి తుఙ్గభద్రా
వాచాం ప్రవాహనివహేఽపి సరస్వతీ త్వమ్ ।
అప్రాకృతై రపి రసై ర్విరజాస్వభావాత్
గోదాఽపి దేవి ! కమితుర్ననను నర్మదాఽసి ॥

7. వల్మీకతః శ్రవణతో వసుధాత్మనస్తే
జాతో బభూవ స మునిః కవిసార్వభౌమః ।
గోదే ! కిమద్భుత మిదం యదమీ స్వదన్తే
వక్త్రారవిన్దమకరన్దనిభాః ప్రబన్ధాః ॥

8. భోక్తుం తవ ప్రియతమం భవతీవ గోదే !
భక్తిం నిజాం ప్రణయభావనయా గృణన్తః ।
ఉచ్చావచై ర్విరహసంగమజై రుదన్తైః
శృఙ్గారయన్తి హృదయం గురవస్త్వదీయాః ॥

9. మాతః ! సముత్థితవతీ మధివిష్ణుచిత్తం
విశ్వోపజీవ్య మమృతం వచసా దుహానామ్ ।
తాపచ్ఛిదం హిమరుచేరివ మూర్తి మన్యాం
సన్తః పయోధి దుహితుః సహజాం విదుస్త్వామ్ ॥

10. తాతస్తు తే మధుభిదః స్తుతిలేశవశ్యాత్
కర్ణామృతైః స్తుతిశతై రనవాప్తపూర్వమ్ ।
త్వన్మౌళిగన్ధసుభగా ముపహృత్య మాలాం
లేభే మహత్తరపదానుగుణం ప్రసాదమ్ ॥

11. దిక్ దక్షిణాఽపి పరిపక్త్రిమపుణ్యలభ్యాత్
సర్వోత్తరా భవతి దేవి ! తవావతారాత్ ।
యత్రైవ రఙ్గపతినా బహుమానపూర్వం
నిద్రాళునాఽపి నియతం నిహితాః కటాక్షాః ॥

12. ప్రాయేణ దేవి! భవతీవ్యపదేశయోగాత్
గోదావరీ జగదిదం పయసా పునీతే ।



యస్యాం సమేత్య సమయేషు చిరం నివాసాత్
భాగీరథీప్రభృతయోఽపి భవన్తి పుణ్యాః ॥

13. నాగేశయః సుతను ! పక్షిరథః కథం తే
జాతః స్వయంవరపతిః పురుషః పురాణః ।
ఏవంవిధాః సముచితం ప్రణయం భవత్యాః
సందర్శయన్తి పరిహాసగిరః సఖీనామ్ ॥

14. త్వద్భుక్తమాల్యసురభీకృతచారుమౌళేః
హిత్వా భుజాన్తరగతామపి వైజయన్తీమ్।
పత్యు స్తవేశ్వరి! మిథః ప్రతిఘాతలోలాః
బర్హాతపత్రరుచి మారచయన్తి భృఙ్గాః ॥

15. ఆమోదవత్యపి సదా హృదయంగమాఽపి
రాగాన్వితాఽపి లలితాఽపి గుణోత్తరాఽపి ।
మౌళిస్రజా తవ ముకున్దకిరీటభాజా
గోదే ! భవత్యధరితా ఖలు వైజయన్తీ ॥

16. త్వన్మౌళిదామని విభోః శిరసా గృహీతే
స్వచ్ఛన్దకల్పితసపీతిరసప్రమోదాః ।
మఞ్జుస్వనా మధులిహో విదధుః స్వయం తే
స్వాయంవరం కమపి మఙ్గళతూర్యఘోషమ్ ॥

17. విశ్వాయమానరజసా కమలేన నాభౌ
వక్షఃస్థలే చ కమలాస్తనచన్దనేన ।
ఆమోదితోఽపి నిగమై ర్విభురఙ్ఘ్రియుగ్మే
ధత్తేన తేన శిరసా తవ మౌళిమాలామ్ ॥

18. చూడాపదేన పరిగృహ్య తవోత్తరీయం
మాలామపి త్వదలకై రధివాస్య దత్తామ్ ।
ప్రాయేణ రఙ్గపతి రేష బిభర్తి గోదే !
సౌభాగ్యసంపదభిషేకమహాధికారమ్ ॥

19. తుఙ్గై రకృత్రిమగిరః స్వయ ముత్తమాఙ్గైః
యం సర్వగన్ధ ఇతి సాదర ముద్వహన్తి ।
ఆమోద మన్యమధిగచ్ఛతి మాలికాభిః
సోఽపి త్వదీయకుటిలాలకవాసితాభిః ॥

20. ధన్యే సమస్తజగతాం పితు రుత్తమాఙ్గే
త్వన్మౌలిమాల్యభరసంభరణేన భూయః ।
ఇన్దీవరస్రజ మివాదధతి త్వదీయాని
ఆకేకరాణి బహుమానవిలోకితాని ॥

21. రఙ్గేశ్వరస్య తవ చ ప్రణయానుబన్ధాత్
అన్యోన్యమాల్యపరివృత్తి మభిష్టువన్తః ।
వాచాలయన్తి వసుధే ! రసికా స్త్రిలోకీం
న్యూనాధికత్వసమతావిషయై ర్వివాదైః ॥

22. దూర్వాదలప్రతిమయా తవ దేహకాన్త్యా
గోరోచనారుచిరయా చ రుచేన్దిరాయాః ।
ఆసీదనుజ్ఝితశిఖావలకణ్ఠశోభం
మాఙ్గల్యదం ప్రణమతాం మధువైరిగాత్రమ్ ॥

23. అర్ఘ్యం సమర్ప్య నియమై ర్నిగమప్రసూనైః
నాథం త్వయా కమలయా చ సమేయివాంసమ్ ।
మాతశ్చిరం నిరవిశన్ నిజమాధిరాజ్యం
మాన్యా మనుప్రభృతయోఽపి మహీక్షితస్తే ॥

24. ఆర్ద్రాపరాధిని జనేఽప్యభిరక్షణార్థం
రఙ్గేశ్వరస్య రమయా వినివేద్యమానే ।
పార్శ్వే పరత్ర భవతీ యది తత్ర నాసీత్
ప్రాయేణ దేవి ! వదనం పరివర్తితం స్యాత్ ॥

25. గోదే ! గుణైరపనయన్ ప్రణతాపరాధాన్
భ్రూక్షేప ఏవ తవ భోగరసానుకూలః ।



కర్మానుబన్ధిఫలదానరతస్య భర్తుః
స్వాతన్త్ర్యదుర్వ్యసనమర్మభిదా నిదానమ్ ॥

26. రఙ్గే తటిద్గుణవతో రమయైవ గోదే !
కృష్ణామ్బుదస్య ఘటితాం కృపయా సువృష్ట్యా ।
దౌర్గత్యదుర్విష వినాశసుధానదీం త్వాం
సన్తః ప్రపద్య శమయన్త్యచిరేణ తాపాన్ ॥

27. జాతాపరాధమపి మా మనుకమ్ప్య గోదే !
గోప్త్రీ యది త్వమసి యుక్త మిదం భవత్యాః ।
వాత్సల్యనిర్భరతయా జననీ కుమారం
స్తన్యేన వర్ధయతి దష్టపయోధరాఽపి ॥

28. శతమఖమణినీలా చారుకల్హారహస్తా
స్తనభరనమితాఙ్గీ సాన్ద్రవాత్సల్యసిన్ధుః ।
అలకవినిహితాభిః స్రగ్భి రాకృష్టనాథా
విలసతు హృది గోదా విష్ణుచిత్తాత్మజా నః ॥

29. ఇతి వికసితభక్తే రుత్థితాం వేంకటేశాత్
బహుగుణరమణీయాం వక్తి గోదాస్తుతిం యః ।
స భవతి బహుమాన్యః శ్రీమతో రఙ్గభర్తుః
చరణకమలసేవాం శాశ్వతీ మభ్యుపైష్యన్ ॥

కవితార్కిక సింహాయ కల్యాణగుణశాలినే ।
శ్రీమతే వేంకటేశాయ వేదాన్తగురవే నమః ॥

# శ్రీగోదాస్తుతి

( మహావిద్వాన్ కాంచీప్రతివాది భయంకరం అణ్ణంగరాచార్య స్వామివారి ద్రావిడ వ్యాఖ్యానానికి ఆంధ్రానువాదంతో)

కవితార్కికసింహులనే బిరుదాన్ని పొందిన శ్రీమన్నిగమాంతదేశికులు ఆ బిరుదు సార్థకమని నిరూపించే పలు పలు దివ్యగ్రంథాలను అనుగ్రహించారు. ఇటువంటి దివ్యగ్రంథాల కోవలో వారి స్తోత్రగ్రంథవాఙ్మయం ఒక విభాగం. అనేక శాస్త్రగ్రంథాలలో పరిశ్రమ చేసి చాలా కష్టపడి పొందవలసిన వేదాంత సంప్రదాయార్థ సారాలను మనవంటి అలసులు సైతం సులభంగా తెలిసికొని ఉజ్జీవించే రీతిలో పలు పలు స్తోత్రగ్రంథాలను అమృతంకంటే భోగ్యంగా శ్రీదేశికులు అనుగ్రహించారు. వీటిని అర్థంతో గ్రహించి కంఠస్థం చేయగల్గితే, సర్వజ్ఞత్వం సిద్ధిస్తుందన్నది అతిశయోక్తి కాదు.

స్వామి శ్రీదేశికులు స్వయంగా దశావతారస్తోత్రంలో ఫలశ్రుతిని అనుగ్రహించేటపుడు **"వక్త్రే తస్య సరస్వతీ బహుముఖీ భక్తిః పరా మానసే శుద్ధిః కాపి తనౌ దిశాసు దశసు ఖ్యాతి శ్శుభా జృంభతే"** (అతని ముఖంలో సరస్వతి పలుకులు రీతులను కల్గి ఉంటుంది, అతని మనస్సులో గొప్ప భక్తి కల్గుతుంది, దేహంలో అనిర్వచనీయమైన శుద్ధి కల్గుతుంది. పది దిక్కులలో కీర్తి వ్యాపిస్తుంది) అని అన్నారు. ఒక చిన్న స్తోత్రాన్ని అభ్యసించాలని అనుకుంటేనే బహుముఖపాండిత్యం, భక్తి, కీర్తి - అనే ఇవి అన్నీ అభివృద్ధి అవుతాయని అన్నారు. నిజానికి దేశికుల ఒక్కొక్క స్తోత్రం ఇంతటి గొప్పతనాన్ని కల్గినది అని అనడంలో సంశయం ఏమాత్రం లేదు.

ఆ దివ్యస్తోత్రాలలోని అరుదైన దివ్యార్థాలను అందరు సులభంగా, అందంగా గ్రహించేటట్లుగా వాటిని అనతిసంక్షిప్తంగా, అనతివిస్తృతంగా వ్యాఖ్యానించమనే పెద్దల నియమనంవల్ల, ఆ భాగ్యాన్ని పొందిన నేను ఇపుడు గోదాదేవి విషయంగా శ్రీదేశికులు అనుగ్రహించిన గోదాస్తుతిని వ్యాఖ్యానించాలని ప్రయత్నిస్తున్నాను. స్వామి దేశికులు దక్షిణదివ్యదేశయాత్రకు వెళ్ళినపుడు శ్రీవిల్లిపుత్తూర్ దివ్యదేశంలో వేంచేసి ఉండే సమయంలో అక్కడ గోదాదేవి విషయంగా భక్తిపరీవాహపూర్వకంగా అనుగ్రహించినది ఈ స్తుతి - అని పెద్దల సూక్తి.



# శ్రీగోదాస్తుతి

శ్రీమాన్ వేంకటనాథార్యః కవితార్కికకేసరీ ।
వేదాంతాచార్యవర్యో మే సన్నిధత్తాం సదా హృది ॥

1. శ్రీవిష్ణుచిత్తకులనందనకల్పవల్లీం
శ్రీరంగరాజహరిచందన యోగదృశ్యామ్ ।
సాక్షాత్ క్షమాం కరుణయా కమలామివాన్యాం
గోదామనన్యశరణః శరణం ప్రపద్యే ॥

శ్రీవిష్ణుచిత్తకుల = శ్రీవిష్ణుచిత్తులనబడే పెరియాళ్వార్ల వంశమనే, నందనకల్పవల్లీం = నందనవనంలో అవతరించిన కల్పలతవంటిది, శ్రీరంగరాజ = శ్రీరంగనాథుడనే, హరిచందన = కల్పవృక్షాలతో కల్గిన, యోగ = సంబంధంచేత, దృశ్యామ్ = దర్శించదగినది, సాక్షాత్ క్షమాం = క్షమయే మూర్తీభవించినట్లున్నది, కరుణయా = కరుణచేత, అన్యాం కమలామ్ ఇవ (స్థితాం) = ఇంకొక లక్ష్మీదేవివలె ఉన్నది అయిన, గోదాం = గోదాదేవిని, అనన్యశరణః = వేఱొక గతిని లేనివాడనై, (అహం= నేను), శరణం ప్రపద్యే = శరణు పొందుతున్నాను.

శ్రీగుణరత్నకోశంలో శ్రీరంగనాయకిని స్తుతించాలని ప్రారంభించిన శ్రీపరాశరభట్టర్ **"అనుకలతనుకాండ"** అనే మూడవ శ్లోకంలో శ్రీమహాలక్ష్మిని ఒక కల్పలతగా వర్ణిస్తూ పల్కిన రీతిలో ఈ దేశికులు కూడా గోదాదేవిని ఒక కల్పలతగా ఈ స్తుతి మొదటి శ్లోకంలోని మొదటి పాదంలోనే పల్కడం ఆరంభించారు. కల్పలత సకలార్థాలను ఇవ్వగల్గినది; అదే రీతిలో గోదాదేవికూడా తన దివ్యసూక్తులద్వారా సకలార్థాలను అనుగ్రహించగల్గినది.- అనే అర్థం ఇక్కడ వివక్షితం. దేవేంద్రుని ఉద్యానవనానికి నందనమని పేరు. అక్కడే కల్పలత పెరుగుతుంది. ఈ గోదాదేవి అనబడే ఈ కల్పలత **"వేయర్ తఙ్గళ్ కులత్తుదిత్త విట్టుశిత్తన్‌కులమ్"** అనే నందనవనంలో ఆవిర్భవించింది. పెరియాళ్వార్ల కులం గోదాదేవి అవతారంవల్ల చాలా ఔన్నత్యాన్ని పొందిందని దీని తాత్పర్యం.

లత (తీగ) ఏదైనా ఒక ఉపఘ్నాన్ని ఆలంబనంగా చేసికొంటే తప్ప నిలువ లేదు. అదే రీతిలో ఈ గోదాదేవి అనే లతకూడా శ్రీరంగనాథుడనే కల్పవృక్షాన్ని ఆశ్రయించుకొని, చుట్టుకొని ప్రకాశిస్తూ ఉంటుంది. **"ఎనక్కే తన్నై త్తన్ద కఱ్పకమ్"**

(నాకే తనను అనుగ్రహించిన కల్పకం) అని ఆళ్వార్లు తిరువాయ్‌మొழి ప్రబంధంలో భగవానుని అపూర్వ కల్పవృక్షంగా అభివర్ణించడాన్ని గమనించవచ్చు. అమరకోశంలో **"పంచైతే దేవతరవో మందారః పారిజాతకః, సంతానః కల్పవృక్షశ్చ పుంసి వా హరి చందనమ్"** అని అంటూ అయిదు వృక్షాలు దేవవృక్షాలుగా చెప్పబడినవి అని, వాటిలో ఏదైనా ఒక వృక్షాన్ని నిర్దేశించినా, అన్నీ చెప్పబడ్డాయని కవి సమయం. **"శ్రీరంగరాజ ఏవ హరిచందనః కల్పవృక్షః, తేన సహ యోగేన నిత్యసంయోగేన రమణీయామ్"** అని ఇచటి విగ్రహవాక్యం. **"మానిడవర్‌క్కెన్ఱు ప్పేచ్చుప్పడిల్ వాழకిల్లేన్"** (మానవులకోసమనే మాట వినబడితే బతుకలేను) అనే నిశ్చయాన్ని పల్కిన రీతిలోనే భగవానుని కాంతునిగా పొంది ఆనందించిందని భావం.

**"సాక్షాత్ క్షమా"** అనే ప్రయోగం ద్వ్యర్థకప్రయోగం. క్షమా అనే పదం భూమికి వాచకం. ఓర్పుకు- అంటే- క్షమాగుణానికి కూడా వాచకం. ఈ రెండర్థాలు ప్రకృతంలో వివక్షితాలే. గోదాదేవి యోనిజ కాదు. సీతాదేవివలె భూమినుండి ఆవిర్భవించింది. కనుక, భూమి పిరాట్టియొక్క అంశావతారంగా చెప్పబడుతున్నది. అందువల్ల భూమి అనే అర్థం ఇక్కడ వివక్షితం. సర్వంసహ అయిన ఆ భూదేవిగుణం క్షమ. ఇది ఈమెకు భగవత్పత్నీత్వప్రయుక్తపురుషకారత్వైకాంతికం. కనుక ఆ అర్థంకూడా ప్రకృతంలో వివక్షితమే.

**"కరుణయా అన్యామ్ కమలామివ-స్థితామ్"** - ఆ క్షమాగుణానికి సైతం జన్మస్థానం అయిన కరుణ గోదాదేవిపట్ల గూడుకట్టుకొన్న తీరును చూస్తే **"దేవ్యా కారుణ్యారూపయా"** అని కీర్తింపబడే లక్ష్మీదేవి స్వయంగా ఈ విధంగాకూడా ఒక రూపాన్ని పొందింది కాబోలు ! అనే రీతిలో ఉంటుందని భావం. **"అల్లినాళ్ తామరై మేల్ ఆరణజ్గిన్ తుణవి'** కదా ! అందువల్ల ఇటువంటి గోదాదేవిని శరణు పొందుతున్నాను- అని అన్నట్లయినది.

ఈ శ్లోకంనుండి మొదటి ఇరవై ఏడు శ్లోకాలు వసంతతిలకవృత్తంలో కూర్చబడ్డాయి. **"ఉక్తం వసంతతిలకం తభజా జగైకః"** అని ఆ వృత్తలక్షణం తెలుపబడింది.

2. వైదేశికః శ్రుతిగిరామపి భూయసీనాం
వర్ణేషు మాతి మహిమా న హి మాదృశాం తే ।
ఇత్థం విదంతమపి మాం సహసైవ గోదే !
మౌనద్రుహో ముఖరయంతి గుణాస్త్వదీయాః ॥



గోదే = ఓ గోదాదేవీ !, భూయసీనాం శ్రుతిగిరామ్ అపి = పలు పలు వేదవాక్యాలకు సైతం, వైదేశికః = అందనిది అయిన, తే మహిమా = నీ గొప్పతనం, మాదృశాం = నావంటివారియొక్క, వర్ణేషు = అక్షరాలలో, న హి మాతి = అణగి ఉండదుకదా !, ఇత్థం = ఈ విధంగా, విదంతమ్ అపి = తెలిసికొంటున్నవాడను అయినా, మాం = నన్ను, త్వదీయాః గుణాః = నీ కల్యాణగుణాలు, మౌనద్రుహః సంతః= (నా) మౌనాన్ని అపహరిస్తున్నవై, సహసా ఏవ =బలాత్కారంగానే, ముఖరయంతి = (నన్ను) ఎక్కువగా పలికేటట్లు చేస్తున్నవి.

భగవానుని మహిమ, ఏవిధంగా వేదాలచేత పరిచ్ఛేదించడానికి, ఇంతటిది అని తెలియడానికి సాధ్యం కాదో, ఆ విధంగానే పిరాట్టి (లక్ష్మీదేవియొక్క) మహిమ కూడా వేదాలకు అపరిచ్ఛేద్యం - అనే విషయం సర్వసమ్మతం. గోదాదేవి భూదేవియొక్క అంశమనేదికూడా సర్వసమ్మతం. అందువల్ల "వేదాలకుకూడా ఇదమిత్థంగా నిశ్చయించి పలుకలేని నీ మహిమను అల్పజ్ఞుణ్ణి అయిన నేను వర్ణించాలని అనుకోవడం తెలివితక్కువతనం". అని అనుసంధించడంతగినది అని తలచి, ఆ విధంగా అనుసంధించిన శ్రీదేశికులు - "నేను ఈ స్తుతిని విన్నవించాలని ప్రారంభించడం వ్యర్థమైన ప్రయత్నంగా కన్పిస్తున్నదే!" అనే అర్థాన్ని పూర్వార్ధంలో వ్యక్తం చేసి, వెంటనే తామే సమాహితులై స్తుతించడంలో ప్రవర్తించిన రీతిని శ్లోకం ఉత్తరార్ధంలో తెలుపుతున్నారు.

గోదాదేవీ! నీ కల్యాణగుణాలకు అన్నిటినీ వర్ణించాలనే గంపెడాశతో నేను ప్రవర్తిస్తున్నాను. నీ కల్యాణగుణాలు మూగవానినికూడా మాటలాడించగల్గినవి. కనుక, స్వేచ్ఛగా స్తుతితో ప్రవర్తించాలనే భావన లేని నన్నుకూడా అవి బలాత్కారంగా ప్రేరేపిస్తున్నాయి కనుక పరవశుడనై నీ స్తుతిలో ప్రవర్తిస్తున్నాను- అని భావం.

**"శ్రుతిగిరా మపి అవిషయైః"** - అని ప్రయోగించవలసినచోట తత్పర్యాయంగా **"వైదేశికైః"** అని ప్రయోగించడం ఒక గంభీరమైన కవితాచమత్కారం. **"వైదేశికః"- "విభిన్నదేశవర్తీ"** అని భావం. **"నాన్మఱైకళ్ తేడి యెన్ఱుమ్ కాణమాట్టా చ్చెల్వన్"** (నాల్గువేదాలు వెదకిన ఏనాటికీ అంతు దర్శించలేని కల్యాణగుణసంపన్నుడు) అనే ఆళ్వార్ల ప్రయోగంవంటిదే ఇది. **"భూయస్యః - అత్యంతం బహ్వ్యః భూయస్యః, తాసామ్ భూయసీనామ్"** అని విగ్రహవాక్యం. **"వర్ణేషు"** అనే పదానికి స్తుతులలో అనే అర్థాన్ని చెప్పడంకూడా పొసగుతుంది. **"వర్ణో ద్విజా దౌ శుక్లాదౌ స్తుతౌ వర్ణం తు వాఽక్షరః"** అని అమరకోశవచనం. **"మౌనద్రుహః"** - నేను మౌనంగా నోరు

తెలివకుండా ఉండడాన్ని చూచి సహించలేనివి- అని దీని భావం. ఇదికూడా ఒక చమత్కారమైన కవితాప్రయోగం.

3. త్వచ్ఛ్రేయసః శ్రవణయోరమృతాయమానాం
తుల్యాం త్వదీయమణినూపురశింజితానామ్ ।
గోదే! త్వమేవ జనని! త్వదభిష్టవార్హాం
వాచం ప్రసన్నమధురాం మమ సంవిధేహి ॥

జనని = తల్లీ! గోదే = గోదాదేవీ!, త్వచ్ఛ్రేయసః = నీ వల్లభుడైన భగవానుని యొక్క, శ్రవణయోః = చెవులకు, అమృతాయమానాం = అమృతంవలె భోగ్యమైనది, త్వదీయ మణినూపురశింజితానాం = నీ, రత్నాలు పొదిగిన పాదమంజీరాల మధుర ధ్వనులకు, తుల్యాం = సాటి వచ్చేది, త్వత్+అభిష్టవ +అర్హాం = నిన్ను స్తుతించడానికి తగినది, ప్రసన్నమధురాం = ప్రసన్నమధురమైనది అయిన, వాచం = వాక్కును, త్వమ్ ఏవ = నీవే, మమ= నాకు, సంవిధేహి = అనుగ్రహించాలి.

ఈ స్తుతి గోదాదేవియొక్క అనుగ్రహంవల్లనే పరమభోగ్యంగా రూపొందింది- అనే విషయాన్ని ఈ శ్లోకం ద్వారా దేశికులు ధ్వనింపజేస్తున్నారు. శ్రీపరాశరభట్టర్ శ్రీగుణరత్నకోశంలో- "శ్రియః శ్రీః ! శ్రీరంగేశయ ! తవ చ హృద్యాం భగవతీం శ్రియం త్వత్తోప్యుచ్చైః వయమిహ ఫణామః శ్రుణుతరామ్, దృశౌ తే భూయాస్తాం సుఖతరలతారే శ్రవణతః పునర్హర్షోత్కర్షాత్ స్ఫుటతు భుజయోః కంచుకశతకమ్" (లక్ష్మికి లక్ష్మి అయినవాడా! శ్రీరంగశాయీ! నీకు మనోహారిణి, పూజ్యురాలు అయిన లక్ష్మిని నీకంటే అధికురాలిగా మేము ఇపుడు పల్కుతున్నాము. బాగా విను. నీ నేత్రాలు ఆనందంతో చలించే కనుపాపలను కల్గినవి కావాలి. లక్ష్మీదేవి స్తుతిని వినడంవల్ల తిరిగి సంతోషాతిశయంతో నీ భుజాలలో వందలాది కంజుకాలు (చొక్కాలు) చినిగిపోయేటట్లు నీవు ఉప్పొంగాలి) అనే శ్లోకంతో తెలిపిన అర్థాన్ని ప్రకృతశ్లోకంలో శ్రీదేశికులు అనుగ్రహిస్తున్నారు. భగవానుడుకూడా ఈ స్తుతిని ఆలకించి మనస్సులో చాలా ఆనందించాడని భావం. గోదాదేవి తన కాలి అందెలు ధ్వనించేటట్లుగా నడిస్తే ఆ ధ్వని ఎంత ఉంటుందో, అంత భోగ్యంగాను ఈ స్తుతిలోని శబ్దసన్నివేశం ఉంటుంది- అనేది రెండవ పాదంలోని సారార్థం.

"ప్రసన్నమధురామ్"- వివక్షితమైన అర్థాన్ని చాలా ప్రయాసపడి తెలిసికోవలసిన అక్కఱ లేకుండా సులభంగాను, స్ఫుటంగాను తెలిసికోవడానికి తగినట్లు రచింపబడడం ప్రసన్నత్వం. నారికేళపాకంగా ఉండకుండా ద్రాక్షాపాకంగా ఉండడం మాధుర్యం.



4. కృష్ణాన్వయేన దధతీం యమునాఽనుభావం
తీర్థై ర్యథావదగాహ్య సరస్వతీం తే ।
గోదే! వికస్వరధియాం భవతీకటాక్షాత్
వాచః స్ఫురన్తి మకరన్దముచః కవీనామ్ ॥

గోదే = ఓ గోదాదేవీ !, కృష్ణాన్వయేన = శ్రీకృష్ణుని సంబంధంతో, యమునానుభావం దధతీం = యమునానదియేనా ఇది ! అనేటట్లుగా ఉండే, తే సరస్వతీం = నీ వాక్కును (దివ్యప్రబంధాన్ని), తీర్థైః= సదాచార్యులచేత, యథావత్ అవగాహ్య = యథాతథంగా తెలిసికొని, భవతీకటాక్షాత్ = నీ కటాక్షంతో, వికస్వరధియాం = బుద్ధివికాసను కల, కవీనాం =కవులకు, మకరందముచః = మకరందాన్ని వర్షించే, వాచః = వాక్కులు, స్ఫురంతి = స్ఫురిస్తున్నది.

శ్రీకృష్ణుని స్వరూపరూపగుణ విభూతులనుగూర్చి వివరంగా పల్కిన తిరుప్పావైను, నాచ్చియార్ తిరుమొழிని ఉద్దేశించి శ్రీదేశికులు "తే సరస్వతీమ్" అని అన్నారు. "సరస్వతీ" అనే పదం, వాక్కుకు వాచకమైనట్లే, ఒక నదీవిశేషానికి కూడా వాచకం కనుక, ఆ అర్థంకూడా ఇక్కడ తంత్రేణ వివక్షితం. సరస్వతివలె ఉన్నా, యమునవలె ఉన్నది అనే ఒక చమత్కారార్థాన్ని మొదటి పాదంలో చూపుతున్నారు. అంటే- వీరు స్వయంగా యతిరాజసప్తతిలో "విగాహే యామునం తీర్థం సాధుబృందావనే స్థితమ్, నిరస్తజిహ్మగస్పర్శే యత్ర కృష్ణః కృతాదరః" (నిరసింపబడ్డ సర్పాల సంబంధాన్ని కల్గినది (వక్రబుద్ధుల సంబంధాన్ని కల్గినది) అయిన ఏ నీటిలో శ్రీకృష్ణుడు ఆదరాన్ని పొందాడో, గొప్ప బృందావనంలో (సాధు జననం రక్షణలో, స్థిరబుద్ధిని కల ఆయామునులనే (శ్రీకృష్ణుడనే) పవిత్రులైన ఆచార్యుల రూపంలోని యమునానదీతీర్థంలో అవగానించి, అభినివేశాన్ని పొందు తున్నాను) అని పల్కిన రీతినిబట్టి, శ్రీభాగవతాదికథాప్రసిద్ధివైఖరినిబట్టి యమున శ్రీకృష్ణుని సంబంధాన్ని కల్గినది; కృష్ణవర్ణ సంబంధాన్ని కల్గినది- అనే అర్థంకూడా శబ్దసందర్భం వల్ల స్ఫురిస్తుంది. యమునానదీజలాలు నల్లనివి అనికదా ప్రసిద్ధి. గోదాదేవి సరస్వతికి గల కృష్ణాన్వయాన్నిగూర్చి ప్రత్యేకంగా చెప్పవలసి ఉన్నదా! ప్రతి పాశురంలోను శ్రీకృష్ణగుణానుభవమేకదా ఉంటుంది. అందువల్ల ఇటువంటి సరస్వతిని-

(తీర్థైర్యథావదవగాహ్య) - నదుల లోపలకు దిగడానికి తగిన రేవులకు తీర్థాలని పేరు. ఆచార్యులకుకూడా తీర్థాలని పేరు.

ఇక్కడ గోదాదేవియొక్క సూక్తిని సరస్వతీశబ్దంతో నిర్దేశించిన రీతికి అనురూపంగా **"తీర్థైర్యథావదవగాహ్య"** అనే పదాలను ప్రయోగించడం అత్యంతం రసావహం. మహానదులలో రేవు కాని చోట దిగితే అపాయమే కల్గుతుంది. తగిన రేవులలో దిగి, స్నానం చేసే ఫలాన్ని పొందాలి. అదే రీతిలో ఈమె ప్రబంధాలలోకూడా సదాచార్యముఖంగా అవగాహిస్తే తప్ప గొప్ప గొప్ప అర్థాలను పొందడానికి సాధ్యం కాదని భావం. గోదాదేవియొక్క దివ్యసూక్తులు అత్యంతం గంభీరాలైన అర్థాలను కల్గినవి కాబట్టి, వాటిని పైపైన గమనించినందువల్ల తగిన ఫలాన్ని పొందలేరు. బాగా లోతుగా పరిశీలించినవారికే వాటిలోని అరుదైన అర్థాలు లభిస్తాయి అనే భావాన్ని **"అవగాహ్య"** - అనే పదంద్వారా దేశికులు స్ఫురింపజేశారు. ఈ రీతిలో గోదాదేవియొక్క దివ్యసూక్తులలో అవగాహించేవారికి ఆమె కటాక్షమూలంగా సద్బుద్ధి వికసించి అభివృద్ధమవుతుంది -అని, అటువంటి వారు తేనెకంటే తీయని మధురవాక్కులను రచించగల్గిన సామర్థ్యాన్ని పొందుతారని శ్లోకం ఉత్తరార్ధంలో తెలుపబడింది. **"గోదా"** అనే పదం గోదావరీనదికికూడా వాచకంగా నిఘంటువులలో ఉన్నది. అందువల్ల ఈ శ్లోకంలో **"గోదావరీ, కృష్ణా, యమునా, సరస్వతీ"** అనే పుణ్యనదుల పేర్లను చేర్చి శ్రీదేశికులు రచించిన సొబగు సహృదయహృదయైక భావ్యం. సమాసోక్తి అలంకారప్రకారాలలో ఇది ఒక ప్రకారమని ఆలంకారికులు అంటారు. ఈ స్తోత్రంలోనే రాబోయే **"ప్రాయేణ దేవి! భవతీవ్యపదేశయోగాత్"** అనే పన్నెండవ శ్లోకంలో **"యస్యాం సమేత్య సమయేషు చిరం నివాసాత్ భాగీరథీ ప్రభృతయోఽపి భవంతి పుణ్యాః"** అని గోదావరీనదిని గూర్చిన ఒక పౌరాణిక వృత్తాంతాన్ని శ్రీదేశికులు ఉట్టంకించారు. కృష్ణా, యమునా, సరస్వతీ, కావేరీ-ఇత్యాది నదులు కొన్ని విశేష సమయాలలో గోదావరీ నదిలో నివాసాన్ని పొంది పవిత్రాలు అవుతున్నది- అనే ఇతిహాసం దానిలో పేర్కొనబడింది. ఈ శ్లోకంలో ఆ నదులు గోదావరితో కలసి చేరినవని తెలిపే పదప్రయోగంతో ఆ వృత్తాంతం సూచించిన సౌందర్యంకూడా అనుభావ్యం.

5. అస్మాదృశా మపకృతౌ చిరదీక్షితానాం
అహ్నాయ దేవి ! దయతే యదసౌ ముకున్దః ।
తన్నిశ్చితం నియమిత స్తవ మౌళిధామ్నా
తన్త్రీనినాదమధురైశ్చ గిరాం నిగుమ్భైః ॥

దేవి = ఓ గోదాదేవీ!, అపకృతౌ = అపరాధాన్ని చేయడంలో, చిరదీక్షితానాం= చిరకాలంగా వ్రతాన్ని చేపట్టిన, అస్మాదృశాం = మావంటివారి విషయంలో, అసౌ



ముకుందః= ఈ భగవానుడు, అహ్నాయ = త్వరగా, దయతే = అనుగ్రహిస్తున్నాడు, యత్ తత్ = అనేది ఏది కలదో అది, తవ = నీయొక్క, మౌళిదామ్నా = శిరస్సులో ధరించిన పూమాలికతో, తంత్రీనినాద = వీణతీగెల మధురస్వనంవలె, మధురైః = తీయని, గిరాం నిగుంభైః = వాక్కుల సమూహాలతో, నియమితః = కట్టబడిన వాడైనందువల్ల అని, నిశ్చితమ్ = నిశ్చయింపబడింది.

గోదాదేవీ! భగవద్భాగవతాపచారాలలో చిరకాలంగా కూరుకుపోయిన నావంటివారి విషయంలో కూడా భగవానుడు శీఘ్రంగా అనుగ్రహిస్తున్నాడే ! దీనికి ఏమి కారణం? అని విచారించినపుడు, ఈ విధంగా నిశ్చయింపబడుతున్నది. (అది ఏమంటే) - నీవు ముడుచుకొని ఇచ్చిన పూమాలికచేత, పాడి అర్పించిన పాశుర మాలికచేత ఆ భగవానుడు వశుడైనందువల్లనే - అని (ఆ కారణం) నిశ్చయింపబడింది.

**"అన్న వయల్ పుదువై ఆణ్డాళ్ అరఙ్గఱ్కు పన్ను తిరుప్పావై పల్పదియమ్-ఇన్నిశైయాల్ పాడి కొడుత్తాళ్ నఱ్పామాలై, పూమాలై చ్చూడికొడుత్తాళై చ్చొల్లు"** (హంసలు సంచరించే సస్యక్షేత్రాలను కల శ్రీవిల్లిపుత్తూర్‌లో అవతరించిన గోదాదేవి శ్రీరంగనాథుని విషయంలో చక్కగా పల్కిన తిరుప్పావై అనే పలు పాశురాలను తీయని రాగంతో పాశురాల మాలికగా గానం చేసి సమర్పించింది. పూమాలికను తన కొప్పులో ముడుచుకొని సమర్పించింది. ఇటువంటి గోదాదేవిని ఓ మనసా! స్తుతించు) అనే తిరుప్పావై తనియన్ పాశురాన్ని ఇంచుమించుగా అనుసరిస్తూ ఈ శ్లోకంలోని ఉత్తరార్ధం రచింపబడింది. ఆణ్డాళ్ రెండు విధాలైన మాలికలతో భగవానుని కట్టివేసింది అని ఈ తనియన్‌లో చెప్పబడింది. **"శూడికొడుత్త నాచ్చియార్"** అని ఆమెకు సంప్రదాయంలో ప్రసిద్ధంగా వ్యవహరింపబడే తిరునామానికి చెందిన ఐతిహ్యాన్ని తెలిపే రీతిలో, **"స్వోచ్ఛిష్టాయాం స్రజి నిగళితం యా బలాత్కృత్య భుంక్తే"** (తాను ముడుచుకొని విడచిన ఆ మాలికచే బంధించి ఏ గోదాదేవి బలాత్కారంగా భగవానుని అనుభవించిందో) అని భట్టరు అనుగ్రహించిన రీతిలో తాను ముడుచుకొని తీసి ఇచ్చిన పూమాలలను స్వామికి ఇచ్చి, **"తొణ్డర్క్కు అముదుణ్ణ చ్చొల్‌మాలైకళ్"** (భక్తులకు అమృతంవంటి పాశురాల మాలికలను) ను పాడి సమర్పించి - ఈ విధంగా రెండు రీతులలోని మాలికలతో భగవానుని ఆనందింపజేసి, గోదాదేవి అతనిని తనకు సర్వాత్మనా విధేయునిగా చేసికొన్నది. మనవంటివారు అంతా భగవద్భాగవతాపచారాలలో చిరకాలంగా ఎల్లప్పుడు లగ్నమై ఉన్నా, ఆణ్డాళ్‌యొక్క అంతరంగవర్గానికి చెందినవారం కనుక,

మన దోషాలను స్వామి గమనించకుండా, ఆణ్డాళ్‌పట్ల తనకు గల ప్రేమకారణంగానే మనపట్లకూడా అనుగ్రహిస్తున్నాడు- అని ప్రకృతంలో శ్రీదేశికులు పల్కుతున్నారు.

క్రూరపాపాలను లెక్కలేకుండా చేసిన మనంకూడా గోదాదేవి అభిమానంలో ఒదిగి ఉంటే, భగవానుని కృపకు తప్పకుండా లక్ష్యం కాగలము- అనే విషయం ఇక్కడ శ్లోకంలో సూచింపబడింది.

**(అపకృతౌ)** - ఈ ప్రయోగంలోని ఏకవచనం జాత్యేకవచనం. పలు అపచారాలను ఇది లక్షిస్తుంది. "ఇటువంటివారి విషయంలో అపచారపడ్డాము" అని స్పష్టంగా శ్లోకంలో చెప్పబడకపోయినా, ప్రసంగవశాత్తు, భగవద్భాగవతవిషయంలో- అని అర్థసిద్ధం.

**(చిరదీక్షితానామ్)** - అనేకజన్మపరంపరలుగా ఇదే రీతిలో మనం అపచార పడుతున్నాము- అనే విషయం ఈ ప్రయోగంద్వారా సూచితం.

**(అహ్నాయ)** - ఇది అవ్యయపదం. వెంటనే- అని దీని అర్థం.

**(తంత్రీనినాదమధురైః)**- వీణతంత్రులనుండి వెలువడే తీయని నినాదంవలె గోదాదేవియొక్క దివ్యసూక్తులు మధురాలు - అని భావం. **"మున్నల్ యాழ்పయిల్ నూల్ నరమ్బిన్ ముదిర్ శువైయే"** అని అంటూ తిరువాయ్‌మొழி దివ్యప్రబంధంలో కూడా రాగమాధుర్యానికి తంత్రీనినాదాన్ని ఉదాహరణగా ఆழ்వార్లు పలికారుకదా!

**6. శోణాధరేఽపి కుచయోరపి తుఙ్గభద్రా**
**వాచాం ప్రవాహనివహేఽపి సరస్వతీ త్వమ్ ।**
**అప్రాకృతై రపి రసై ర్విరజాస్వభావాత్**
**గోదాఽపి దేవి ! కమితుర్నను నర్మదాఽసి ॥**

దేవి = గోదాదేవీ !, త్వం = నీవు, అధరే= (నీ) అధరంలో, శోణా + అపి = ఎఱ్ఱని రంగునుకల్గినదానివైనా, (శోణానదివి అయినా), కుచయోః = వక్షస్సులో, తుంగభద్రా అపి = గొప్ప బలిమిని కల్గిన దానివి అయినా, (తుంగభద్రానదివి అయినా), వాచామ్ = వాక్కులయొక్క, ప్రవాహనివహే = ప్రవాహాల సమూహంలో, సరస్వతీ అపి = సరస్వతీదేవివి అయినా, (సరస్వతీనదివి అయినా) అప్రాకృతైః = ప్రకృతి సంబంధం లేని, రసైః = భక్తిరసాలతో (తీర్థాలతో), విరజా అపి = రజోగుణం లేనిదానివి అయినా (విరజానదివి అయినా), కమితుః = నీ వల్లభుడైన స్వామికి, స్వభావాత్ = సహజంగానే, గోదా అపి = సూక్తులను అనుగ్రహించేదానివిగా, (గోదానదిగా), నర్మదా = పరిహాసాలను పలికేదానివిగా (నర్మదానదివిగా), అసి నను = ఉన్నావు కదా.



ఈ శ్లోకంలో పలు నదుల పేర్లు చమత్కారపరంగా ప్రస్తావింపబడ్డాయి.

ఓ గోదాదేవీ! నీవు శోణానదివి అయినా, తుంగభద్రానదివి. గొప్ప ప్రవాహాలతో ప్రవహించే సరస్వతీదేవి అయినా, ఈ సంసారలోకంలో లేని దివ్య తీర్థంతో నిండిన విరజానదివి, గోదావరినదివి, నర్మదానదివి -అని పరస్పర విరుద్ధమైన రీతిలో ఈ శ్లోకం రచింపబడడం గమనార్హం.

దీనిలో అంతరార్థమేమంటే - "గోదాదేవీ! నీ అధరం ఎఱ్ఱని రంగును కల్గి ఉన్నది. నీ స్తనాలు (జ్ఞాన, భక్తులు) గొప్ప వైభవంతో సుభగంగా ప్రకాశిస్తున్నవి. నీ అమృతవాక్కుల ప్రవాహాన్ని చూస్తే విద్యాదేవతగా ఆరాధింపబడే సరస్వతీదేవి నీవే అనేటట్లున్నది. నీవు నీ వల్లభుడైన భగవానునిగూర్చి పవిత్రమైన సత్త్వగుణాత్మకాలైన అనుభవాలతో, మనోరథాలతో నిండిన నీ రెండు ప్రబంధాల రూపంలో ఆ స్వామికి సాక్షాత్తు సమర్పించావు. ఇటువంటి వైభవంతో ప్రకాశించే నీవు నాయకుడైన భగవానునకు పలు పరిహాసవచనాలతో ఆనందాన్ని వృద్ధిచేస్తున్నావు"- అని.

**(అధరే శోణా)** - **"కోవైవాయాళ్"** అనే రీతిలో పండిన దొండపండువంటి అధరాన్ని కల్గినది- అని అర్థం. **"శోణా"** అంటే ఎఱ్ఱని- అని అర్థం.

**(కుచయోః తుంగభద్రా)** - **"కొఙ్గైమేల్ కుఙ్కుమత్తిన్ కుழம்బு அழியப் పుకున్దు ఒరు నాళ్ తఙ్గుమేల్ ఎన్నావి తఙ్గుమ్"** (నా స్తనాలపై పూయబడిన కుంకుమ పంకం పూర్తిగా చెదఱిపోయేటట్లుగా ఒకనాడు అతడు వచ్చి నాతో సంశ్లేషిస్తే, నా ప్రాణాలు నిలుస్తాయి) అని, **"కొఙ్గైమ్ములైకళ్ ఇడర్ తీర క్కోవిన్దఱ్కోర్ కుற్றేవల్, ఇమ్మైప్పిఱవి శెయ్యాతే ఇని ప్పోయ్ చ్చెయ్యుమ్ తవన్దానెన్?"** (నా స్తనాల ఆర్తి తీరేటట్లు గోవిందునకు అంతరంగ కైంకర్యాన్ని ఈ జన్మలోనే చేయకుండా తరువాత వేఱొక దేశాన్ని (పరమపదాన్ని) చేరి చేసే తపస్సు ఎందుకు?) అని గోదాదేవి స్వయంగా అనుగ్రహించిన రీతిలో స్తనతటాలలో భగవానుని సంశ్లేషమనే పరమప్రాప్యాన్ని పొందినందువల్ల గొప్ప క్షేమాన్ని కల్గినది- అని భావం. కుచాలకు తుంగమైన భద్రం (క్షేమం) ఏమంటే- భగవానుని నిత్యసంశ్లేషమేకదా !

**(వాచామ్ ఇత్యాది)** - ఆణ్డాళ్ దివ్యసూక్తులను పరిశీలించినపుడు "సాక్షాత్తు సరస్వతియొక్క ఆవిర్భావమే ఈమె" అనే రీతిలో తోస్తుంది. సరస్వతినది అయినా, విరజానదియై ఉన్నది- అని అనడంలో అర్థవిరోధం తోస్తుంది. దీనికి పరిహారం ఏవిధంగా అంటే- సరస్వతీశబ్దాన్ని నదీపరంగా గ్రహించకుండా, వాగధిష్ఠాన దేవతగా

గ్రహించాలి. "విరజాస్వభావాత్" అనే ప్రయోగంలో "విరజాః" అని విసర్గాంతంగా పదవిభాగాన్ని చేయాలి. "విగతం రజః యస్యాస్సా-విరజాః"- రజోగుణం లేనిది- అని భావం. దీనివల్ల తమోగుణరాహిత్యం కూడా అర్థాత్ సిద్ధం. శుద్ధసత్త్వగుణమే మూర్తీభవించినదని భావం.

**(స్వభావాత్)** - తులసి అంకురించేటపుడే సువాసనతో అంకురించేటట్లుగా సత్త్వగుణంతో ఆవిర్భవించినదని భావం. "స్వభావాత్" అనే పదాన్ని ముందుకు అన్వయించికూడా అర్థాన్ని చెప్పవచ్చు. అపుడు "స్వభావాత్ గోదా" అని అన్వయం. అర్థవిరోధం తోచేటపుడు "విరజా" అని అవిసర్గంగాను పదవిభాగం చేయడానికి తగిన రీతిలో పదప్రయోగంచేయబడడం గమనార్హం. విరజాపదానికి పిమ్మట **కచటతపేత్యాది** వర్ణాలతో కూడిన పదాలు ప్రయోగింపబడి ఉంటే ఈ విధంగా రెండు రీతులలో పదవిభాగాన్ని చేయడం వీలు కాదు. కాని, ఇక్కడ సకారాదిగా పదాన్ని "స్వభావాత్" అని ప్రయోగింపబడడంవల్ల, వినేటపుడు విసర్గం కల్గి ఉన్నట్లు, లేనట్లు- రెండు రీతులలో తోస్తుంది.

**(అప్రాకృతైః రసైః విరజాః)** - రసమనే పదం ఇక్కడ శ్లిష్టం. తీర్థానికి, ఆశకు రసమని పేరు. విరజానది అప్రాకృతజలలాతో నిండి ఉంటుంది. గోదాదేవి, ప్రాకృతపదార్థ గోచరం కాని (భగవదేక గోచరమైన) పలు రీతులలోని మనోరథాలను కల్గి ఉండడంవల్ల అనవద్య- అనే అర్థం ఇక్కడ వివక్షితం.

**(గోదా అపి నర్మదా అపి)** - 'గోదా' అనే పదం గోదావరికికూడా పేరు. కనుక, గోదావరీ నదిగా ఉన్నా, నర్మదా నదిపై ఉన్నావు - అనేది ఇక్కడ అర్థవిరోధం. దీనికి పరిహారం ఏవిధంగా ? అంటే, "గోదా" -గోద అనే తిరునామాన్ని కల్గినదానవై ఉన్నావు, 'కమితుః నర్మదా అపి" - "నర్మాణి దదాతి ఇతి నర్మదా" అనే వ్యుత్పత్తిని నర్మదా శబ్దానికి చెప్పాలి. "నర్మ" అనే పదం శృంగారలీలను, పరిహాసోక్తిని తెల్పుతుంది. భగవానునకు శృంగారలీలను ఇస్తుంది అని, ప్రణయదశలో స్వామితో పరిహాసోక్తులను వినోదంగా పల్కుతుంది- అని ఇక్కడ భావాన్ని చెప్పవచ్చు.

ఈ శ్లోకంలో "అపి" శబ్దాన్ని ప్రయోగింపబడిన తీరును గమనించాలి. "**శోణా అపి తుంగభద్రా, తుంగభద్రా అపి సరస్వతీ, సరస్వతీ అపి విరజా, విరజా అపి గోదా, గోదా అపి నర్మదా**" అని ఈ రీతిలో వాక్యవిన్యాసం శ్రీవేదాంతదేశికులకు వివక్షితమని చెప్పవచ్చు. ఈ శ్లోకంలో విరోధాభాసం, ఉల్లేఖం, శ్లేష- అనే అలంకారాలు సంకీర్ణాలుగా ప్రయోగింపబడిన అందం వాచామగోచరం.



7. **వల్మీకతః శ్రవణతో వసుధాత్మనస్తే**
**జాతో బభూవ స మునిః కవిసార్వభౌమః ।**
**గోదే ! కిమద్భుత మిదం యదమీ స్వదన్తే**
**వక్త్రారవిన్దమకరన్దనిభాః ప్రబన్ధాః ॥**

గోదే = గోదాదేవీ!, వసుధా +ఆత్మనః = భూదేవి అవతారం అయిన, తే = నీయొక్క, శ్రవణతః = చెవినుండి, జాతః = పుట్టిన, సః మునిః = ఆ వాల్మీకిముని, కవిసార్వభౌమః = కవిచక్రవర్తి అయిన, బభూవ = అయినాడు, వక్త్ర+అరవింద = ముఖం అనే తామరనుండి స్రవించే, మకరంద = తేనెతో, నిభాః = పోలిన, అమీ ప్రబంధాః = ఈ ప్రబంధాలు, స్వదంతే = చాలా మధురంగా ఉన్నాయి. యత్ ఇదం = అనే ఇది, కిమ్ అద్భుతమ్ = ఏమి ఆశ్చర్యం!

గోదాదేవీ! భూమిలో ఉండే మట్టిపుట్ట భూదేవికి చెవి -అని వేదం పల్కింది. నీవు భూదేవియొక్క అంశభూతురాలవు. కనుక, పుట్ట నీకు చెవి. ఆ పుట్టనుండి పుట్టినవాడు వాల్మీకిమహర్షి. అతడు కవిచక్రవర్తిగా స్తుతింపబడుతున్నాడు. నీ చెవి అనే పుట్టనుండి పుట్టిన వాల్మీకియే అద్భుతమైన శ్రీసూక్తిగా పొగడబడే శ్రీమద్రామాయణాన్ని పాడి కవులలో ప్రాథమ్యాన్ని, ప్రాధాన్యాన్ని పొందగా, నీముఖం నుండి సాక్షాత్తు వెలువడే ప్రబంధాలు తామరనుండి స్రవించే తేనెవలె భగవానునకు, లోకంలోనివారికి దివ్యామృతంగా భాసించి పరమభోగ్యంగా ఉండడంలో ఏమి ఆశ్చర్యం!

తైత్తిరీయ యజుర్వేదారణ్యకంలో "శ్రోత్రం హ్యేత పృథివ్యాః, యద్వల్మీకః" అని అధ్యయనం చేయబడుతున్నది. దీని అర్థం. ఏమంటే భూమిలో కన్పించే పుట్ట భూదేవికి చెవి అని. ఆణ్డాళ్ భూదేవియొక్క అవతారం కనుక, ఆమెను భూమి అని అభేదవ్యపదేశం చేయవచ్చు. కనుక, పుట్ట ఆమె చెవి. దీనివల్ల పుట్ట నుండి పుట్టిన వాల్మీకి మునివరుడు గోదాదేవి కర్ణంనుండి పుట్టినవాడని చెప్పడానికి ఉపపత్తి ఉన్నది. (కనుక వేదాంతదేశికులు ఈవిధంగా అంటున్నారు)

గోదాదేవీ! ఈ విధంగా నీ కర్ణంనుండి ఆవిర్భవించిన ఒకడు, కవి సార్వభౌముడని లోకంలో అంతట ప్రసిద్ధిని పొందడం, ఆ మునివరుని ప్రబంధం అయిన శ్రీరామాయణం మధురమైనదని ప్రసిద్ధిని పొందడం కాదని అనడానికి, లేదని అనడానికి సాధ్యం కాని విషయాలు. లోకంలో ఒకని చెవిలోనుండి పుట్టిన వస్తువు ఇంతటి గొప్పతనాన్ని కల్గి ఉండడం అప్రసిద్ధం. కాని, నీ కర్ణప్రభావం లోకవిలక్షణం.

నీ చెవిగొప్పతనమే ఇంత విలక్షణమైనది అయినపుడు, ఇక నీ వాక్కు గొప్పతనాన్ని గూర్చి ఏమని చెప్పగలం! నీ ముఖాన్ని చూస్తే అది అరవిందంగా భాసిస్తున్నది. అరవిందం నుండి మకరందం జాలువారడం సహజమే కనుక, మకరందంవంటి దివ్యప్రబంధాలు నీ వాక్కునుండి ఆవిర్భవించాయి- అని అనడంలో ఆశ్చర్యంలేదు సుమా! శ్రీరామాయణానికి కల్గిన భోగ్యతనుగూర్చి కొంచెం ఆశ్చర్యపడాలి తప్ప- నీ దివ్యప్రబంధాలకు ఏర్పడిన భోగ్యతనుగూర్చి కొంచెంకూడా ఆశ్చర్యపడవలసిన పని లేదు- అనేది సారార్థం. దీనివల్ల వాల్మీకికోకిలయొక్క సూక్తులకంటే **"కిళిమొఴి"** అయిన గోదాదేవి శ్రీసూక్తులే మిక్కిలి మధురాలు- అనే విషయం సుస్పష్టం.

**8. భోక్తుం తవ ప్రియతమం భవతీవ గోదే !**
**భక్తిం నిజాం ప్రణయభావనయా గృణన్తః ।**
**ఉచ్చావచై ర్విరహసంగమజై రుదన్తైః**
**శృఙ్గారయన్తి హృదయం గురవస్త్వదీయాః ॥**

గోదే = గోదాదేవీ! త్వదీయాః గురవః = నీ తండ్రి అయిన పెరియాఴ్వార్లు మొదలైన పెద్దలు, తవ ప్రియతమం = నీకు చాలా ఇష్టుడైన భగవానుని, భవతీ ఇవ = నీవలె, భోక్తుం = అనుభవించడంకోసంగా, నిజాం = తమయొక్క, భక్తిం= భక్తిని, ప్రణయభావనయా = ప్రణయమనే భావనతో, గృణంతః (సంతః) = పలికేవారై, ఉచ్చావచైః = పలు విధాలైన, విరహసంగమజైః = విశ్లేష-సంశ్లేషాలవల్ల ఏర్పడే, ఉదంతైః = వృత్తాంతాలనుగూర్చి పల్కడంతో, హృదయం = తమ హృదయాలను, శృంగారయంతి = శృంగారరసాన్ని కల్గినవిగా చేసికొంటున్నారు.

గోదాదేవీ! నీవు సహజంగానే స్త్రీ రూపంలో ఆవిర్భవించినందువల్ల, మగవాడైన భగవానుని పలు రీతులలో సేవించి ఆనందించడానికి నీకు తగిన సంబంధం, యోగ్యత, వరుస ఉన్నది. నీతండ్రి అయిన పెరియఴ్వార్లు మొదలైన దివ్యసూరులు జన్మతః పురుషులు. వారు నీ ప్రియుడైన భగవానుని నీవు అనుభవించేటట్లే అనుభవించాలనే గొప్ప ఆశను పొందారు. సహజంగా మగవారైన వారికి ఇది సాధ్యమవుతుందా? తగినది అవుతుందా? అందువల్ల వారు ఒక ఉపాయాన్ని ఆలోచించారు. వారు తమనే స్త్రీగా (నాయకిగా) భావించి, స్త్రీత్వాన్ని తమలో ఆరోపించుకొన్నారు. తమకు భగవానుని పట్లగల భక్తినే ప్రణయంగా భావించారు. అందువల్ల భగవానుని విశ్లేషించడం, తిరిగి సంశ్లేషించడం, దూత్యం పంపడం, మడల్ ఎత్తడం - మొదలైన పలు రీతులలోని అవస్థలలో పలు విధాలైన భావాలను



అనుభవించారు. ఆ అనుభవాల పర్యవసానంగా తమ పాశురాలలో ఆ ఉదంతాలను గూర్చి పాడారు. అందువల్ల సహజంగానే స్త్రీగా పుట్టిన నీకు భగవానుని పట్ల గల అనుభవం వారి అనుభవంకంటే సహజమైనది, గొప్పది. కనుక, అది ఇటువంటిది, ఇంతటిది అని మావల్ల స్తుతించడం సాధ్యమౌతుందా?

గోదాదేవి జన్మతః స్త్రీ. పురుషుని వేఱొక పురుషుడు అనుభవించడంకంటే, స్త్రీ అనుభవించడం తగిన విషయం. అందువల్ల, ఈమె దివ్యప్రబంధంలోని **"ఊనిడైయాఴి శఙ్గుత్తమత్కెన్ఱు ఉన్నిత్తెఴున్ద ఎన్ తడములైకళ్"** (తన దివ్యదేహంలో శంఖ చక్రాలను కల స్వామికోసమే - అని ఆదరంతో వృద్ధిచెందిన నా పీనస్తనాలు) అని, **"కొఙ్గైమేల్ కుఙ్కుమత్తిన్ కుఴమ్బుఴియ ప్పుకున్దు ఒరు నాళ్ తఙ్గమేల్ ఎన్నావి తఙ్గు మెన్ఱురైయీరే"** అని, **"కొళ్ళుమ్ పయనొన్ఱిల్లాత కొఙ్గైతన్నై క్కిఴఙ్గోడుమ్, అళ్ళిప్పఱిత్తిట్టవన్ మార్బిలెఱిన్దు ఎన్నఴలై త్తీర్వేనే"** (నిరుపయోగమైన ఈ నాస్తనాలను సమూలంగా పెరికివేసి, అతని వక్షస్సును అధిరోహించి, నా దుఃఖాన్ని పోగొట్టుకొంటాను), **"కొమ్మైములైకళ్ ఇడర్ తీర"** అని గల పాశురాలు తగినవిగాను, సహృదయహృదయావర్జకాలుగాను ప్రకాశిస్తున్నాయి. ఈ విధంగా గోదాదేవివలె పురుషోత్తముని మనంకూడా అనుభవించాలిహా మనంకూడా పాశురాలను పలకాలి- అని ఆశ పడిన ఆఴ్వార్లు ఏమి చేశారు? అని అంటే, 'పరమపురుషుని విషయంలో తమకు గల భక్తిని నాయకుని విషయంలో నాయకి పొందే అనురాగసమాధిలో కూర్చి, తాము స్త్రీభావనను కలవారై, భగవానునితో సంశ్లేషించే, విశ్లేషించే అవస్థలను పొంది, ఆ సంశ్లేష-విశ్లేషాలకు తగిన పాశురాలను పల్కి, ఈ విధంగా తమ హృదయాలను శృంగారరసైకతానంగా చేసికొన్నారు.

దీనివల్ల, అనుకరణరీతిలో సాగిన ఆఴ్వార్ల భగవదనుభవంకంటే, తనకు సహజమైనది. అయిన ఆణ్డాళ్ యొక్క భగవదనుభవం రసవత్తరం- అనే విషయం స్పష్టపడుతున్నది.

ద్రవిడోపనిషత్తాత్పర్యరత్నావళిలో **"పత్యౌ పద్మాసహాయే ప్రణయిని భజతః ప్రేయసీపారతంత్ర్యం భక్తిః శృంగారవృత్త్యా పరిణమతి మునేః భావబంధప్రథిమ్నా"** అని అంటూ శ్రీదేశికులు తామే స్వయంగా పల్కిన శ్లోకం ఇక్కడ రెండవ పాదానికి అనుగుణంగా అనుసంధేయం.

**"భవతీ చ"** అనే ప్రయోగంలో **"ఉపమేయాత్ శతగుణముపమానమ్"** అనే ఆలంకారికసమయం స్మరణీయం. ఆఴ్వార్ల అనుభవానికి ఆణ్డాళ్ అనుభవాన్ని

ఉపమానంగా చెప్పినందువల్ల, దీనికి గల అతిశయం సుస్పష్టంగా భాసిస్తున్నది. **(ఉచ్చావచైః)** - **"ఉచ్చావచం నైకభేదమ్"** అని అమరకోశనిఘంటుసూక్తి. నమ్మాళ్వార్లు, పెరియాళ్వార్లు, తిరుమంగైమన్నన్ మొదలైనవారి దివ్యసూక్తులలోని **"అఙ్గైత్తైయ మడనారాయ్", "ఆడియాడి"** మొదలైన దశకాలలో వారి భగవత్సంశ్లేష-విశ్లేషాలను గమనించవచ్చు. విశ్లేషదశలో - దూతప్రేషణం, మడల్ ఎత్తడం, ఆక్రందించడం- మొదలైన పలు రీతులను, సంశ్లేషదశలోకూడా ఈ విధంగా భిన్నభిన్న రీతులు ఉండడంవల్ల **"ఉచ్చావచైః"** అని పలుకబడింది.

**"గురవస్త్వదీయాః"** అనే ప్రయోగంలోని వివక్షితాంశాలు కొన్ని ఉన్నాయి. ఇక్కడ ప్రయోగింపబడ్డ గురుశబ్దం పితృపర్యాయం. **"పెరియాళ్వార్ పెఱ్ఱెడుత్త పెణ్పిళ్ళై వాళియే"** అని ప్రతిదినం శ్రీవైష్ణవలోకం అనుసంధించే వాళిత్తిరునామాను సారంగా ఆణ్డాళ్ పెరియాళ్వార్ల కుమార్తెగా ప్రసిద్ధి చెందినా, ఆళ్వార్లు పదిమందికి ఈమె జ్ఞానపుత్రిక అని పూర్వాచార్యులంతా ఏకకంఠంగా అభిప్రాయపడ్డారు. దానిని అనుసరించియే శ్రీదేశికులు **"గురవస్త్వదీయాః"** అని అన్నారు. మణవాళ మహామునులు కూడా ఉపదేశరత్తినమాలైలో **"అఞ్జుకుడిక్కు ఒరు శన్తతి"** అని గోదాదేవినిగూర్చి పలికారు. **"అఞ్జుకుడి"** అనే ప్రయోగానికి రెండు విధాలైన అర్థాలను చెప్పవచ్చు. పొయ్‌కై ఆళ్వార్ల మొదలు పెరియాళ్వార్లవరకు గల ఆళ్వార్లను లెక్కిస్తే ఆ ఆళ్వార్ల కులం అయిదు- అని తెలుస్తున్నది. ఏవిధంగా అంటే- పొయ్‌కైఆళ్వార్లు, పూదత్తాళ్వార్లు, పేయాళ్వార్లు- అనే ముగ్గురు కలిసి ఒక కులం. తిరుమళిశైప్పిరాన్, నమ్మాళ్వార్లు, కులశేఖరాళ్వార్లు, పెరియాళ్వార్లు- అనే నల్గురు నాల్గు కులాలు. ఈ విధంగా **"అఞ్జుకుడి"** అని అంటూ గోదాదేవికి ముందు అవతరించిన ఆళ్వార్లవరకు చెప్పినట్లయింది. వారికి అందఱికి ఏకైక జ్ఞానపుత్రికగా అవతరించినది గోదాదేవి- అనేది ఒక అర్థనిర్వాహం. ఇక, రెండవ అర్థనిర్వాహం ఏమంటే- **"అఞ్జుకుడి"** అనే దానికి **"అఞ్జుకిన్ఱ కుడి"** (భయపడే కులం) అనే అర్థాన్ని చెప్పి, ఆళ్వార్లుగా పదిమందిని గ్రహించడం ఇంకొకటి. ఈఅర్థంలో పైప్రయోగం. **"విన్ఱైత్తొకై"** (కృదంతపదాన్ని విశేషణంగా కల్గిన కర్మధారయసమాసం.) భగవానునకు ఏమి కీడు మూడుతుందో! అనే అస్థానే భయశంకను పొందే స్వభావం పెరియాళ్వార్లకు చాలా ఎక్కువగా ఉన్నా, పదిమందికి ఆ భయం సాధారణం. ఈ విషయం **"మఙ్గళాశాసనత్తిల్ మఱ్ఱుళ్ళ ఆళ్వార్కళ్ తఙ్గళార్వత్తళవుతానన్ఱి"** (మంగళాశాసనం చేయడంలో మిగిలిన ఆళ్వార్లకు కల ఆశ పరిమితిలో కాకుండా) అనే ఉపదేశరత్తినమాలై పాశురంలోనే చక్కగా స్పష్టం. పెరియాళ్వార్లకువలె పొంగే



ప్రేమ ఇంకొకటి లేదు- అని పల్కినా, మంగళాశాసనంలో **"ఆర్వమ్"** అంటే - అస్థానే భయశంకను పొందే స్వభావం - అందఱికి ఉన్నది- అని తెలియడంవల్ల **"అఞ్జుకుడి"** అనే ప్రయోగంతో ఆళ్వార్లను అందఱిని గ్రహించడం సమంజసమే. కనుక, పదిమందికి గోదాదేవి జ్ఞానపుత్రిక అయినది. దీనినిబట్టి **"గురవస్త్వదీయాః"** అనే ఈ ప్రయోగం పదిమంది ఆళ్వార్లను నిర్దేశిస్తుంది. కొందఱు ఆళ్వార్ల విషయంలో **"భక్తిం నిజాం ప్రణయభావనయా గృణంతః"** (తమ భక్తిని ప్రణయ భావనతో పలికేవారై) అనే అంశం స్పష్టంగా గోచరించకపోయినా, ఛత్రిన్యాయంతో వారినికూడా కలుపుకొని చెప్పడంలో లోటు లేదు.

9. మాతః ! సముత్థితవతీ మధివిష్ణుచిత్తం
విశ్వోపజీవ్య మమృతం వచసా దుహానామ్ ।
తాపచ్ఛిదం హిమరుచేరివ మూర్తి మన్యాం
సన్తః పయోధి దుహితుః సహజాం విదుస్త్వామ్ ॥

మాతః = తల్లీ, అధివిష్ణుచిత్తం = పెరియాళ్వార్లవలన (భగవానుని మనస్సులో) (విష్ణువు తన మధ్యలో పరుండి ఉండే పాలకడలిలో), సముత్థితవతీం= ఆవిర్భవించినదై, వచసా = వాక్కుతో, విశ్వ + ఉపజీవ్యం = లోకం అంతా ఉజ్జీవించడానికి తగిన, అమృతం = అమృతాన్ని, దుహానాం = స్రవిస్తున్నదై, తాపచ్ఛిదం = తాపాలను తీర్చగల్గినదై, హిమరుచేః = చంద్రునియొక్క, అన్యాం= వేఱొక, మూర్తిమ్ ఇవ = రూపంవలె ఉండే, త్వాం = నిన్ను, సంతః= సత్పురుషులు (అభిజ్ఞులైన పెద్దలు), పయోధిదుహితుః = సముద్రుని కుమార్తె అయిన లక్ష్మీదేవికి, సహజాం = తోబుట్టువుగా, విదుః = తెలిసికొంటున్నారు.

తల్లీ! గోదాదేవీ! మహాత్ములు నిన్ను పాలకడలినుండి పుట్టిన లక్ష్మీదేవికి తోబుట్టువుగా తెలిసికొంటున్నారు. ఏవిధంగా అంటే - దేవతలకోసం స్వామి అమృతాన్ని ఉద్ధరించిన కాలంలో **"అశ్వాప్సరోవిషసుధావిధు పారిజాతలక్ష్మ్యాత్మనా పరిణతో జలధిర్బభూవ"** (ఉచ్చైః శ్రవం, అప్సరసలు, హాలాహలం, అమృతం, చంద్రుడు, పారిజాతం, లక్ష్మిరూపంలో జలధి పరిణమించింది) అని అతిమానుష స్తవంలో కూరేశులు పల్కిన రీతిలో లక్ష్మీదేవితో పాటు చంద్రుడుకూడా జన్మించాడు. ఆ చంద్రుడే నీవై (గోదాదైవియై) మూర్తీభవించినట్లున్నందువల్ల నిన్ను లక్ష్మీదేవికి తోబుట్టువుగా పల్కడం తగినదే. నీవు, చంద్రునితో పోలి ఉండడం, నీ తిరుమేని యొక్క ప్రకాశంతో మాత్రమేకాదు. ఇంకా పలు రీతులలో ఆ చంద్రునితో సాధర్మ్యాన్ని నీవు కల్గి ఉన్నావు. ఏవిధంగా అంటే- విష్ణుచిత్తోదయం ఆ చంద్రునకు

ఉన్నది. నీకూ ఉన్నది. **"వేయర్తఙ్గళ్ కులత్తుదిత్త విట్టుశిత్తన్"**కు నీవు పుత్రికవైనందువల్ల నీ విష్ణుచిత్తోదయం ప్రసిద్ధం. **"చంద్రమా మనసో జాతః"** అనే శ్రుతిని అనుసరించి అతడు విష్ణువుయొక్క చిత్తంలో పుట్టినవాడు కనుక, అతని విష్ణుచిత్తోదయం కూడా ప్రసిద్ధమే. సకలజనులు అభిలషించి ఆదరించదగిన వెన్నెల అనే అమృతాన్ని అతడు ఇస్తాడు. నీవు కూడా సకలజాతీయ భక్తజనులు ఏతేడా లేకుండా అధికరించదగిన శ్రీసూక్తులనబడే అమృతాన్ని అనుగ్రహించావు. అతడు తన కిరణాలతో సకలజనులయొక్క దేహతాపాన్ని తీరుస్తున్నాడు. నీవుకూడా నీ శ్రీసూక్తులతో, నీ దివ్యమంగళవిగ్రహసేవను అనుగ్రహించడంద్వారా మా ఆధ్యాత్మిక - ఆధిదైవిక - ఆధిభౌతికాలనే తాపత్రయాలను తీరుస్తున్నావు. ఈ రీతులలో చంద్రునితో నీవు పోలికను కల్గి ఉండడంవల్ల, లక్ష్మీ సహజాతత్వం (లక్ష్మికి తోబుట్టువై ఉండడం) చంద్రునకువలె నీకుకూడా చక్కగా పొసగి ఉన్నది.

"లక్ష్మీదేవియే సాక్షాత్తు ఆణ్డాళ్‌గా అవతరించింది" అని అనడం, లక్ష్మీదేవికి ఆణ్డాళ్ చెల్లెలువలె జన్మించింది" అని అనడం సంప్రదాయంలో ప్రసిద్ధమే కనుక, ఈ గోదాస్తుతిలో ఈ రెండు రీతులలోని నిర్వాహాలను శ్రీదేశికులు ఆదరించి పలికారు. స్తుతి ప్రారంభంలో **"కమలామివాన్యామ్"** అని అన్నారు. ఇందులో **"పయోధిదుహితుః సహజామ్"** అని అన్నారు. ఈ రెండు రీతులలో పల్కడంలో ఏ కొఱత లేదని దీనివల్ల దేశికులు సూచించారు. ఆణ్డాళ్, లక్ష్మీదేవికి తోబుట్టువు అనే ప్రసిద్ధిని ఈ విధంగా శ్లేషాలంకారప్రయోగంతో నిర్వహించిన శ్రీదేశికుల సామర్థ్యం మహాపండితులకుసైతం విస్మయం కల్గించకమానదు. ఆణ్డాళ్‌కు చంద్రునితో సాధర్మ్యాన్ని నిర్వహించి, తద్వారా ఈమెయొక్క లక్ష్మీసహజాతత్వాన్ని నిరూపించినందువల్ల కవిచాతుర్యం వెల్లడి అవుతున్నది.

ఈ శ్లోకంలో **1. అధివిష్ణుచిత్తమ్, 2. విశ్వోపజీవ్యమ్, 3. అమృతమ్, 4.తాపచ్ఛిదమ్-** అనే నాల్గు పదాలలో శ్లేషాలంకారం ఇమిడి ఉన్న సొబగు గమనించదగినది. **"అధివిష్ణుచిత్తమ్"** - విష్ణుచిత్తునినుండి - అని, విష్ణుచిత్తుని మనస్సునుండి- అని రెండు అర్థాలు. మిగిలిన మూడు పదాలలోని శ్లేష స్పష్టం.

**10.** తాతస్తు తే మధుభిదః స్తుతిలేశవశ్యాత్
కర్ణామృతైః స్తుతిశతై రనవాప్తపూర్వమ్ ।
త్వన్మౌళిగన్ధసుభగా ముపహృత్య మాలాం
లేభే మహత్తరపదానుగుణం ప్రసాదమ్ ॥



తే = నీయొక్క, తాతః తు = తండ్రి అయిన భట్టనాథులు, స్తుతిలేశ = కొద్దిపాటి స్తోత్రానికి, వశ్యాత్ = కట్టబడేవాడైన, మధుభిదః = మధుసూదనుని వల్ల, కర్ణ+అమృతైః = చెవులకు అమృతంవంటి, స్తుతిశతైః= వందలాది స్తుతులతో సైతం, అనవాప్తపూర్వం = ఇంతకుముందు పొందని, మహత్తరపద = పెరియాళ్వార్లు అనే తిరునామాన్ని పొందడానికి, అనుగుణం = తగిన, ప్రసాదం = అనుగ్రహాన్ని, త్వత్ మౌళి = నీ కిరీటంయొక్క, గంధసుభగాం = పరిమళంవల్ల గొప్పతనాన్ని పొందిన, మాలాం = మాలికను, ఉపహృత్య = సమర్పించి, లేభే = పొందాడు.

గోదాదేవీ ! స్వల్పస్తోత్రానికి వశుడయ్యే భగవానుని విషయంలో **"శెవిక్కినియ శెఞ్జొల్"** అని కీర్తించదగిన సూక్తులను (పాశురాలను) వందల కొలది పాడిన మిగిలిన ఆళ్వార్లచేత అంతకుముందు పొందబడని **"పెరియాళ్వార్"** అనే గొప్ప పేరును నీ పితృపాదులైన భట్టనాథులు, నీవు ఆముక్తమాలికను సమర్పించినందువల్ల పొందారుసుమా!

ఆళ్వార్లు అందరిలోను ఆణ్డాళ్‌కు తండ్రి అయిన భట్టనాథులు "పెరియాళ్వార్లు అనే పేరును పొందారు. ఈ ఆళ్వార్లకు ఏం అంశంలో గొప్పతనం? అనే సంగతిని విచారించాలి. మిగిలిన ఆళ్వార్లకంటే ముందుగా ఈలోకంలో అవతరించినవారైన ముదలాళ్వార్లు, తిరుమళిశైప్పిరాన్, నమ్మాళ్వార్లు మొదలైనవారు వారికంటే వయస్సులో పెద్దవారు కనుక వయస్సునుబట్టి పెద్దతనం వీరికి ఉన్నదని అనడానికి వీలు లేదు. ఇక, ఎక్కువ సంఖ్యలో పాశురాలను పాడినందుల్ల కలిగే పెద్దతనం అయినా వీరికి చెప్పే వీలున్నదా? అని చూస్తే ఈ విషయంలో నమ్మాళ్వార్లు, తిరుమంగైమన్నన్ మాత్రమే గొప్పతనాన్ని కలవారు. అందువల్ల ఏకారణంచేత ఈ భట్టనాథులకు పెరియాళ్వార్లు అనే పేరు వచ్చింది-అని విచారించవలసి వచ్చింది. ఆణ్డాళ్, తాను కేశాలలో ముడుచుకొని తీసి ఇచ్చిన మాలికను ఈ ఆళ్వార్లు భగవానునకు ప్రతిదినం సమర్పించినందువల్ల చాలా ఆనందించిన భగవానుడు వీరికి పెరియాళ్వార్లు- అనే బిరుదు కలిగేటట్లు అనుగ్రహించాడు- అని ఒక కారణం ఈ శ్లోకంలో తెలుపబడింది.

ఈ విధంగా పల్కడం, శ్రీదేశికులు చేసే ఒకానొక ఉత్ప్రేక్ష కావచ్చు. **"మఙ్గళాశాసనత్తిల్ మఱ్ఱుళ్ళ ఆళ్వార్‌కళ్ తఙ్గళార్వత్తళవుతానన్ఱి పొఙ్గుమ్ పరివాలే విల్లిపుత్తూర్ పట్టర్‌పిరాన్ పెఱ్ఱాన్ పెరియాళ్వార్ ఎన్నుమ్ పెయర్"** (శ్రీమంగళా శాసనం చేయడంలో మిగిలిన ఆళ్వార్లకు గల ఆశయొక్క పరిమితిలో కాకుండా,

పొంగే భక్తితో శ్రీవిల్లిపుత్తూర్‌లోని భట్టనాథులు పెరియాఴ్వార్ అనే పేరును పొందారు) అనే ఆచార్యదివ్యసూక్తినిబట్టి మిగిలిన ఆఴ్వార్లకంటే మంగళాశాసనంలో అంతు లేని అభినివేశాన్ని కల్గి ఉండే కారణంచేతనే ఈ ఆఴ్వార్లకు పెరియాఴ్వార్లు అనే తిరునామం వ్యవహరింపబడుతున్నది- అనే పూర్వాచార్యసంప్రదాయం కనుక, ఇక్కడ ప్రకృత శ్లోకంలో దేశికులు ఈ విధంగా పల్కినది- గోదాదేవినిగూర్చి తాము చేసే స్తుతికి అనుగుణంగా పల్కిన ఒక ఉత్ప్రేక్ష కావచ్చు -అని కొందఱి పెద్దల వివరణం. **"మన్యే శంకే ధ్రువం ప్రాయః నూనమిత్యేవమాదిభిః, ఉత్ప్రేక్షా వ్యజ్యతే శబ్దైః ఇవశబ్దోఽపి తాదృశః"** అనే ఆలంకారికసమయాన్నిబట్టి ఉత్ప్రేక్షా వ్యంజక శబ్దాలైన **"మన్యే శంకే"** ఇత్యాది పదాలలో ఏదీ ఈ శ్లోకంలో కన్పించడం లేదు కనుక, దీనిని ఉత్ప్రేక్షగా చెప్పడంలో అంత స్వారస్యం లేదు. అందువల్ల ఇది వస్తుస్థితిని తెలుపుతున్నదే -అని అనేవారు కూడా ఉన్నారు. ఈ దృష్టిలో చూచినపుడు పెరియాఴ్వార్లు అనే పేరు కల్గడానికి రెండు విధాలైన కారణనిర్వాహాలు సంప్రదాయ సిద్ధాలు- అని చెప్పాలి.

**"మహత్తరపదానుగుణమ్"** అనే ప్రయోగానికి **"నిత్యవిభూతి ప్రదానాను రూపమ్"** అని కొందఱు వ్యాఖ్యానించడం కవిహృదయాన్ని ఆవిష్కరిస్తున్నదా! అనే అంశం ప్రాజ్ఞులే విచారించాలి.

**"స్తుతిలేశవశ్యాత్"** అనే సూక్తి భగవానునిగూర్చిన స్వభావోక్తి. తననుగూర్చి రెండు మూడు పాశురాలు పల్కినంతమాత్రంలోనే మహత్తరపదానుగుణమైన అనుగ్రహాన్ని చేసే స్వభావాన్ని భగవానుడు కలవాడైనా, అత్యంతం శ్రవణమధురాలైన అందమైన శ్రీసూక్తులు పెక్కింటిని పాడినా, దానిని (అనుగ్రహాన్ని) చేయకుండా ఉన్నాడనే అర్థాన్ని తెలిపే పూర్వార్ధంలో **"కర్ణామృతైః స్తుతిశతైః"** అనే వ్యస్తప్రయోగం పొసగదు. **"కర్ణామృతస్తుతిశతైః"** అని సమస్తప్రయోగంగా కవి ప్రయోగించి ఉంటారు- అని పలువురు పెద్దలు అంటారు. ఈ సమస్తప్రయోగంలోని స్వారస్యం ఏమంటే - **"కర్ణామృతాని స్తుతిశతాని యేషాం తే, కర్ణామృతస్తుతిశతాః, తైః"** - అనే బహువ్రీహి సమాసంగా చేసి, కర్ణామృతాలైన స్తుతిశతాలను పాడిన మిగిలిన ఆఴ్వార్లచేతకూడా (నమ్మాఴ్వార్లచేతకూడా) పొందబడనిదైన అనుగ్రహాన్ని ఈ ఆఴ్వార్లు పొందారు- అనే విషయం చక్కగా సువ్యక్తమవుతున్నది. **"ఇన్ కవిపాడుమ్ పరమకవికళ్"** అని మిక్కిలి విశిష్టంగా పేర్కొనబడే ముదలాఴ్వార్లకు కూడా **"పాలేయ్ తమిఴర్ ఇశైకారర్ పత్తర్ పరవు మాయిరమ్"** (పాలవంటి ద్రావిడాన్ని రచించే తమిళ పండితులు, సంగీత గాయకులు, భక్తులు ఆదరించే సహస్రం) అని, **"తొణ్డర్క్కు**



**అముదుణ్ణ చ్చొల్ మాలైకళ్ శొన్నేన్"** (భక్తులకు అమృతంవంటి పాశురమాలికలను పలికాను) అని పలికే రీతిలో కర్ణామృతస్తుతిశతాలను పాడిన నమ్మాఴ్వార్లకు, ఇంకా ఇటువంటివారే అయిన తిరుమఴిశైప్పిరాన్‌కు, కులశేఖరప్పెరుమాళ్‌కు లభించని అనుగ్రహాన్ని ఆణ్డాళ్ ముడుచుకొని తీసి ఇచ్చిన మాలికను ఉపహారంగా సమర్పించిన కారణంగా ఈ ఆఴ్వార్లు పొందారు- అని తెలుపడానికి సమస్తమైన పాఠమే బాగా పొసగుతుంది.

**(తన్మౌలిగంధసుభగామ్)** - నీ కేశపాశాల సుగంధంతో వాసితమైన- అని భావం. **"మహత్తరపదం లేభే"** అని అనకుండా **"మహత్తరపదానుగుణం ప్రసాదం లేభే"** అని అనడంలోని తాత్పర్యం ఏమంటే- పెరియాఴ్వార్లు అనే తిరునామాన్ని భగవానుడే స్వయంగా ఇచ్చి ఉంటే **"మహత్తరపదం లేభే"** అని అనవచ్చు. వీరి అతిశయాన్ని చూచిన మహనీయులే వీరికి **"పెరియాఴ్వార్లు"** అనే తిరునామాన్ని సమర్పించి వ్యవహరించడం ప్రారంభించినందువల్ల, ఆ విధంగా చేయడం భగవానుని మనస్సును అనుసరించి కనుక, **"మహత్తరపదానుగుణం ప్రసాదమ్"** అని అనబడింది.

ఈ శ్లోకంలో ఆణ్డాళ్ **'ఆముక్తమాలిక'**యొక్క వైలక్షణ్యం వర్ణింపబడింది.

**11.** **దిక్ దక్షిణాఽపి పరిపక్త్రిమపుణ్యలభ్యాత్**
**సర్వోత్తరా భవతి దేవి ! తవావతారాత్ ।**
**యత్రైవ రఙ్గపతినా బహుమానపూర్వం**
**నిద్రాళునాఽపి నియతం నిహితాః కటాక్షాః ॥**

దేవి = ఓ గోదాదేవీ ! దక్షిణా దిక్ అపి = దక్షిణ దిక్కుకూడా, పరిపక్త్రిమ = పండిన, పుణ్య = పుణ్యంవల్ల, లభ్యాత్ = పొందదగిన, తవ అవతారాత్ = నీ అవతారంవల్ల, సర్వ+ఉత్తరా = అన్నిటికి మించినదిగా, (అన్నిటికీ ఉత్తరదిశలో ఉన్నదిగా), భవతి = అవుతున్నది, యత్ర ఏవ = ఏ దిక్కులో అయితే, రంగపతినా= శ్రీరంగనాథునిచేత, నిద్రాళునా అపి = అతడు నిద్రాళువు అయినా -ఎల్లప్పుడు నిద్రించేవాడైనా, బహుమానపూర్వం = చాలా గౌరవంతో, నియతం = ఎల్లప్పుడు, కటాక్షాః = కటాక్షాలు, నిహితాః = ప్రసరింపజేయబడ్డాయో.

గోదాదేవీ ! **"ఉఱఙ్గువాన్‌పోల్ యోగు శెయ్‌ద పెరుమాన్"** (నిద్రించేవానివలె యోగాన్ని చేసే స్వామి) అని కీర్తింపబడే శ్రీరంగనాథుడు ఏ దిక్కును మిక్కిలి ఆదరంతో కటాక్షిస్తూ నిద్రిస్తున్నాడో, ఆ దిశ దక్షిణ దిక్కు అయినా, గొప్ప

భాగ్యఫలంగా కలిగిన నీ అవతారకారణంగా **"సర్వోత్తరా"** అయినది. అంటే- అందటికి ఉత్తర దిక్కు అయినది. (సర్వోత్కృష్టమైన దిశ అయినది - అని అర్థాంతరం)

గోదాదేవి అవతరించిన దివ్యదేశం శ్రీవిల్లిపుత్తూరు. ఈ ఊరు దక్షిణ దిక్కులో ఉన్నది. అది దక్షిణదిక్కు అయినా, ఉత్తర దిక్కు అయినది- అని విరోధాభాసాలంకారం స్ఫురించేటట్లుగా ఒక చమత్కార ప్రయోగాన్ని శ్రీదేశికులు చేశారు. **"ఉత్తరా"** అనే సంస్కృత పదం ఉత్తర దిక్కును తెలిపేటట్లే, "గొప్పది'' అనే అర్థాన్ని కూడా తెలుపుతుంది. కనుక, మొదట ఉత్తర దిక్కు అనే అర్థాన్ని గ్రహించినపుడు అర్థంలో విరోధం భాసిస్తుంది. "దక్షిణదిక్కు అయినా అందటికి ఉత్తర దిక్కుగా భాసిస్తుంది'' అనేది ఆ అర్థవిరోధస్వరూపం. గొప్ప అనే అర్థాన్ని గ్రహిస్తే "దక్షిణదిక్కు అన్ని దిక్కులలో గొప్ప దిక్కు అయినది'' అనే రీతిలో విరోధపరిహారం చేయబడుతుంది. గోదాదేవియొక్క అవతారంవల్ల దక్షిణ దిక్కు చాలా గొప్పది అయినది- అని తాత్పర్యం. ఆ గొప్పతనమే శ్లోకంలోని ఉత్తరార్ధంలో సమర్థింపబడుతున్నది- **"యత్రైవ"** ఇత్యాదిగా.

**"కుడతిశై ముడియై వైత్తు క్కుణతిశై పాతమ్ నీట్టి వడతిశై పిన్బు కాట్టి త్తెన్‌తిశై ఇలజ్జై నోక్కి"** (పడమటి దిశలో కిరీటాన్ని పెట్టుకొని, తూర్పుదిశలో పాదాలను చాచి, ఉత్తర దిక్కులో వెనుకభాగాన్ని చూపి, దక్షిణదిక్కులోని లంకను చూచి) అని పలికే రీతిలో శ్రీరంగనాథుడు దక్షిణ దిక్కును చూస్తూ శయనించి ఉండడం- విభీషణాళ్వాన్‌ను కటాక్షించడంకోసం అనే పౌరాణిక వృత్తాంతం ఉన్నా, గోదాదేవి యొక్క అవతారస్థలమైన శ్రీవిల్లిపుత్తూర్‌పట్ల గల అభినివేశంవల్లనే ఆ దిశను కటాక్షిస్తూ భగవానుడున్నాడు - అని అనడం రసవత్తరం - అని ఇక్కడ కవిహృదయం కావచ్చు. ఆ అభిప్రాయాన్ని స్పష్టంగా తెలిపే వాచకం శ్లోకంలో ఎక్కడా లేకపోయినా, ఇచటి ఉత్తరార్ధంయొక్క సన్నివేశం గమనించినపుడు ఈ విధంగా అనడం చాలా పొసగుతుంది.

**(పరిపక్త్రిమపుణ్యలభ్యాత్)** - ఫలాన్ని ఇవ్వడానికి ఉన్ముఖంగా ఉండడం **"పరిపక్త్రిమ"** అని అనబడుతుంది. పరిపక్వమైన సుకృతంయొక్క ఫలంగా కల్గింది- అని భావం. **"నమక్కాక వన్తో ఇజ్గాణ్డాళ్ అవతరిత్తాళ్, కున్తాత వాళ్వాన వైకున్ద వాన్‌పోకమ్ తన్నై ఇకళ్న్దు ఆళ్వార్ తిరుమకళారాయ్"** (మనకోసమే కదా ఈ లోకంలో గోదాదేవి అవతరించింది, ఏ లోటు లేని ఉజ్జీవనమనే వైకుంఠంలోని



గొప్ప వైభవాన్ని కాదని, మనకోసం ఆళ్వార్ల పుత్రికగా) అని శ్రీవరవరమునులు పల్కిన రీతిలో మనవంటి సంసారుల సుకృతఫలంగాకదా ఆణ్డాళ్ అవతరించింది.

**(నిద్రాళునా)**-ఇది **"ఆళుచ్"** ప్రత్యయాంతమైన పదం. నిద్రను కలవాడు నిద్రాళువు.

12. **ప్రాయేణ దేవి! భవతీవ్యపదేశయోగాత్**
**గోదావరీ జగదిదం పయసా పునీతే ।**
**యస్యాం సమేత్య సమయేషు చిరం నివాసాత్**
**భాగీరథీప్రభృతయోఽపి భవన్తి పుణ్యాః ॥**

దేవి = గోదాదేవీ!, గోదావరీ = గోదావరీ నది, భవతీవ్యపదేశయోగాత్ = నీ పేరును కల్గి ఉండడంవల్ల, పునీతే = పవిత్రం చేస్తున్నది (కాబోలు), యస్యాం = ఏ నదిలో, భాగీరథీ ప్రభృతయః+అపి = గంగ మొదలైన నదులు కూడా, సమయేషు= ఆ యా పుణ్యసమయాలలో, సమేత్య= కూడి, చిరం = చిరకాలం, నివాసాత్ = నివసించడంవల్ల, పుణ్యాః = పుణ్యమైనవిగా, భవంతి = అవుతున్నాయి.

గోదాదేవీ ! గంగమొదలైన నదులు ఏ గోదావరిలో సమయవిశేషాలలో వచ్చి కలసి, చిరకాలం అందులో వసించి పునీతాలు అవుతున్నవో, అటువంటి గోదావరీనది నీ తిరునామాన్ని తాను కల్గి ఉండడంవల్ల కాబోలు ఈ లోకాన్ని తన పుణ్యజలంతో పునీతం చేస్తున్నది.

పంచవటిలో రావణుడు సీతాదేవి అపహరించి తీసికొనిపోయేటపుడు, **"హంసకారండవాకీర్ణాం వందే గోదావరీం నదీమ్, క్షిప్రం రామాయ శంస త్వం సీతాం హరతి రావణః"** అని అంటూ గోదావరిని ఉద్దేశించి "నన్ను రావణుడు అపహరించుకొని పోతున్నాడు - అని శ్రీరామునకు తెలియజేయి'' అని ఆమెను సీతాదేవి వేడుకొన్నది. ఆ విధంగా ఆమె వేడుకోకపోయినా భగవానునకు తెలియజేయవలసిన బాధ్యత ఉన్నా, సీతాదేవి వేడుకొన్న తర్వాతకూడా, గోదావరి ఆ విషయాన్ని శ్రీరామునకు తెలుపలేదు. దీనికి కారణం- రావణునిపట్ల ఆమెకు గల భయం కావచ్చు. యమునానది కంసుని భవనం కింద ప్రవహిస్తున్నది. కనుక కంసునకు భయపడవలసి ఉన్నప్పటికీ, ఆ విధంగా ఆ నది భయపడకుండా, **"యమునాం చాతి గంభీరాం నానావర్తసమాకులామ్, వాసుదేవో వహన్ కృష్ణం జానుమాత్రోదకో యయౌ"** అనే రీతిలో మోకాలిబంటి లోతు కల్గి ఉండేటట్లు తనను ఇంకింపజేసికొన్నది. అందువల్ల అది **"తూయ పెరునీర్ యమునై"** అని గోదాదేవిచేత గొప్పగా కీర్తింపబడింది.

ఆ విధంగా కించిత్కారం (సేవ) చేసే రీతిలోని భాగ్యాన్ని గోదావరి కోల్పోయి నందువల్ల అపవిత్రత ఈ నదికి కల్గింది. ఆ అశుద్ధి తొలగి పవిత్రతను పొందడం కోసం గోదావరీ నది తపస్సు చేసినదని, ఆ తపస్సువల్ల ప్రసన్నమైన దేవత సాటి మేటి లేని పవిత్రతను వరంగా ఇచ్చినట్లు ఒక పౌరాణికగాథ ఉన్నది. అంత పవిత్రత దానికి కల్గడానికి నిజానికి ఏమి కారణం ? అంటే, **"గోదా"** అనే తిరునామాన్ని తన పేరులో ఏకదేశంగా (భాగంగా) కల్గి ఉండగల్గడమే కారణం- అని అంటూ దేశికులు చమత్కారావహంగా ఇక్కడ ఉత్ప్రేక్షిస్తున్నారు.

నైషధకావ్యంలో హంస నలచక్రవర్తి మహిమను గూర్చి దమయంతికి చెప్పేటప్పుడు **"అస్మత్ కిల శ్రోత్రసుధాం నిపీయ రంభా చిరం భామతులాం నలస్య, తత్రానురక్తా తమనాప్య భేజే తన్నామగంధాన్నలకూబరం సా"** - రంభ అనే అప్సరస నలుని వివాహం చేసికోవాలని తలచి ఆ ఆశ తీరనందువల్ల, "ఆ నలుని పేరును ఏకదేశంగా కల్గిన నలకూబరుని అయినా వివాహం చేసికొంటాను''- అని అతనిని వివాహమాడింది- అని అన్నది. దీనిని ఒక విధంగా ప్రకృతవర్ణనతో పోలి ఉండడం గమనార్హం.

గోదావరికి ఎంతటి పవిత్రత కల్గింది ? - అని అంటే, ఆ విషయం ఉత్తరార్ధంలో వివరింపబడుతున్నది. అప్పటికే చాలా గొప్పతనాన్ని పొందిన గంగమొదలైన నదులు సైతం కొన్ని విశేషసమయాలలో గోదావరీనదిలో చిరకాలం వాసం చేసి పవిత్రతను పొందగలవు- అనే దేవతానుగ్రహం కల్గింది- అని ఒక పౌరాణికగాథ ఉన్నది. పరమపవిత్రాలుగా ప్రసిద్ధి చెందిన గంగ మొదలైన నదులకుకూడా పరిశుద్ధి గోదావరీమూలకం - అని అంటే, దీని పవిత్రత ఎటువంటిదై ఉండి ఉండాలి? వాచామగోచరం అని చెప్పవలసి ఉన్నది. అంతే. అటువంటి పవిత్రత గోదాదేవి యొక్క తిరునామాన్ని కల్గి ఉండడంవల్లనే కావచ్చు- అని ఇక్కడ ఉత్ప్రేక్షింపబడుతున్నది. **"ప్రాయేణ"** అనేది ఉత్ప్రేక్షావ్యంజకశబ్దం- అనే విషయం ఆలంకారికసమయసిద్ధం.

**(యస్యాం సమేత్య)** - ఈ పురాణవృత్తాంతంయొక్క ఆకరాన్ని, వివరణాన్ని పౌరాణికులవల్ల గ్రహించాలి.

**13. నాగేశయః సుతను ! పక్షిరథః కథం తే**
**జాతః స్వయంవరపతిః పురుషః పురాణః ।**



**ఏవంవిధాః సముచితం ప్రణయం భవత్యాః**
**సందర్శయన్తి పరిహాసగిరః సఖీనామ్ ॥**

సుతను =అందమైన తిరుమేనిని కల దేవీ !, నాగేశయః = సర్పశయనుడు, పక్షిరథః = గరుడపక్షిని వాహనంగా కలవాడు అయిన, పురాణః పురుషః = ముదుసలి అయిన ఒక పురుషుడు, తే = నీకు, స్వయంవరపతిః = నీవే స్వయంగా వరించిన వరుడుగా, కథం = ఏ విధంగా, జాతః = అయినాడు? (అని), ఏవంవిధాః = ఇటువంటి, సఖీనాం = చెలికత్తెల, పరిహాసగిరః = పరిహాసవచనాలు, భవత్యాః= నీకు గల, సముచితం = తగిన, ప్రణయం = ప్రణయాన్ని, సందర్శయంతి = వ్యక్తం చేస్తున్నాయి.

"అందమైన తిరుమేనిని కల గోదాదేవీ ! ఆదిశేషునిపై శయనించి ఉండేవాడు, పక్షి అయిన గరుడుని వాహనంగా కలవాడు, యువకుడై ఉండడమేకాక చాల వయస్సును కలవాడు, ముదుసలి అయిన ఒక పురుషుడు నీకు స్వయంవరభర్తగా ఏవిధంగా అయినాడు?'' అని ఈ రీతిలో సఖులు పలికే పరిహాసవచనాలు నీ ప్రేమ సముచితవ్యక్తితోనే ఏర్పడినదనే విషయాన్ని వ్యక్తం చేస్తున్నారు.

సఖులు ఒకరితో ఇంకొకరు వినోదగా పరిహాసవచనాలను పలికే సమయంలో, గోదాదేవిని చూచి ఆమె చెలికత్తెలు కొందరు వేళాకోళంగా మాటలాడడం సహజం. ఏరీతిలో అంటే- గోదా ! లోకంలో కన్నియలకు తల్లిదండ్రులు ప్రయత్నించి వివాహం జరపడం సంప్రదాయం. నీ వివాహం ఆ రీతిలోనే జరిగి ఉంటే దానిలో ఉండే లోటుపాట్లనుగూర్చి విచారించవలసిన పని లేదు. నీ వివాహాన్ని చూస్తే, అది ఆ విధంగా జరుగలేదు. స్వయంవరం ప్రకటించి నీకు నీవే భర్తను వరించావు. అటువంటి నీవు పలు రీతులలోని కొఱతలకు చోటున్న వివాహాన్ని చేసికొన్నావే! ఇదేమి! లోకంలో కన్యలు ఎవరైనా చక్కని పడుకను కోరుకొంటారు కదా! **"అఙ్జీత పైమ్బూవ్పళ్ళి"** అన్నట్లు పాముపడుకపై శయనించగోరేవానిని **"నచ్చు నాగణైయానే"** అని, **"నఞ్జరవిల్ తుయిల్కొణ్డ నమ్బీ!"** (సర్పంపై శయనించే గుణపూర్ణా!) అని చెప్పబడేవానిని నీవు వివాహమాడావు. కనుక, విషసర్పం మీదకదా నీవు శయనించవలసి ఉన్నది!

అది అట్లుండనీ! మంచి రథంలో వరునితో కలసి కూర్చొని మెల్ల మెల్లగా ఊరేగింపుగా వెళ్ళాలని కన్యలు ఆశపడతారు. ఆ ఆశకుకూడా అవకాశం లేని రీతిలో పక్షిరాజు అయిన గరుడుని వాహనంగా కలవానిని కదా పతిగా వరించావు. పక్షిమీద ఒకరు కూర్చుని ఉండడమే కష్టం. ఇక ఇద్దరు కలసి కూర్చునే అవకాశమే

లేదు. ఇరుకుగా జరిగి దగ్గరగా కూర్చున్నా, ఒక క్షణకాలంలో పలు యోజనాల దూరం పరుగు తీయగల్గిన పక్షి కనుక, మందగతితో మెల్లమెల్లగా పోయే ఆశ తీరనే తీరదు.

పోనీ, దానినికూడా అటు ఉండనీ. నాయకుడైన, చక్కని యువకుడై ఉండి ఉంటే, మిగిలిన లోటుపాట్లు ఏవిధంగా ఉన్నా వాటిని లెక్కించకుండా ఉండవచ్చును. చూస్తే,అదికూడా లేదు. నీవు వరించినవాని జాతకమే దొరకడం అరుదు. అతడు పుట్టినది ఎపుడు? అనేది తెలియడానికి సాధ్యం కాదు. పలు ఏండ్లు గడచిన ముదుసలి - అని పలువురు పల్కుతున్నారు. అయ్యో! ఇటువంటివానినా నీవు వరించావు! గొప్ప వివేకాన్ని కల్గిన నీవు ఈ విధంగా చేయవచ్చునా!- అని పరిహసిస్తారట. ఈ పరిహాసవచనాలవల్ల ఏమి వ్యక్త మవుతున్నది? అని అంటే, **"అజ్కైత్తలత్తిడై ఆళ్ళికొణ్డానవన్ ముకత్తన్ని విళ్ళియేనెన్ట్రు శెఙ్కచ్చు క్కొణ్డు కణ్ణాడై యార్త్తు చ్చిఱుమానిడవరై క్కాణిల్ నాణుమ్ కజైత్తలమివై నోక్కి క్కాణీర్"** (అందమైన కరతలంలో శ్రీసుదర్శనాన్ని ధరించిన శ్రీకృష్ణుని ముఖంలో తప్ప మిగిలిన వారి ముఖాన్ని చూడను - అని చక్కని కంచుకమనే వస్త్రంలో కన్నులను మూసికొని, క్షుద్రమానవులను చూస్తే సిగ్గుపడే ఈ స్తనాలను బాగా పరిశీలించి గమనించండి) అని పలికే రీతిలో దృఢమైన సంకల్పాన్ని ఆణ్డాళ్ తనయొక్క ప్రేమను తగిన విషయంలోనే ప్రవర్తింపజేసింది - అనే గొప్పతనాన్నే ఈ పరిహాసవచనాలద్వారా వ్యక్తమవుతున్నది.

**"నల్ల వెన్ తోళ్ళి నాకణైమిశై నమ్ పరర్"** (ఓనా ప్రాణ సఖీ! నాగశయనుడైన మన పరమపురుషుడు) అని గోదాదేవి ముఖంనుండి ఆవిర్భవించినందువల్ల **"నాగేశయః"** అనే పదం పరత్వాన్నే సూచిస్తుంది. **"పఱవై యేఱు పరమ్ పురుడా!"** (గరుడుని అధిరోహించే పరమ పురుషా) అని ఆణ్డాళ్ తండ్రిగారైన పెరియాళ్ళ్వార్ల నోటినుండి వచ్చినందువల్ల, **"పక్షిరథః"** అనే పదంకూడా పరత్వసూచకమే. **"పురుషః పురాణః"** అనే ప్రయోగం సహజంగానే పరత్వాన్ని తెలుపుతున్నది. **"మూవరిల్ మున్నియ విరుత్తనై"** అని, **"తేవర్కట్కెల్లామ్ విరుత్తా!"** (దేవతలు అందరిలో పెద్దవాడా) అనే దివ్యసూరి ప్రయోగాలు ప్రకృతంలో స్మరణీయాలు.

**(సముచితం ప్రణయం సందర్శయంతీ)** - గోదాదేవియొక్క ప్రేమ సముచితమైన స్థానంలోనే ఏర్పడింది- అనే విషయాన్ని పరిహాసవచనవ్యాజంతో ఆమె చెలికత్తెలు తెలియజేశారని తాత్పర్యం.



**14.** త్వద్భుక్తమాల్యసురభీకృతచారుమౌళేః
హిత్వా భుజాన్తరగతామపి వైజయన్తీమ్।
పత్యు స్తవేశ్వరి! మిథః ప్రతిఘాతలోలాః
బర్హాతపత్రరుచి మారచయన్తి భృఙ్గాః ॥

ఈశ్వరి = మమ్ములను పాలించే నాయకి అయిన ఓ గోదాదేవీ!, భృంగాః= తుమ్మెదలు, త్వత్ భుక్త = నీచే అనుభవింపబడిన (ముడుచుకోబడిన), మాల్య= మాలికలచే, సురభీకృత = పరిమళింపబడిన, చారు = అందమైన, మౌళేః = కిరీటాన్ని కల్గిన, తవ పత్యుః = నీనాయకునియొక్క, భుజాంతరగత = వక్షఃస్థలంలో అలంకరింపబడ్డ, వైజయంతీమ్ అపి = వైజయంతీ అనే వనమాలను కూడా, హిత్వా= విడచిపెట్టి, మిథః= పరస్పరం, ప్రతిఘాత = ఒరుసుకొన్నందువల్ల, లోలాః = చలిస్తున్నవై (గుండ్రంగా తిరుగుతున్నవై), బర్హ = నెమలిపింఛాలతో చేయబడ్డ, ఆతపత్ర = గొడుగుయొక్క, రుచిం = శోభను, ఆచరయంతి = కలుగజేస్తున్నాయి.

మాకు నాయకురాలివి అయిన ఓ గోదాదేవీ! నీవు ముడుచుకొని తీసి ఇచ్చిన పూమాలికను ధరించడంచేత సుగంధం కల్గినదిగా చేయబడిన అందమైన కిరీటంతో కూడినవాడై భగవానుడయ్యాడు. అటువంటి భగవానుని వక్షఃస్థలంలో ప్రకాశించే వైజయంతి అనే వనమాలికను సైతం విడచి, తుమ్మెదలు ఒకదానితో ఇంకొకటి స్పర్ధిస్తూ గెంటుకుంటూ భగవానుని కిరీటాన్ని అలంకరించి, నీ ఆముక్తమాలికలో ప్రవేశించి, అచటి తేనెను ఆస్వాదించాలని ప్రయత్నించినా, ఆ విధంగా అవి అవకాశం పొందలేక, ఇంకా ఎపుడైనా అవకాశం లభించకపోతుందా! - అనే ప్రత్యాశతో కిరీటంపై గుండ్రంగా తిరుగుతూ, నెమలిపింఛాలతో చేయబడ్డ గొడుగు పట్టుకొన్నప్పటి శోభను కల్గిస్తున్నాయి.

గోదాదేవి తాను ముడుచుకొని తీసి ఇచ్చిన పూమాలిక అప్రాకృతమైన వనమాలిక కంటే చాలా గొప్పది- అనే విషయాన్ని శ్రీదేశికులు చమత్కారంగా ఇందులో అనుగ్రహిస్తున్నారు. **"మిన్ననైయ నుణ్ణిడైయార్ విరికుళ్ళల్మేల్ నుళ్ళైన్ద వణ్డు ఇన్నిశైక్కుమ్"** (మెఱుపువలె సన్నని నడుమును కల వనితల కేశపాశంలో ప్రవేశించిన తుమ్మెద మధురంగా ధ్వనిస్తుంది) అనే రీతిలో కురులలో అలంకరించు కొన్న పూలలోని తేనెను తాగాలనే ఆశతో తుమ్మెదలు వచ్చి మోగడం సహజం. అదే రీతిలో భగవానుని కిరీటంపైన కూడా తుమ్మెదలు గుంపులుగా గుమిగూడి ధ్వనిస్తున్నాయి. స్వామి వక్షఃస్థలంలో వనమాల అలంకరింపబడి ఉన్నా, అక్కడ

ఒక్క తుమ్మెదకూడా ఝుంకారం చేయకుండా కిరీటంపైననే మోగడానికి ఏమి కారణమై ఉంటుంది? అని విమర్శించినపుడు, గోదాదేవి ముడుచుకొని సమర్పించిన గొప్ప మాలిక ఈ కిరీటంపైననే ఉండడంవల్ల, దాని భోగ్యతాతి శయంలో అభినివేశాన్ని పొంది అక్కడే మోగుతున్నదని కవి అంటున్నారు.

**"మిథః ప్రతిఘాతలోలాః"** అని అన్నందువల్ల వేలాది సంఖ్యలో తుమ్మెదలు అక్కడకు చేరినట్లు, ముందుగా కొన్ని తుమ్మెదలు మాలికపై వాలగా, మిగిలిన తుమ్మెదలు సంఘర్షణకులోనై అడ్డగింపబడి, అక్కడనుండి దూరంగా తొలగిపోవడానికి ఇష్టం లేక, "ఏదో ఒక సమయంలో అయినా మనకు ఇక్కడ చోటు దొరకుతుందేమో!" అనే ఆశతో అక్కడనే పైన గుండ్రంగా గుమిగూడి ఎగురు తున్నవని వ్యక్తమవుతున్నది. కేశపాశంలోని మాలెలో చేరలేని సమయంలో కూడా తుమ్మెదలకు వైజయంతీమాలవద్దకు చేరడంలో ఆసక్తి లేదని తెలుపడంద్వారా మౌళి (కేశపాశంలోని) మాలకు గల సాటి మేటి లేని గొప్పతనాన్ని కవి సూచించారు.

**"భుజాంతరగతామపి"** అని అన్నందువల్ల కంటికి సులభంగా కన్పడే వక్షః స్థలంలో వనమాల ప్రకాశిస్తున్నా తుమ్మెదలు అన్నీ దానివైపు పోనే లేదు- అని, కేశపాశంలోని మాలె ఆ విధంగా కాకుండా శ్రమపడి దర్శించదగినచోట ఉన్నది అయినా, ఆకర్షణశక్తి దానిలో నిండుగా ఉన్నదని తెలుపబడింది.

**"బర్హాతపత్రరుచిమ్ ఆరచయంతి"** అని ప్రయోగించినందువల్ల ఆణ్డాళ్ యొక్క కటాక్షానికి లక్ష్యభూతులైనవారు **"కుడైని*ழ*ల్ పొలివర్ తామే'** (అధికార ఛత్రపు నీడలో వృద్ధిపొందుతారు) అనే రీతిలో ఇహలోకైశ్వర్యాన్ని పొందుతారని సూచింపబడింది.

15. **ఆమోదవత్యపి సదా హృదయంగమాఽపి**
**రాగాన్వితాఽపి లలితాఽపి గుణోత్తరాఽపి ।**
**మౌళిస్రజా తవ ముకుందకిరీటభాజా**
**గోదే ! భవత్యధరితా ఖలు వైజయన్తీ ॥**

గోదే = గోదాదేవీ !, వైజయంతీ = వైజయంతి అనే వనమాలిక, సదా = ఎల్లప్పుడు, ఆమోదవతీ అపి = పరిమళాన్ని కల్గినది అయినా (ఆనందాన్ని కల్గినది అయినా), హృదయంగమా అపి = వక్షఃస్థలంలో ఉంటూ మనస్సుకు ఆనందాన్ని కల్గించేది అయినా, (మనస్సుకు భోగ్యమైనది అయినా), రాగ+అన్వితా అపి = ఎఱ్ఱని రంగును కల్గినదైనా (అనురాగాన్ని కల్గినదైనా), లలితా అపి = మృదులమైనది అయినా, (మృదుస్వభావాన్ని కల్గినదైనా), గుణ+ఉత్తరా అపి = ఇంకా మిగిలిన ఎన్నో గుణాలతో గొప్పది అయినా (సద్గుణాలను నిండుగా కల్గినదైనా), ముకుంద= భగవానుని, కిరీటభాజా = కిరీటాన్ని ఆశ్రయించిన, తవ మౌళిస్రజా = నీ తలలో అలంకరించుకొని తీసి ఇచ్చిన మాలికచేత, అధరితా ఖలు = చాలా తక్కువది అయేటట్లు చేయబడినదిగాకదా, భవతి = ఉన్నది.



గోదాదేవీ ! వైజయంతి అనే వనమాల గొప్ప పరిమళంతో కూడినది అయినా, ఎల్లప్పుడూ హృదయంగమంగా ఉన్నా, పుష్పానికి సహజంగా ఉండదగిన చక్కని రంగు ఏమాత్రం తగ్గకుండా కల్గినదైనా, సౌకుమార్యాన్ని కల్గి ఉండడంలో ఏలోటు లేకపోయినా, ఇంకా అన్ని గుణసంపదలను కల్గినదైనా, భగవానుని శిరస్సును చేరిన నీ ఆముక్తమాలికచే అధరీకరింపబడినది అయినది.

శ్లోకంలోని **"ఖలు"** అనే అవ్యయం ప్రసిద్ధమైన అర్థాన్ని తెలుపుతుంది. కనుక, వైజయంతి క్రింది స్థానంలో ఉండడాన్నిబట్టి, గోదాదేవి ఆముక్తమాలిక ఉన్నత స్థానంలో ఉండడాన్నిబట్టి ఈ రెండిటి తారతమ్యం లోకానికి తెలిసినదేకదా ! దీనిని మనం ప్రత్యేకించి నిరూపించాలా !- అనే అభిప్రాయం ఈ అవ్యయప్రయోగం ద్వారా వ్యక్తమవుతున్నది.

గోదాదేవి మాలికకు, వనమాలికకు తుల్యంగా ఉండే (సాధారణమైన) వైలక్షణ్యాలను శ్లోకంలోని పూర్వార్ధంలో తెలిపి, గోదాదేవి మాలికకుమాత్రం ఉన్న అసాధారణాలైన రెండు వైలక్షణ్యాలను మూడవ పాదంలో శ్రీదేశికులు అనుగ్రహిస్తున్నారు.

**(ఆమోదవత్యపి)** - సౌగంధ్యాన్ని కల్గి ఉండడం రెండిటికి సమానం.

**(హృదయంగమాఽపి)** - వనమాలిక హృదయప్రదేశాన్ని (వక్షస్సును) పొంది ఉన్నది. గోదాదేవి ఆముక్తమాలిక భగవానునకు మనోహరంగా ఉన్నది. (**"హృదయం గమ"**మనే శబ్దానికి హృదయాన్ని హరించేదనే అర్థం ప్రసిద్ధం.)

**(రాగాన్వితాఽపి)** - వనమాల ఎఱ్ఱనిరంగును కల్గి ఉంటుంది. ఆణ్డాళ్ పూమాలిక ఎఱ్ఱని రంగును కల్గి ఉండడంతో పాటు, అనురాగాన్ని కూడా కల్గి ఉన్నది. ఆణ్డాళ్ అనురాగమే పూమాలికగా రూపొందింది- అని తాత్పర్యం.

**(లలితాஉపి)** -సౌకుమార్యం ఉభయసాధారణం.

**(గుణోత్తరాஉపి)**- గుణాలతో గొప్పదై ఉండడం కూడా రెండిటికి సమానమే. పూలను మాలగా కూర్చే సాధనమైన నారకు (దారానికి) గుణమనే పేరు (సంస్కృతంలో) ఉన్నందువల్ల, గోదాదేవిమాలిక పక్షంలో ఆ అర్థంకూడా అనుసంధేయం. ఉభయసాధారణాలైన అంశాలు మొదటి రెండు పాదాలలో తెలుపబడ్డాయి.

ఇక, మూడవ పాదంలో గోదాదేవిమాలికకు అసాధారణంగా చెప్పబడే వైలక్షణ్యం ఏమంటే- **"ముకుందకిరీటభాజా"** అనే విశేషణపదంతో భగవానుని కిరీటాన్ని అధిరోహించి ఉండగల్గడం అనే ఆధిక్యం, **"తవ మౌలిస్రజా"** అనే విశేష్యపదంతో ఆణ్డాళ్ శిరసావహింపబడడం - అనే వైలక్షణ్యం.

నైషధకావ్యంలోని దమయంతీ కేశపాశవర్ణనసందర్భంలో **"చికురప్రకరా జయంతి తే విదుషీమూర్ధని సా బిభర్తి యాన్, పశునాஉప్యపురస్కృతేన తత్తులనా మిచ్ఛతు చామరేణ కః"** అనే ఒక శ్లోకం ఉన్నది. దమయంతి కేశాలకు ఉండే వైలక్షణ్యం ఏమంటే, ఆమె శిరస్సుపై అధిరోహించగల్గడమే దానికి గల అతిశయం- అని చమత్కారంగా ఇందులో చెప్పబడుతున్నది. అదే రీతిలో గోదాదేవియొక్క కేశాలపై అధిరోహించగల్గడమే ఈ మాలికకు గల అతిశయం- అని ప్రకృత భావం. ఈవిధంగా దివ్యదంపతుల శిరోభూషణంగా ఉండడం- అనే సాటి మేటి లేని గొప్పతనాన్ని గోదాదేవి ఆముక్తమాలిక పొందింది. వనమాలికకు ఇటువంటి అతిశయం కొంచెంకూడా లేదు. ఆమోదవత్త్వం మొదలైన వేఱు కొన్ని వైలక్షణ్యాలున్నా, ఇవి గోదాదేవి మాలికకుకూడా ఉన్నవి కనుక, సాధారణధర్మాలతో పాటు అసాధారణధర్మాలనుకూడా పొందిన గోదాదేవి మాలికయే రెండిటిలో గొప్పది. ఈ అతిశయం మనం ప్రత్యేకించి చెప్పవలసిన పని లేని రీతిలో రెండిటియొక్క స్థానాలే స్పష్టంగా తెలుపుతున్నవి- అని భావం.

ఇంచుమించుగా సమానమైన ధర్మాలను కల్గిన ఇద్దఱు యువతులకు మధ్య పరస్పరం కలహం ఏర్పడి, వారిలో ఒకతె ఇంకొకతెను కిందకు తోసి, జయించి నిలచి, విజయాన్ని పొందింది- అనే ఒక వినోదమైన వృత్తాంతం కూడా ఈ శ్లోకంలో ధ్వనిస్తుంది. **"ఆమోదవత్యపి"** ఇత్యాదిగా చెప్పబడ్డ గుణాలు ఇద్దరు స్త్రీలకు సాధారణాలు. ఆమోదమనే పదం ప్రకృతంలో సంతోషమనే అర్థాన్ని ఇస్తుంది.



**(హృదయంగమా)** ప్రియుని మనస్సును విడచి ఉండనిది. **(రాగాన్వితా)** అనురాగంతో కూడినవి.

**(లలితా)** ఒకవిధమైన శృంగారచేష్టితాన్ని కల్గినది. **"భ్రూనేత్రాది క్రియాశాలి సుకుమారవిధానతః, హస్తపాదాంగవిన్యాసం కుర్వతీ లలితా మతా"** అనే లలితా నిర్వచనం స్మరణీయం.

**(గుణోత్తరా)** -సౌందర్యం, లావణ్యం మొదలైన గుణాలతో గొప్పది- అని ఈ విధంగా గంభీరమైన అర్థాలను ఈ వృత్తాంతానికి అనుగుణంగా గ్రహించాలి.

16. **త్వన్మౌళిదామని విభోః శిరసా గృహీతే**
**స్వచ్ఛన్దకల్పితసపీతిరసప్రమోదాః ।**
**మఞ్జుస్వనా మధులిహో విదధుః స్వయం తే**
**స్వాయంవరం కమపి మఙ్గళతూర్యఘోషమ్ ॥**

విభోః = ప్రభువైన నీ నాయకునియొక్క, శిరసా = శిరస్సుతో, గృహీత = గ్రహింపబడ్డ, త్వత్ మౌళిదామని = నీ కిరీటంలోని మాలికలో, స్వచ్ఛంద = తమ ఇష్టానుసారంగా, కల్పిత = కల్పింపబడ్డ, సపీతిరస = ఒకటిగా చేరి పానం చేసే రసంచేత, ప్రమోదాః = గొప్ప ఆనందాన్ని కల్గినవై, మంజుస్వనాః = తీయని స్వనాన్ని (ధ్వనిని) కల్గినవి అయిన, మధులిహః = తుమ్మెదలు, తే = నీకు, స్వాయంవరం= స్వయంవరానికి తగిన, కమ్ అపి = అపూర్వమైన, మంగళతూర్యఘోషం = మంగళవాద్యాల ధ్వనిని, స్వయం = స్వయంగా, విదధుః= చేశాయి.

గోదాదేవీ! భగవానుని శిరస్సుచే ధరింపబడ్డ నీ కేశమాలికలో యథేష్టంగా చేరి మధుపానం చేసి, మత్తెక్కినవై, చెవులకు తీయగా ఝుంకారాన్ని చేస్తున్న తుమ్మెదలు నీ స్వయంవరమహోత్సవానికి తగిన ఒక విలక్షణమైన మంగళ వాద్యధ్వనిని చేస్తున్నవి.

గోదాదేవి స్వయంవరమహోత్సవానికి **"మత్తళమ్ కొట్ట వరిశఙ్గమ్ నిన్నూత"** (మద్దెలను వాయించగా, గొప్ప శంఖాన్ని ఊదగా) అనే రీతిలో లౌకికవాద్యఘోషం అక్కర లేదు. ఈమె కేశమాలిక భగవానుని కిరీటాన్ని అధిరోహించినపుడు, ఆ మాలిక లోనికి తుమ్మెదలు వచ్చి, గుంపులు గుంపులుగా చేరి, తేనెను తాగి మత్తెక్కి, ధ్వనించే నాదమే మంగళవాద్య ధ్వని అవుతున్నది- అని ఇక్కడ ఉల్లేఖింపబడింది.

ఈ శ్లోకంలో గోదాదేవి స్వయంవరమనే వివాహం సందర్భంయొక్క ప్రస్తావం చేయబడినదానికి తగినట్లు ఇందులో ప్రయోగింపబడిన శబ్దాలు అన్నీ మంగళ మయంగా కూర్చబడడంలోని అందం గమనింపదగినది. లోకంలో, వివాహసమయా లలో పూలు ముడుచుకోవడం, అందఱు కలసి భుజించడం, సంతోషాన్ని అనుభవించడం, మంగళనాదం అంతట వ్యాపించడం, భోగ్యపదార్థాలను ఆస్వాదించడం, మంగళవాద్యాలు మోగడం- మొదలైనవి జరగడం సహజం. ఇవి అన్నీ ఈ శ్లోకంలోని శబ్దప్రయోగవైఖరివల్ల సూచింపబడ్డాయి. శ్లోకంలోని మొదటి పాదంలో పూలు ముడువడం సూచింపబడింది. **"సపీతి"** అని అనడంవల్ల కలసి భుజించడం సూచింపబడింది. **"ప్రమోద"** శబ్దంతో సంతోషాన్ని అనుభవించడం తెలుపబడింది. **"మంజుస్వనాః"** అని అనడంద్వారా మంగళవాద్యం మోగడం చెప్పబడింది. **"మధులిహః"** అని అనడంవల్ల తీయని భోజనం భుజించడం తెలుపబడింది. చివరి పాదంతో మంగళాద్యఘోషం తెలుపబడింది.

ఇటువంటి పదప్రయోగసౌందర్యం కవిసామర్థ్యాన్ని చక్కగా తెలుపుతున్నది.

**17.** విశ్వాయమానరజసా కమలేన నాభౌ
వక్షఃస్థలే చ కమలాస్తనచన్దనేన ।
ఆమోదితోఽపి నిగమై ర్విభురఙ్ఘ్రియుగ్మే
ధత్తేన తేన శిరసా తవ మౌళిమాలామ్ ॥

విభుః = ప్రభువైన నీ నాయకుడు, విశ్వాయమాన = లోకాలై పరిణమిస్తున్న, రజసా = పుప్పొడులను కల, కమలేన = కమలంతో, నాభౌ = బొడ్డులో, కమలాస్తనచందనేన = లక్ష్మీదేవి స్తనాలలోని చందనంతో, వక్షఃస్థలే చ = వక్షః స్థలంలోను, నిగమైః= వేదాలతో, అంఘ్రియుగ్మే = రెండు శ్రీచరణాలలో, ఆమోదితః అపి = పరిమళింపజేయబడినా, తవ = నీయొక్క, మౌళిమాలాం = శిరస్సులో అలంకరింపబడి తీయబడ్డమాలికను, నతేన = వంచిన, శిరసా = కిరీటంతో, ధత్తే = ధరిస్తున్నాడు.

గోదాదేవీ! ఒక్కొక్క రజస్సు (పుప్పొడి రేణువు) ఒక్కొక్క లోకంగా పరిణ మించే రీతిలో పలు రజస్సులను కల తామరపూవుతో తిరునాభిలోను, లక్ష్మీదేవి యొక్క స్తనతటాలలోని చందనంతో వక్షఃస్థలంలోను, వేదాలచే శ్రీచరణద్వంద్వం



లోను భగవానుడు సుగంధాన్ని పొందినా, (ఈ పరిమళాలతో తృప్తి చెందనివాడై) నీ కేశమాలికను శిరసా వహిస్తున్నాడు.

భగవానుడు ఉపనిషత్తులలో **"సర్వగంధః"** అనే ప్రసిద్ధిని పొందినవాడు. అంతేకాక, **"కొప్పూఴిల్ ఎఴుమ కమలప్పూ అఴకర్"** అనే రీతిలో తిరునాభిలో తామరపూవుతో పరిమళం, **"శ్రీస్తనకస్తూరీవాసనావాసితోరసే"** అని, **"శ్రీస్తనకస్తూరీ మకరీముద్రితోరసః"** చెప్పే అనే రీతిలో లక్ష్మీదేవియొక్క స్తనతటంలోని చందనంతో వక్షఃస్థలంలోని పరిమళం. **"యస్య సారస్వతం స్రోతో వకుళామోదవాసితమ్"** (ఎవరి సారస్వతప్రవాహం వకుళామోదంతో వాసితమైనదో) అని యతిరాజస్తపతిలో అనుగ్రహింపబడినట్లు వకుళమాలికామోదం నిండిన తిరువాయ్మొఴిచే శ్రీచరణాల లోని పరిమళం- ఈ విధంగా పరిమళప్రాచుర్యం నిండి ఉన్నా, భగవానుడు ఈ పరిమళాలు అన్నిటికంటే గొప్పదైన ఒక విలక్షణమైన పరిమళాన్ని పొందాలనే ఆశను పొందాడు. ఆణ్డాళ్ కురులలోని మాలికలను తన శిరస్సుతో కోరి పొంది ధరిస్తున్నాడు. దీనివల్ల **"శూడికొడుత్త శుడక్కొడి"** కేశమాలికయొక్క పరిమళం నిస్సమాభ్యధిక మైనది- అని తెలుపబడింది.

మూడవ పాదంలో **"నిగమైః"** అనే పదం ద్రావిడవేదాన్ని ఉద్దేశించే ప్రయోగింప బడినదనడంలో ఔచిత్యం ఉన్నది. **"అంఘ్రియుగ్మే"** అనేది. **"తిరువడిమేల్ ఉరైత్త తమిఴ్ ఆయిరత్తుళ్"** (భగవానుని శ్రీచరణాలను ఉద్దేశించి పల్కిన ద్రావిడ పాశురాల వేయిలో) అనే ప్రయోగాన్ని దృష్టిలో పెట్టుకొని చేసిన ప్రయోగం- **"యస్య సారస్వతం స్రోతో వకుళామోద వాసితమ్, శ్రుతీనాం విశ్రమాయాలం శఠారిం తముపాస్మహే"** అనే యతిరాజసప్తతి దివ్యసూక్తిద్వారా తిరువాయ్మొఴిలోని పరిమళ ప్రాచుర్యం తెలుపబడినందువల్ల **"నిగమైరామోదితః"** అనే ప్రయోగం దానికి చాలా పొసగి ఉన్నది.

**(విశ్వాయమానరజసా)** తామరపూవులో పుప్పొడి రేణువులు ఉండడం సహజం. కనుక, భగవానుని తిరునాభీకమలంలోకూడా పుప్పొడి రేణువులు (రజః కణాలు) ఉన్నట్లు తెలుపబడింది. ఆ కమలం సకలలోకసృష్టికి కారణభూతం. కనుక, ఒక్కొక్క రేణువు ఒక్కొక్క లోకంగా పరిణమించింది- అని చమత్కారంగా పలికారు- శ్రీదేశికులు.

**18.** చూడాపదేన పరిగృహ్య తవోత్తరీయం
మాలామపి త్వదలకై రధివాస్య దత్తామ్ ।

ప్రాయేణ రఙ్గపతి రేష బిభర్తి గోదే !
సౌభాగ్యసంపదభిషేకమహాధికారమ్ ॥

గోదే = గోదాదేవీ! తవ =నీయొక్క, ఉత్తరీయం = ఉత్తరీయం (పైన ధరించే వస్త్రం), త్వత్ అలకైః= నీముంగురులచేత, అధివాస్య = పరమళింపజేయబడి, దత్తాం = ఇవ్వబడిన, మాలామ్ అపి = మాలనుకూడా, చూడాపదేన = శిరస్సుతో, పరిగృహ్య = పరిగ్రహించి, ఏషః = ఈ, రంగపతిః= శ్రీరంగనాథుడు, సౌభాగ్య = మాంగల్యమనే, సంపత్ = సంపదలో, అభిషేక = పట్టాభిషేకానికి తగిన, మహాధి కారం = గొప్ప యోగ్యతను, ప్రాయేణ = ఇంచు మించుగా, బిభర్తి = పొందు తున్నాడు.

గోదాదేవీ! ఈ శ్రీరంగనాథుడు నీ ఉత్తరీయాన్ని, నీ కేశాలవల్ల పరిమళాన్ని పొంది పిమ్మట సమర్పింపబడ్డ పూమాలికను శిరస్సుతో ధరించి, సౌభాగ్యమనే సంపదలో అభిషిక్తుడు కావడానికి తగిన యోగ్యతను పొందాడు.

భగవానుని సంబంధలేశంచేత మిగిలినవారికి సౌభాగ్యం కలుగుతూ ఉండగా, గోదాదేవియొక్క ఉత్తరీయాన్ని, కేశమాలికను శిరసా వహించడంవల్లనే భగవానునకు సౌభాగ్యం ప్రవక్తమైనది -అని పల్కడం- భగవానుని మనస్సులోని అభిప్రాయాన్ని అనుసరించియే. గోదాదేవియొక్క ప్రసాదసంబంధనిబంధనంగానే భగవానుడు తనకు సౌభాగ్యం కల్గిందని అభిమానిస్తున్నాడు- అనేది ఏవిధంగా తెలుస్తున్నది ? అని అంటే, ఆ ప్రసాదంలో ఈ నాటికి అతడు చూపించే ఆదరాతిశయంద్వారా తెలుస్తున్నదని తాత్పర్యం.

గోదాదేవి కేశమాలికనువలెనే, ఆమె ఉత్తరీయాన్నికూడా భగవానుడు అభిలషించి, తన శిరస్సుపై ధరించడం ప్రసిద్ధం. "ప్రాయేణ" అనే పదం ఉత్ప్రేక్షా వ్యంజకం.

**19.** తుఙ్గై రకృత్రిమగిరః స్వయ ముత్తమాఙ్గైః
యం సర్వగన్ధ ఇతి సాదర ముద్వహన్తి ।
ఆమోద మన్యమధిగచ్ఛతి మాలికాభిః
సోఽపి త్వదీయకుటిలాలకవాసితాభిః ॥

అకృత్రిమగిరః= వేదవాక్కులు, తుంగైః = ఉన్నతాలైన, ఉత్తమాంగైః = శిరస్సులతో, యం = ఏ భగవానుని, సర్వగంధః ఇతి = అన్ని సుగంధాలను కలవాడని, స్వయం =తామే, సాదరం = ఆదరంతో, ఉద్వహంతి = స్తుతిస్తున్నాయో, సః అపి = ఆ భగవానుడు కూడా, త్వదీయ = నీకు చెందిన, కుటిల =గుండ్రని, అలక = ముంగురులచేే, వాసితాభిః = పరిమళాన్ని పొందిన, మాలికాభిః= మాలికలతో, అన్యం = విలక్షణమైన, ఆమోదం = పరిమళాన్ని (సంతోషాన్ని), అధిగచ్ఛతి = పొందుతున్నాడు.



గోదాదేవీ ! వేదాలు తమ గొప్ప శిరస్సులతో (వేదాంతాలద్వారా) ఏభగవానుని **"సర్వగంధః"** అని అంటూ ఆదరంతో వహిస్తున్నవో, ఆ భగవానుడు సైతం నీ కుటిలాలకలపరిమళం చేత వాసితమైన మాలికలతో విలక్షణమైన ఒక పరిమళాన్ని పొందుతున్నాడు.

ఛాందోగ్యోపనిషత్తులోని (3-14-4) **"సర్వకర్మా సర్వకామః సర్వగంధః సర్వరసః సర్వమిద మభ్యాత్తోఽ వాక్యనాదరః"** అనే వాక్యంలో భగవానుడు **"సర్వగంధః"** అని అధ్యయనం చేయబడుతున్నాడు. సకలవిధాలైన సుగంధాలు భగవానునివద్ద ఉన్నాయని దీనిద్వారా తెలుపబడింది. ఈ రీతిలో సహజంగానే సకలసుగంధాలకు భగవానుడు ఆకరంగా ఉన్నా, గోదాదేవి ముడుచుకొని తీసి ఇచ్చిన మాలికను తాను ధరించి, అతడు విలక్షణమైన సుగంధాన్ని పొందుతున్నాడట. **"ఆమోదమ్"** అనే సంస్కృతపదానికి **"పరిమళం"** అనే అర్థం ఉన్నట్లే, సంతోషమనే అర్థంకూడా ఉన్నందువల్ల గోదాదేవి ముడుచుకొని తీసి ఇచ్చిన మాలికను అలంకరించుకొని భగవానుడు విలక్షణమైన మానసికానందాన్ని పొందాడనే భావంకూడా ఇక్కడ వ్యక్తమవుతున్నది.

"భగవానుడు వేదాంతప్రతిపాద్యుడు'' అనే విషయాన్ని "వేదాలుకూడా భగవానుని తమ శిరస్సులతో ధరిస్తున్నాయి'' అని అంటూ తెలుపడం ఒక వాక్చమత్కృతి. వేదాల శిరస్సును తన సంబంధంతో సుగంధభరితం చేస్తున్న భగవానుడు స్వయంగా తన కిరీటాన్ని సుగంధభరితం చేసే గోదాదేవి కేశమాలికను అభిలషిస్తున్నాడు- అని అలంకారాత్మకంగా శ్రీదేశికులు పలికారు.

**(అకృత్రిమగిరః)** - మనవంటి పురుషులచే రచింపబడినవి **"కృత్రిమగిరః"**. అటువంటివి కానివి **"అకృత్రిమగిరః"** -అపౌరుషేయాలైన వేదాలు- అని భావం. ఉత్తమాంగశబ్దంచేత వేదాంతభాగమైన ఉపనిషత్తులు తెలుపబడ్డాయి. **"తుంగైః"** అనే విశేషణం వేదంయొక్క గొప్పతనాన్ని వ్యక్తం చేస్తున్నది.

(కుటిలాలక....) శిరోజాలకు కుటిలత్వం గొప్పగా వర్ణించడం కవిసమయం. భగవద్ధ్యానసోపానస్తోత్రంలో "కుష్యచ్ఛేలీవచనకుటిలైః కుంతలైః" అని అంటూ ఈ కవియే (దేశికులే) అనుగ్రహించడం ఇక్కడ అనుసంధేయం.

**20. ధన్యే సమస్తజగతాం పితు రుత్తమాఙ్గే**
**త్వన్మౌలిమాల్యభరసంభరణేన భూయః ।**
**ఇన్దీవరస్రజ మివాదధతి త్వదీయాని**
**ఆకేకరాణి బహుమానవిలోకితాని ॥**

త్వత్ మౌళి = నీ కిరీటంలోని, మాల్యభర = మాలికల భారాన్ని, సంభరణేన= ధరించడంచేత, ధన్యే = ధన్యమైన, సమస్తజగతాం = అన్ని లోకాలకు, పితుః = తండ్రి అయిన భగవానుని, ఉత్తమాంగే = శిరస్సులో, త్వదీయాని = నీకు సంబంధించినవి, ఆకేకరాణి = అరమోడ్పు కన్నులను కల, బహుమాన = గొప్ప గౌరవంతో కూడిన, విలోకనాని = చూపులు, భూయః= తిరిగి, ఇందీవరస్రజాం = నల్లకలువల మాలను, ఆదధతి ఇవ = రచించినట్లున్నవి.

గోదాదేవీ ! నీ ఘనమైన కేశమాలికను అలంకరించుకోవడంవల్ల కృతార్థమైన, అన్ని లోకాలకు తండ్రి అయిన భగవానుని కిరీటంపై నీవు మిక్కిలి ఆదరంతో ప్రసరింప చేసే కటాక్షవీక్షణాలు నల్లకలువల మాలను అతడు అలంకరించుకొన్న అందాన్ని సంతరిస్తున్నాయి.

గోదాదేవి, భగవానుని దివ్యావయవాలు ఎన్నో ఉన్నా, కిరీటాన్నే చాలా ఆదరంతో ఊనికతో చూస్తున్నదట. ఎందుకు ? అని అంటే, "నేను ముడుచుకొని, తీసి ఇచ్చిన మాలికను భగవానుడు ఇంత ఆదరంతో గ్రహించి అలంకరించు కొంటున్నాడే !"- అనే సంతోషాతిశయంవల్ల ఆమె కిరీటాన్నే ఎక్కువ ఆదరంతో చూస్తున్నది. గోదాదేవి **"కువలయజ్కణ్ణి"** అన్నట్లు నల్లకలువలవంటి అందమైన కన్నులను కల్గినది కనుక, నల్లకలువల కాంతివంటి కాంతియే ఆమె కటక్షవీక్షణాల మార్గంలో భగవానుని కిరీటంపై ప్రసరిస్తున్నది. అందుచేత, ఇంతకు ముందే గోదాదేవి అలంకరించుకొని తీసి ఇచ్చిన కదంబమాలను అలంకరించు కోవడంతోపాటు, నల్లకలువల మాలికను కూడ అలంకరించుకొన్నట్లు భగవానుని కిరీటం ప్రకాశిస్తున్నది- అని అంటూ శ్రీదేశికులు ఇందులో వర్ణిస్తున్నారు.



తత్త్వముక్తాకలాపమనే గ్రంథం మంగళశ్లోకమైన **"లక్ష్మీనేత్రోత్పలశ్రీ"** ఇత్యాది శ్లోకభావం ప్రకృతంలో ఒక విధంగా స్మరణీయం. **"భూయః"** అనే పదం పూర్వార్ధం లోను అన్వయించవచ్చు; ఉత్తరార్ధంలోకూడా అన్వయించవచ్చు. భగవానుని కిరీటం ధన్యమైనా, గోదాదేవి కేశమాలికను అలంకరించుకోవడంవల్ల ఇంకా ధన్యమైనది- అనేది పూర్వార్ధంలో అన్వయించడంవల్ల స్ఫురించే భావం. భగవానుని కిరీటం, గోదాదేవియొక్క కేశమాలికను మాత్రమేకాక కటాక్షాల మాలనుకూడ అలంకరించు కొని ప్రకాశిస్తున్నది- అనేది ఉత్తరార్ధంలో అన్వయించడంద్వారా స్ఫురించే భావం.

**"ఆకేకరాణి"** - అనేటపుడు **"ఆకుంచితపుటాపాంగసంగతార్ధనిమీలితా, ముహుర్వ్యావృత్తతారా చ దృష్టిరాకేకరా మతా"** అనే లక్షణవచనం స్మరణీయం. స్త్రీల ప్రకృతికి (స్వభావానికి- బిడియానికి) తగినట్లుగా, పూర్తిగా గుచ్చి గుచ్చి చూడకుండా, అరమోడ్పు కన్నులతో చూచే చూపు- అని భావం.

**21. రఙ్గేశ్వరస్య తవ చ ప్రణయానుబన్ధాత్**
**అన్యోన్యమాల్యపరివృత్తి మభిష్టువన్తః ।**
**వాచాలయన్తి వసుధే ! రసికా స్త్రిలోకీం**
**న్యూనాధికత్వసమతావిషయై ర్వివాదైః ॥**

వసుధే = భూదేవియొక్క అంశమైన ఓ గోదాదేవీ ! రంగ+ఈశ్వరస్య = శ్రీరంగనాథునకు, తవ చ = నీకు మధ్య (గల), ప్రణయ = అనురాగంయొక్క, అనుబంధాత్ = అనుబంధంవల్ల, అన్యోన్య = పరస్పరం, మాల్యపరివృత్తిం = మాలెలను మార్చుకోవడాన్నిగూర్చి, అభిష్టువంతః = చాలా కీర్తించేవారై, రసికాః = రసికులు, న్యూన+ అధికత్వ సమతా విషయైః = మీ ఇద్దరి తక్కువ- ఎక్కు- సమానాలను గూర్చిన, వివాదైః = (చమత్కార పూర్వకమైన) వివాదాలతో, త్రిలోకీం = ముల్లోకాలను, వాచాలయంతి = ప్రతిధ్వనింప జేస్తున్నారు.

భూదేవీ అంశభూతమైన ఓ గోదాదేవి! శ్రీరంగనాథునకు, నీకు మీ ప్రేమచిహ్నంగా చేయబడే మాలికల మార్పును కీర్తించే రసికులు మిమ్ములను ఇద్దరను ఒకరితో ఇంకొకరిని ఎక్కువ చేసి పల్కడం, సమానంగా పల్కడం- అనే వివిధవాదవచనాలతో ముల్లోకాలను గొప్ప ధ్వనితో నిండినవాటినిగా చేస్తున్నారు.

వివాహసమయంలో నూతనవధూవరులకు పూమాలికలను మార్చే వేడుక జరగడం సంప్రదాయం. ఆ రీతిలోనే గోదాదేవీ కల్యాణసమయంలో కూడా ఆవేడుక

జరగడంలో లోటు లేదుకదా ! ఆ సమయంలో ఆ వినోదాన్ని చూచి ఆనందించాలని పలువురు భక్తులు గుంపులు గుంపులుగా కూడి చేరుతారు. ఆ సమూహంలో రసికులైనవారు మౌనంగా ఉండకుండా, తమతమ మనస్సులలో తోచిన రీతిలో వేడుకవచనాలను రస్యంగా పల్కుతారు. శ్రీరామునకు, సీతకు వివాహం జరిగిన కాలంలో "స్వామిని దర్శించాలంటే కన్నియకు వేయి కన్నులు కావాలి" అని **("నమ్బియై క్కాణ నజ్జెక్కు ఆయిరనయనమ్ వేణ్డుమ్")** కొందరు పల్కినట్లు, **"కొమ్బినైక్కాణున్దోఱుమ్ కురిశిఱ్ఱుమన్నదేయామ్"** అని మఱి కొందరు పల్కినట్లు కంబమహాకవి అన్నాడు కదా! అదేరీతిలో, ఇక్కడ కూడా భగవానుని తక్కువజేసి, గోదాదేవిని ఉన్నతంగా చేసి పలికేవారు, గోదాదేవిని తక్కువ జేసి, భగవానుని ఎక్కువ జేసి పలికేవారు, ఇద్దఱిని హెచ్చు తగ్గులు లేకుండా సమానంగా పలికేవారు- అనే ఈ రీతిలో పలువురు పలికే వచనాల సంరంభంవల్ల ముల్లోకాలు గొప్ప ధ్వనితో నిండిపోయాయి -అని శ్రీదేశికులు చమత్కరిస్తున్నారు.

భగవానుని, పిరాట్టిని దర్శించి స్తుతించే ఆచార్యులు పైన పేర్కొన్న మూడు రీతులలోని వచనాలను తమ దివ్యగ్రంథాలలో పలికారు. భగవానునకు శేషిత్వం, పిరాట్టికి శేషత్వం, అదే విధంగా భగవానునకు సకలజగత్పితృత్వప్రయుక్తమైన ఆధిక్యం, పిరాట్టికి పత్నీత్వప్రయుక్తమైన న్యూనత్వం అపలాపం చేయరానివి; చేయలేనివి. అందువల్ల ఈ రీతిలో శాస్త్రీయాలైన న్యూనత్వాధిక్యాలు ఉన్నా, ఒక అభినివేశ- అభిమానవిశేషంచేత **"జ్ఞానీ తు ఆత్మైవ మే మతమ్"** (జ్ఞాని నా ఆత్మయే అని నా అభిప్రాయం) అని భగవానుడుసైతం పల్కిన రీతిలో, పిరాట్టిని ఎక్కువ చేసి, భగవానుని తక్కువ చేసి, ఇరువురిని సమానంగా చేసి పూర్వాచార్యులు రసమయంగా పల్కిన సందర్భాలుకూడా ఉన్నాయి.

శ్రీపరాశరభట్టర్ శ్రీగుణరత్నకోశమనే స్తోత్రంలో **"శ్రియం త్వత్తోప్యుచ్చైః వయ మిహ ఫణామః"** (నీకంటే లక్ష్మిని ఉన్నతంగా మేము పల్కుతున్నాము), **"తవ స్పర్శాదీశం స్పృశతి కమలే! మంగళపదమ్"** (కమలాదేవి! నీ సంబంధం వల్ల భగవానుని మంగళపదం స్పృశిస్తున్నది) అని ఈరీతిలో పల్కడం ప్రసిద్ధంకదా! ఈ రీతిలో, గోదాదేవీ కల్యాణ మహోత్సవంలోకూడా రసికులు వినోదంగా చమత్కారంగా దివ్యదంపతులనుగూర్చి హెచ్చు తగ్గులను పల్కుతారు. "ఈ స్వామికి మా గోదాదేవి పత్ని కాకుండా ఉంటే, ఇతని పురుషోత్తమత్వం కాసుకు అయినా



పనికివస్తుందా!" అని ఆడపెళ్ళివైపువారు అంటారట. మీ గోదకు మా స్వామి వరుడు కాకుండాపోయి ఉంటే **"కోజ్గలరుమ్ పొழிల్ మాలిరుమ్ శోలైయిల్ కొన్రైకళ్ మేల్ తూఙ్గు పొన్మాలైకళోడుడనాయ్ నిన్ఱు తూఙ్గుకిన్రేన్"** (కోఙ్గ వృక్షాలు వికసించే తోటలను కల తిరుమాలిరుమ్శోలై లోని గన్నేరు చెట్లపై నిద్రించే బంగారు రంగులోని మాలికలతో సమంగా వ్యర్థంగా పడిఉన్నాను) అని అంటూ ఈమె పల్కిన రీతిలో ఈమె నిరుపయోగంగా ఉండి ఉండేదికదా!" అని మగపెళ్ళివైపు వారు అంటారట. ఈ రెండు పక్షాలలో చేరని మధ్యస్థులు కొందరు "వీరి ఇరువురి హెచ్చు తగ్గులను పల్కడంలో మనకేమి అర్హత ఉన్నది!" అని అంటూ ఇద్దరిని సమంగా కీర్తిస్తారట. అయితే, సమానంగా పలికే మాటలు గుర్తింపబడవు. హెచ్చు తగ్గులుగా పలికే వాది-ప్రతివాదుల మాటలతో గొప్ప రచ్చ అవుతుంది. ఆ సంరంభం **"త్రిలోకీం వాచాలయంతి"** అనే ప్రయోగంతో ఇక్కడ సూచింపబడింది.

దివ్యదంపతుల ఇద్దఱి మధ్య ఏకొంచెం కూడా విరోధం లేకపోయినా, ఈ విధంగా తారతమ్యాలు పల్కడం కేవలం వినోదాత్మకమేననే విషయాన్ని **"రసికాః"** అని అందంగా పదాన్ని ప్రయోగిస్తూ శ్రీదేశికులు సూచించారు.

**22.** దూర్వాదలప్రతిమయా తవ దేహకాన్త్యా
గోరోచనారుచిరయా చ రుచేన్దిరాయాః ।
**ఆసీదనుజ్ఝితశిఖావలకణ్ఠశోభం**
**మాఙ్గల్యదం ప్రణమతాం మధువైరిగాత్రమ్ ॥**

ప్రణమతాం = నమస్కరించేవారికి, మాంగల్యదం = మంగళాలను ప్రసాదించే, మధువైరిగాత్రం = భగవానుని తిరుమేని, దూర్వాదలప్రతిమయా = గరికదళాలవంటి, తవ దేహకాంత్యా = నీ తిరుమేనిశోభలో, గోరోచనారుచిరయా = గోరోచనవర్ణంవలె అందమైన, ఇందిరాయాః = లక్ష్మీదేవియొక్క, రుచా చ = కాంతితోను, అనుజ్ఝిత = విడువని, శిఖావల = నెమలియొక్క, కంఠశోభం = కంఠంయొక్క శోభను కల్గినదిగా, ఆసీత్ = అయినది.

గోదాదేవీ ! తనను సేవించే (నమస్కరించే) వారికి శుభాలను ప్రసాదించే భగవానుని తిరుమేని గఱికపోచరంగుతో పోలిన రంగును కల నీ తిరుమేనికాంతితో, గోరోచనంవంటి అందమైన శ్రీమహాలక్ష్మియొక్క తిరుమేని కాంతితో కలసి నెమలికంఠం రంగుయొక్క సొబగును నిరంతరం సంతరించుకొన్నది.

లక్ష్మీదేవి భగవానుని క్షణకాలం అయినా విశ్లేషించకుండా నిత్యయోగాన్ని కల్గి ఉన్నట్లే, గోదాదేవికూడా నిత్యయోగాన్ని కల్గి ఉండడాన్నిగూర్చి చాలా చమత్కారంగా శ్రీదేశికులు ఇందులో పల్కుతున్నారు.

**"తిరుమడన్తై మణ్మడన్తై ఇరుపాలుమ్ తికழ"** (లక్ష్మీదేవి, భూదేవి ఇరువైపుల ప్రకాశించగా) అనే రీతిలో భగవానుని ఇరువైపుల శ్రీదేవి-భూదేవులు వేంచేసి ఉండడం ప్రసిద్ధం. ఆణ్డాళ్ భూదేవి అంశంతో అవతరించినది కనుక, ఇక్కడ ఆణ్డాళ్ భూదేవిగా అధ్యవసాయం చేయబడుతున్నది. (భావించబడుతున్నది) లేక, ప్రత్యేకంగాకూడా భగవానుని పార్శ్వంతో గోదాదేవి వేంచేసి ఉండడం కూడా ప్రసిద్ధమే కనుక, ఆ సన్నివేశాన్ని మనస్సులో భావించి ఈ విధంగా చెప్పబడిందని కూడా అనవచ్చు. భూదేవియొక్క తిరుమేని వర్ణమే గోదాదేవియొక్క తిరుమేని వర్ణంగా ఇక్కడ చెప్పబడింది. అది గఱికపోచవర్ణంవంటి వర్ణం. శ్రీమహాలక్ష్మియొక్క వర్ణం గోరోచనవర్ణంవంటి వర్ణం. భగవానుని తిరుమేని అయితే, **"ముకిలురువమ్ ఎమ్మడికళురువమ్ తానే"** (మేఘవర్ణం మాస్వామి వర్ణం) అనే రీతిలో నీలమేఘ వర్ణంవంటి వర్ణాన్ని కల్గినది. పరస్పరం పరభాగాలైన (భిన్న భిన్న రీతులను కల్గిన) ఈ మూడు వర్ణాలు తమలో తాము కలసినపుడు చిత్రవర్ణంగా ప్రకాశించడం సంభావితం, సహజం. కనుక **"మధువైరి గాత్రం అనుజ్ఝితశిఖావలకంఠశోభమ్ ఆసీత్"** అని అన్నారు. రెండు వైపులలోని భిన్నవర్ణాలు ఒక్కొక్క విధమైన ప్రకాశాన్ని ప్రసరింపజేయగా, భగవద్దివ్యమంగళ విగ్రహం నెమలికంఠంవంటి రంగుతో ప్రకాశించే తీరునుగూర్చి శ్రీదేశికులు దర్శించి ఆనందంగా పల్కుతున్నారు.

"అనుజ్ఝితశిఖావల కంఠశోభమైన మధువైరిగాత్రం మాంగల్యదం అయినది"- అని అంటూ ఉద్దేశ్యవిధేయాలనుమార్చి అన్వయించి కొందఱు వ్యాఖ్యానించడం కవిహృదయాన్ని అనుసరిస్తున్నదా!- అని సహృదయరసికులు విమర్శించి నిర్ణయించాలి.

**23.** అర్చ్యం సమర్చ్య నియమై ర్నిగమప్రసూనైః
నాథం త్వయా కమలయా చ సమేయివాంసమ్ ।
మాతశ్చిరం నిరవిశన్ నిజమాధిరాజ్యం
మాన్యా మనుప్రభృతయోఽపి మహీక్షితస్తే ॥



మాతః = తల్లీ! గోదాదేవీ!, మాన్యాః = గౌరవింపదగిన, మనుప్రభృతయః= మనువు మొదలైన, తే మహీక్షితః అపి = ఆ ప్రభువులుకూడా, త్వయా = నీతో కమలయా = లక్ష్మీదేవితో  కలిసి, సమేయివాంసం = వేంచేసి ఉండే, అర్చ్యం = పూజించదగిన, నాథం = నీ నాయకుని, నియమైః = నియమాలతో, నిగమప్రసూనైః = ఆగమాలలో చెప్పబడ్డ పుష్పాలతో, సమర్చ్య = చక్కగా పూజించి, నిజం = తమయొక్క, ఆధిరాజ్యం = అధికారాన్ని, చిరం = చిరకాలం, నిరవిశన్ = అనుభవించారు.

తల్లీ! గోదాదేవీ! కీర్తించదగినవారైన ఆ మనువు మొదలైన మహారాజులు నీతో, లక్ష్మీదేవితో కూడి ఉండే పూజ్యుడైన నీ నాథుని నియమాలతో కూడిన వేదపుష్పాలతో ఆరాధించి, తమ సామ్రాజ్యాన్ని చిరకాలం పాలించి అనుభవించి ఆనందించారు.

పూదత్తాழ్వార్లు తమ ప్రబంధం ఇరణ్డామ్ తిరువన్దాదిలో **"కోవాకి మానిలమ్ కాత్తు నజ్గణ్ముకప్పే మావాకి చ్చెల్కిన్ఱ మన్నవరుమ్, పూమేవుమ్ శెజ్గమలనాబియాన్ శేవడిక్కే ఏழ్ పిఱప్పుమ్ తణ్కమలమేయ్న్దార్ తమర్"** అని అనుగ్రహించారు. లోకంలో మహారాజాధిరాజులై ఉండేవారంతా చిరకాలం భగవానుని ఆరాధించే తత్ఫలంగా ఆధిరాజ్యాన్ని పొందారు- అని ఆ పాశురంలోని భావం. వారు కేవలం బ్రహ్మచారి నారాయణుని ఆరాధించి, ఆ ఫలాన్ని పొందలేదు. లక్ష్మీదేవితో, ఆణ్డాళ్‌తో కూడిన భగవానుని ఆరాధించే ఆ అధికారాన్ని పొందారు- అని ఈ శ్లోకంలో శ్రీదేశికులు తెల్పుతున్నారు.

గోదాదేవి, పెరియాழ్వార్ల కుమార్తెకదా! ఈమె కాలానికి చాలా ముందున్న మనువు మొదలైన చక్రవర్తులు ఈమెతోకూడిన భగవానుని ఆరాధించారు- అని అనడం పొసగతుందా? - అని సందేహించవద్దు. మొదటి శ్లోకంలో **"సాక్షాత్ క్షమామ్"** అని పల్కిన రీతిలో భూదేవియే ఇక్కడ వివక్షితమని గ్రహించాలి. భూదేవికి ఆమె అంశతో అవతరించిన గోదాదేవికి మధ్య అభేధభావనతో పల్కిన సూక్తి ఇది.

**24.** ఆర్ద్రాపరాధిని జనేఽప్యభిరక్షణార్థం
రజ్గేశ్వరస్య రమయా వినివేద్యమానే ।
పార్శ్వే పరత్ర భవతీ యది తత్ర నాసీత్
ప్రాయేణ దేవి ! వదనం పరివర్తితం స్యాత్ ॥

దేవి = గోదాదేవీ !, జనే = చేతనసమూహం, ఆర్ద్ర+అపరాధిని అపి = అపరాధాలను చేసి కడుగుకొన్న చేతులు ఎండనివారైనా, అభిరక్షణార్థం =వారిని చక్కగా కాపాడడంకోసం, రమయా = లక్ష్మీదేవిచే, రంగేశ్వరస్య = శ్రీరంగనాథునకు, వినివేద్యమానే = విన్నపం చేయబడేటపుడు, తత్ర = అక్కడ, పరత్ర పార్శ్వే = వేఱొక వైపు, భవతీ = నీవు, యది న ఆసీత్ = లేకపోయినట్లయితే, వదనం = అతని ముఖం, ప్రాయేణ బహుశః పరివర్తితం = తిప్పుకోబడినదిగా, స్యాత్ = అయిఉండేది.

"క్రొత్త కొత్తగా అపరాధాలను చేస్తూ ఉండే చేతనుల విషయంలోకూడా వారి చేయి విడువకుండా సంరక్షణమే చేయాలి'' అని లక్ష్మీదేవి శ్రీరంగనాథునకు తెలిపే సమయంలో, అపుడు భగవానునకు వేఱొక వైపులో, ఓ గోదాదేవీ ! నీవు లేకుండా ఉండి ఉంటే, లక్ష్మీదేవి చేసే పురుషకారంలో ఆ శ్రీరంగనాథుడు వైముఖ్యాన్ని చూపి, తన ముఖాన్ని పక్కకు తిప్పుకొని ఉండేవాడు కదా!

పరమకృపను కల పరమపురుషుడు అపరాధాలను చేసిన చేతనులను రక్షించడంలో సహజంగానే కుతూహలాన్ని కలవాడు. అయినా, కొన్ని సందర్భాలలో, చేతనులు చేసిన పాపాలను లెక్కించకుండానో, క్షమించియో, వాటిని భోగ్యాలుగా గ్రహించియో అనుగ్రహించకుండా, ఆ దోషాలను లెక్కించి నిగ్రహాన్ని చూపడంలో ఆ స్వామికి స్వాతంత్ర్యం ఉన్నది. అందువల్ల వారిని దండించాలనికూడా ఒక్కొక్క సమయంలో అతడు భావించవచ్చు. అటువంటి సమయాలలో, ఏ సమయంలోను నిగ్రహం అనేది తెలియని లక్ష్మీదేవి భగవానునకు కొన్ని ఉద్బోధలను చేయాలని ప్రయత్నిస్తుంది. "స్వామీ ! ఇసుక (నిండిన) అన్నంలో రాళ్ళను ఏరేవారు ఎవరైనా ఉంటారా? దోషమే మూర్తీభవించిన వీరి విషయంలో మంచిని వెదకడం, అది లేదని వీరి చేయి విడవాలని చూడడం తగినదేనా? సంపూర్ణంగా అపరాధాలను చేసిన వారైనా, తర్వాత కొంచెం పశ్చాత్తాపాన్ని పొంది, శ్రీచరణసన్నిధిని చేరి ఆశ్రయించిన వారి విషయంలో కూడా మీరు నిగ్రహాన్నే ప్రదర్శిస్తే, ఇక మీ అనుగ్రహానికి లక్ష్యం ఏముంటుంది చెప్పండి? ఇటువంటివారి విషయంలోకదా నేను పురుషకారం చేయాలి. దోషాలను చేసి, అనుతాపలేశంకూడా లేకుండా విముఖులై ఉండే చేతనుల విషయంలో మీ స్వాతంత్ర్యం ప్రవర్తించవచ్చుకదా! స్వల్పమైన ఆభిముఖ్యం కల్గినవారైన ఇటువంటివారిని మీరు రక్షించడం తప్పని సరి'' అని లక్ష్మీదేవి భగవానుని చూచి ఉద్బోధిస్తుంది.



ఈ విధంగా లక్ష్మీదేవి పలికే వచనాలను విని భగవానుడు "ఎప్పుడూ ఈమెకు ఈ విధంగా పల్కడమే కదా పని! ఈమె మాటలను వింటే శాస్త్రాలకు, మన ప్రభుత్వానికి జలాంజలి చేయవలసి వస్తుంది. అందువల్ల, ఈమె మాటలను నేను పట్టించుకోకూడదు" అని భావించి ముఖాన్ని పక్కకు తిప్పుకోవాలని చూస్తాడు. లక్ష్మీదేవి వేంచేసి ఉండే వైపునుండి ఇంకొక వైపుకు తిప్పుకోవాలని స్వామి ఆవిధంగా చూచినపుడు, ఆ వైపున గోదాదేవి వేంచేసి ఉన్నందువల్ల, ముఖాన్ని ఆ వైపులో తిప్పుకోవడం అసాధ్యమవుతుంది. ఎందుకు ? అంటే, చేతనుల విషయంగా భగవానునకు ఆణ్డాళ్ చేసే ఉద్బోధం లక్ష్మీదేవి ఉద్బోధనకు మించి ఉంటుంది తప్ప, తక్కువగా ఉండదు. అందువల్ల, ఆ వైపుగా ముఖాన్ని తిప్పినా భగవానునకు స్వాభీష్టం నెఱవేరే అవకాశం లేదు. తేలుకు భయపడి పరుగెత్తి పులినోటికి పడిన రీతిలో, లక్ష్మీదేవి ఉపదేశాలను వినకుండా, ముఖాన్ని తిప్పుకొన్నందువల్ల ప్రయోజనం లేదుకదా ! గోదాదేవి ఉపదేశాలకు చెవి ఒగ్గవలసినదే తప్ప వేఱు గతి స్వామికి లేదు. దీనిని గమనించిన స్వామి **"పాయాదీషత్ప్రచలితపదో నాపగచ్ఛన్ న తిష్ఠన్ మిథ్యాగోపస్స్వపది నయనే మీలయన్ విశ్వగోప్తా"** (కొంచెం కదిపిన పాదాలను కలవాడై ముందుకు పోకుండా, నిలువకుండా ఉన్నవాడై, వెంటనే కన్నులను మూసికొనే ఆ విశ్వరక్షకుడైన కపటగోపాలుడు రక్షించుగాక) అనే రీతిలో నిరుత్తరుడు కావలసినదే. "లక్ష్మీదేవి చెప్పిన రీతిలో నడచుకోవడమే మనకు గతి'' అని అతడు నిశ్చయించుకోవలసివస్తుంది.

దీనివల్ల పురుషకారత్వైకాంతికమైన కరుణాతిశయంలో గోదాదేవి లక్ష్మీదేవినికి మించి ఉంటుంది -అని స్పష్టపడుతున్నది. **"జనే"** అనే సప్తమీవిభక్తిని విషయసప్తమిగా గ్రహించవచ్చు. సతిసప్తమిగాకూడా గ్రహించవచ్చు. **"ప్రాయేణ"** అనే పదం ఉత్ప్రేక్షావ్యంజకం.

**25.** **గోదే ! గుణైరపనయన్ ప్రణతాపరాధాన్**
**భ్రూక్షేప ఏవ తవ భోగరసానుకూలః ।**
**కర్మానుబన్ధిఫలదానరతస్య భర్తుః**
**స్వాతన్త్ర్యదుర్వ్యసనమర్మభిదా నిదానమ్ ॥**

గోదే = గోదాదేవీ ! గుణైః = నీగుణాలతో, ప్రణత +అపరాధాన్ = శరణాగతి చేసినవారి దోషాలను, అపనయన్ = తొలగించేదై, భోగరస + అనుకూలః =

భోగరసానికి తగినదై ఉండే, తవ = నీయొక్క, భ్రూక్షేపః ఏవ = కనుబొమల కదలికయే, కర్మ+అనుబంధి = కర్మలకు తగిన (సంబంధించిన), ఫల = ఫలాన్ని, దాన = ఇవ్వడంలో, రతస్య = ఆదరాన్ని కల, భర్తుః = (నీ) వల్లభుని, స్వాతంత్ర్య= నిరంకుశస్వాతంత్ర్యంచే కలిగే, దుర్వ్యసన = కఠినమైన కార్యంలోని, మర్మభిదా = మర్మస్థానాలను భేదించడానికి, నిదానం = మూలకారణం.

గోదాదేవీ ! విలాసచేష్టితాలతో ఆశ్రితులైన చేతనుల అపరాధాలను లేకుండా చేసే, శృంగారరసానుభవసామగ్రిలో ఒకటిగాను ఉండే నీ కనుబొమల కదలికలు కర్మానుగుణంగా ఫలాన్ని ఇవ్వాలని కోరే భగవానుని స్వాతంత్ర్యవ్యసనమనే మర్మస్థానాన్ని ఖండించడంలో మూలకారణం అవుతున్నవి.

**"వైషమ్యనైర్ఘృణ్యే న, సాపేక్షత్వాత్"** అనే బ్రహ్మసూత్ర సిద్ధాంతానుసారం భగవానుడు తనకు వైషమ్యనైర్ఘృణ్య దోషాలు స్పృశించని రీతిలో జీవులు వారు వారు చేసే సత్కర్మ-దుష్కర్మలను తగినట్లు ఫలాన్ని ఇవ్వగోరుతాడు. కనుక, చెడ్డ కర్మలకు తగిన దండలనే భగవానుడు ఇస్తాడు. అనుగ్రహించే అవకాశాలు చాలా అరుదు. ఈ స్థితిని గోదాదేవి చూచి సహించలేదు. భగవానుని తన దారిలోకి తెచ్చుకొని, తన మాట జవదాటని రీతిలో చేయడంకోసం ఒక ఉపాయాన్ని అన్వేషిస్తుంది. శృంగార లీలారసాన్ని ఆదరించే స్వామి సమక్షంలో ఒక విధమైన భ్రూభంగవిక్షేపాన్ని గోదాదేవి చేసినంతలోనే అతడు ఆమె చెప్పిన దారిలోకి వస్తాడు. జీవులు, వారు వారు చేసిన కర్మలకు అనుగుణంగానే ఫలాన్ని ఇవ్వాలి- అనే సంకల్పాన్ని పొందిన భగవానుని వ్రతం భగ్నమైపోతుంది- అని భావం.

శ్రీవచనభూషణదివ్యగ్రంథంలో **"ఈశ్వరనై అழகాలే తిరుత్తుమ్"** అనే చోట వ్యాఖ్యానంలో - **"కణ్ణై పురట్టుతల్, కచ్చై నెకిழ்త్తుదల్ శెయ్తు తన్నழகాలే అవనై పిచ్చేఱ్ఱి త్తాన్ శొన్నపడి శెయ్దల్లతు నిఱ్కమాట్టాదపడి పణ్ణి"** (కళ్ళను తిప్పడం, కంచుకాన్ని తొలగించడం చేసి, తన అందంతో అతనిని పిచ్చెక్కించి, తాను చెప్పినట్లు చేస్తే తప్ప నిలువలేనట్లుగా చేసి) అనే దివ్యసూక్తులు ఇక్కడ అనుసంధేయాలు. భట్టర్ శ్రీగుణరత్నకోశంలో **"ఉపాయైః విస్మార్య స్వజనయసి"** (ఉపాయాలతో విస్మరింపజేసి, రక్షింపజేస్తుంది) అని పల్కిన సందర్భంలోని **"ఉపాయ"** శబ్దంచే ఇవి అన్నీ వివక్షితాలు.



ఆణ్డాళ్ భగవానునిపట్ల భోగప్రవణయై ఉండడం సాపరాధచేతన సంరక్షణ కోసమే- అనే అంశం ఈ శ్లోకంలో తెలుపబడింది. మొదటి పాదంలోని **"గుణైః"** అనే పదం గోదాదేవి గుణాలను తెలుపదు. ఆమె చేసే భ్రూవిక్షేపాల గుణాలను తెలుపుతుంది. భగవానుని స్వాధీనం చేసికోవడానికి ఉపయోగపడే ఇక్కడ స్వభావమే గుణశబ్దంచేత వివక్షితం.

**"స్వాతంత్ర్యదుర్విషహమర్మభిదానిదానమ్"** - అని కొందఱి పాఠం. అందులో స్వారస్యం లేదు. మర్మమంటే ప్రాణస్థానం. ఇక్కడ దానిని ఛేదించడమంటే- స్వాతంత్ర్యాన్ని పూర్తిగా లేకుండా చేయడమే.

**26.** **రఙ్గే తటిద్గుణవతో రమయైవ గోదే !**
**కృష్ణామ్బుదస్య ఘటితాం కృపయా సువృష్ట్యా ।**
**దౌర్గత్యదుర్విష వినాశసుధానదీం త్వాం**
**సన్తః ప్రపద్య శమయన్త్యచిరేణ తాపాన్ ॥**

గోదే = గోదాదేవీ !, రంగే = శ్రీరంగంలో, రమయా ఏవ = లక్ష్మీదేవిచేతనే, తటిద్గుణవతః = మెఱుపు తీగను కల్గినది అయిన, కృష్ణ+ అంబుదస్య = శ్రీకృష్ణుడనే (శ్రీరంగనాథుడనే) నీలమేఘంయొక్క, కృపయా = కరుణ అనే, సువృష్ట్యా = మంచి వర్షంతో, ఘటితాం = కూడినదై, దౌర్గత్య = సంసారమనే, దుర్విష = క్రూరవిషాన్ని, వినాశ = నాశం చేయడానికి తగిన, సుధానదీం = అమృతనది అయిన త్వాం = నిన్ను, ప్రపద్య = శరణు పొంది, సంతః = సత్పురుషులు, తాపాన్ = సంసారతాపాలను, అచిరేణ = త్వరగా, శమయంతి = ఉపశమింపజేసి కొంటున్నారు.

గోదాదేవీ ! శ్రీరంగంలో వేంచేసి ఉండేవాడు, పిరాట్టి అనే మెఱుపు తీగను కలవాడు, కాలమేఘంవంటివాడు అయిన శ్రీరంగనాథుని కృపావర్షంచేత జనింపచేయబడి, సంసారమనే క్రూరవిషాన్ని తీర్చే విషయంలో అమృతనదివలె ఉండే నిన్ను సత్పురుషులు సేవించి వెంటనే సకలతాపాలు తొలగినవారవుతున్నారు.

ఈ శ్లోకంలో గోదాదేవి అమృతనదిగా రూపణం చేయబడింది. లోకంలో నది మేఘం కురిసే వర్షంవల్ల ఏర్పడుతుంది. అది ఆ యా జనుల తాపాల శాంతిని కల్గిస్తున్నవి. ఈ గోదాదేవి అనే అమృతనదికూడా ఒక కాలమేఘంయొక్క వర్షంవల్లనే

ఉదయించింది. "కొణ్డల్ వణ్ణన్"గా కీర్తింపబడే శ్రీరంగనాథుడే ఇక్కడి కాలమేఘం. ఆ స్వామికృపాజలమే వర్షంగా ఉదయించింది. అటువంటి వర్షంవల్ల గోదాదేవి అనే నది ఉదయించింది- అని చెప్పడంలోని తాత్పర్యం. ఏమి ? అంటే, భగవానుడు మనవంటి సంసారచేతనులను ఉద్ధరించాలనే పరమకృపను కలవాడై, దివ్యప్రబంధాలను అనుగ్రహించడంకోసం గోదాదేవిని అవతరింపజేశాడు- అన్నది ఆ తాత్పర్యం. నది తనలో మునిగి స్నానం చేసేవారికి వెంటనే వారి తాపాలను తీరుస్తుంది. గోదాదేవి కూడా తన పట్ల అభినివేశాన్ని కల్గి, ఆశ్రయించినవారిని తన శ్రీసూక్తుల తోను, తన దివ్యమంగళ విగ్రహానుభవప్రదానంతోను తాపత్రయాలు తీరినవారినిగా చేస్తుంది- అని భావం.

భగవానుని మేఘంగా పల్కినపుడు, మేఘంలో మెఱుపు తీగ వెల్గే రీతిలో, ఈ మేఘంలోకూడా మెఱుపుతీగ ఉన్నదా ? అనే ప్రశ్న రాగా, "ఉన్నది'' అని బదులిస్తున్నది- మొదటి పాదం. వర్షించడానికి సిద్ధంగా ఉండే మేఘం మెఱుపుతీగ కాంతితో కూడి ఉంటుంది కదా !

**"రమయా"** అనే తృతీయావిభక్తికి అభేదం అర్థంహా **"ధాన్యేన ధనవాన్"** అనే ప్రయోగాలలోవలె. తటిద్గుణమంటే విద్యుల్లత. **"కృష్ణాంబుదస్య"** అనే ప్రయోగంలో శ్లేష ఉన్నది. కృష్ణపదం నల్లని రంగును కల వస్తువును, భగవానుని నిర్దేశిస్తుంది. కనుక నల్లని మేఘంయొక్క- అని నదీ పక్షంలో అర్థం. భగవానుడనే మేఘంయొక్క- అని గోదాదేవిపక్షంలో అర్థం. **"దౌర్గత్యమ్"** అనే పదం సంసారాన్ని తెలుపుతుంది; దారిద్ర్యాన్ని తెల్పుతుంది. దౌర్గత్యమనే క్రూరవిషం నాశాన్ని పొందడానికి కారణభూతమైన అమృతనది- గోదాదేవి. ఇక్కడ **"గోదా"** పదంచేత గోదావరీనది కూడా ధ్వనిస్తుంది.

**27.** **జాతాపరాధమపి మా మనుకమ్ప్య గోదే !**
**గోప్త్రీ యది త్వమసి యుక్త మిదం భవత్యాః ।**
**వాత్సల్యనిర్భరతయా జననీ కుమారం**
**స్తన్యేన వర్ధయతి దష్టపయోధరాఽపి ॥**

గోదే = ఓ గోదాదేవీ !, త్వం = నీవు, జాత+అపరాధమ్ అపి = అపరాధాలను చేసినవాడను అయినా, మాం = నన్ను (చూచి), అనుకంప్య = అయ్యో ! అని కరుణను చూపి, గోప్త్రీ = కాపాడేదానివిగా, యది అసి = అయినట్లయితే, ఇదం = ఇది, భవత్యాః = నీకు, యుక్తం = తగినదే, జననీ = తల్లి, దష్ట = చంటి బిడ్డచే కఱువబడ్డ, పయోధరా అపి = స్తన్యాన్ని కల్గినదైనా, వాత్సల్యనిర్భరతయా = వాత్సల్యగుణంయొక్క పరిపూర్ణతచేత, కుమారం = పుత్రుని, స్తన్యేన = స్తన్యక్షీరంలో, వర్ధయతి = పోషిస్తున్నది (కదా).



గోదాదేవీ! నీవు అపరాధి అయిన నన్ను దయ చూపి రక్షించినట్లయితే, అదే నీకు తగినది కాగలదు. నా దోషాలలో నీవు దృష్టి పెట్టకూడదు. ఎందుకు ? అంటే, తల్లి. తన శిశువు పాలు తాగేటపుడు తన స్తన్యాన్ని కొఱికి కొంచెం బాధ కల్గించినా, ఆ బిడ్డను తల్లి కోపగించుకోకుండా తన స్తన్యపానంద్వారా పెంచుతుంది కదా.

గోదాదేవికి దేశికులకుమధ్య సంవాదంరూపంలో శ్లోకార్థం వివరించబడుతున్నది.

**దేశికులు :** తల్లీ ! నన్ను నీవు రక్షించాలి.

**ఆణ్డాళ్ :** అపరాధివి అయిన నిన్ను రక్షించలేను.

**దేశికులు :** గోదాదేవీ ! నేను అపరాధిని అనే మాట నిజమే. అయినా, నీవు కరుణాబ్ధివి కనుక నన్ను రక్షించడం నీకు కర్తవ్యం సుమా !

**ఆణ్డాళ్ :** నేను కరుణాబ్ధి అని నీకు ఎవరు తెలిపారు ?

**దేశికులు :** దీనిని వేఱెవ్వరైనా తెలియజేయాలా ? నీవు తల్లివి కదా ! తల్లికి ఉండే గుణాన్నిగూర్చి బిడ్డకు తెలియదా ?

**ఆణ్డాళ్ :** తల్లి అయినా, అపరాధాలను చేసే కుమారులను ఆమె దండిస్తుంది కదా ! లోకంలో దీనిని మీరు చూడలేదా !

**దేశికులు :** తల్లీ ! నేను చెప్పే మాటను విను. బిడ్డలు తల్లి స్తనాన్ని పాలుతాగే సమయంలో ఒక్కొక్క సమయంలో కొఱుతారు. అయినా, తల్లి వాత్సల్యాతిశయంతో స్తన్యాన్ని ఇచ్చి వారిని పెంచుతుంది. ఇదే లోకంలో సహజమైన, చూడబడే విషయం. అంతే తప్ప తల్లి తన బిడ్డ విషయంలో నిగ్రహాన్ని చూపదు. అదే రీతిలో, నేను కూడా నీచే అనుగ్రహింపబడవలసినవాడనే తప్ప నిగ్రహింపబడ దగినవాడనుకాను.

ఏమాత్రం జ్ఞానం లేని చిన్న శిశువువంటి నన్ను అనుగ్రహించి, దోషాలనే ఉపహారంగా గ్రహించి రక్షించాలని అనడం -ఇందులోని పరమతాత్పర్యం.

28. శతమఖమణినీలా చారుకల్హారహస్తా
స్తనభరనమితాఙ్గీ సాన్ద్రవాత్సల్యసిన్ధుః ।
అలకవినిహితాభిః స్రగ్భి రాకృష్టనాథా
విలసతు హృది గోదా విష్ణుచిత్తాత్మజా నః ॥

శతమమణినీలా = ఇంద్రనీలమణులవలె నీలవర్ణాన్ని కల్గినది, చారు = అందమైన, కల్హార = కలువపూవును, హస్తా = కరంలో కల్గినది, స్తనభర = స్తనాల భారంచేత, నమిత + అంగీ = కొంచెం వంగిన శరీరాన్ని కల్గినది, సాంద్రవాత్సల్య= దట్టమైన (మిక్కిలి అయిన) వాత్సల్య గుణానికి, సింధుః = సముద్రంవంటిది, అలకవినిహితాభిః = ముంగురులలో అలంకరించుకొన్న, స్రగ్భిః= పూమాలికలతో, ఆకృష్టనాథా = నాథుని ఆకర్షించినది అయిన, విష్ణుచిత్త+ ఆత్మజా = విష్ణుచిత్తుల పుత్రిక అయిన, గోదా = గోదాదేవి, నః హృది = మా హృదయంలో, విలసతు = ప్రకాశించాలి.

స్తుతిని పరిసమాప్తి చేయదలచిన శ్రీదేశికులు, ఆణ్డాళ్ ఎల్లప్పుడు తమ మనస్సులో వేంచేసి ఉండాలని ప్రార్థిస్తూ, ఆ ఆణ్డాళ్‌యొక్క దేహగుణాలను, ఆత్మగుణాలను, చరిత్రలోని ముఖ్యమైన అంశాన్ని ప్రస్తావిస్తూ, సహృదయ హృదయహారి అయిన శైలిలో చాలా అద్భుతంగా స్తుతిస్తున్నారు. ఈ స్తుతిలోని మిగిలినశ్లోకాలన్నీ ఒక ఎత్తు కాగా, ఈ శ్లోకం మాత్రం ఒక ఎత్తు- అని రసికులు అంటారు.

**(శతమఖమణినీలా)**- ఇంద్రనీలరత్నంవలె నీలవర్ణంతో ప్రకాశిస్తున్నది.

**(చారుకల్హారహస్తా)** - అందమైన ఎఱ్ఱ తామరపూవును శ్రీహస్తంలో ధరించినది. ఈ విశేషణం అర్చావతారానుభవాన్ని తెల్పుతుంది.

**(స్తనభరనమితాంగీ)** - **"ఊనిడైయాழி శఙ్గుత్తమర్క్కెన్ఱు ఉన్నిత్తెழுన్దఎన్ తడములైకళ్"** అని, **"కొఙ్గైమేల్ కుఙ్కుమత్తిన్ కుழம்బ్ழிయ ప్పుకున్దు ఒరు నాళ్ తఙ్గుమేల్ ఎన్నావి తఙ్గుమ్"** అని, **"కొఙ్గైత్తలమివై నోక్కి క్కాణీర్ కోవిన్దనుక్కల్లాల్ వాయిల్ పోకా"** అని **"కొమ్మైములైకళ్ ఇడర్ తీర క్కోవిన్దఱ్కోర్ కుற్றేవల్ ఇమ్మై ప్పిఱవి శెయ్యాదే ఇని ప్పోయ్ చ్చెయ్యుమ్ తవన్దాన్ ఎన్ ?"** అని అనుగ్రహించిన రీతిలో భగవద్విషయంలో అభినివేశాన్ని పొందిన అవయవవిశేషాన్ని కల్గినదని భావం. ఆణ్డాళ్‌కు కల భక్తిభావాన్ని సూచించడం ఇచటి ధ్వన్యర్థం.



**(సాంద్రవాత్సల్యసింధుః)** - మనవంటివారైన మూఢులట్ల వాత్సల్యమే మూర్తీభవించినది - అని భావం.

**(అలకవినిహితాభిః స్రగ్భిరాకృష్టనాథా)** -**"స్వోచ్ఛిష్టాయాం స్రజి నిగళితం యా బలాత్కృత్య భుంక్తే"** అనే భట్టర్ శ్రీసూక్తిని మనస్సులో పెట్టుకొని ఈ విశేషణాన్ని దేశికులు ప్రయోగించారు. తాను ముడుచుకొని తీసి ఇచ్చిన మాలికతో భగవానుని ఆనందంపజేసి, అతడు తన దారిలోకి వచ్చేటట్లు చేసికొన్నది- అని భావం.

ఈ విధంగా గొప్పతనాన్ని కల్గిన, భట్టనాథుల పుత్రిక అయిన గోదాదేవి ఎల్లప్పుడు నా హృదయంలోపల అధివసించి ఉండాలి- అని శ్రీదేశికులు అంటున్నారు.

గోదాదేవి **"వల్లవెన్ తోழி"** అనే పాశురంలో **"విల్లిపుదువై విట్టుశిత్తర్‌తఙ్గళ్ తేవరై వల్ల పరిశు వరువిప్పరేల్ అతు కాణ్డుమే"** అని పెరియాழ்వార్ల పుత్రికగా తాను పెరిగిన విషయాన్ని తనకొక నిధిగా తలచినందువల్ల ఈ ఆచార్యవర్యులు ఈ స్తుతిలో ఆరంభంలో **"శ్రీవిష్ణుచిత్తకులనందనకల్పవల్లీమ్"** అని ఉపక్రమించి, **"విష్ణుచిత్తాత్మజా"** అని పూర్తిచేశారు.

29. ఇతి వికసితభక్తే రుత్థితాం వేంకటేశాత్
బహుగుణరమణీయాం వక్తి గోదాస్తుతిం యః ।
స భవతి బహుమాన్యః శ్రీమతో రఙ్గభర్తుః
చరణకమలసేవాం శాశ్వతీ మభ్యుపైష్యన్ ॥

వికసితభక్తేః = వికసించిన భక్తిని కల్గిన, వేంకటేశాత్ = వేంకటేశకవివల్ల, ఇతి = ఈ విధంగా, ఉత్థితాం = ఆవిర్భవించినది, బహుగుణ = పలు గుణాలతో, రమణీయాం = అందమైన, గోదాస్తుతిం =గోదాస్తుతిని, యః =ఎవడు, వక్తి = అనుసంధిస్తాడో, సః = అతడు, శ్రీమతః = ఏనాడూ లక్ష్మీదేవిని విశ్లేషించని, రంగభర్తుః = శ్రీరంగనాథుని, శాశ్వతీం = నిత్యమైన, చరణకమలసేవాం = శ్రీచరణ పద్మాల కైంకర్యాన్ని, అభ్యుపైష్యన్ = పొందేవాడై, బహుమాన్యః= అతనికి చాలా ఆదరణీయుడు, భవతి = అవుతున్నాడు.

భక్తివికాసాన్ని కల్గినవారైన శ్రీవేంకటనాథార్యులవల్ల ఈ విధంగా అవత రించిన, శబ్దాలంకార- అర్థాలంకారపుష్టితో కూడిన గోదాస్తుతిని ఎవడు పఠిస్తాడో, అతడు నిత్యకైంకర్యసామ్రాజ్యాన్ని పొందినవాడై, శ్రీరంగనాథుని బహుమానానికి పాత్రుడు కాగలడు.

స్తుతిచివరలో ఫలశ్రుతిని పల్కి శ్రీదేశికులు స్తుతిని ముగించారు. "గోదాస్తుతి ఆనే కృతిని రచించాలని నేనే ప్రయత్నించి ప్రవర్తించలేదు. భక్తిబలాత్కారంవల్ల ఈ విధంగా ఒక స్తుతి సకలగుణసంపన్నమై స్వయంగానే ఆవిర్భవించింది"- అని పూర్వార్ధంలో పలికారు.

ఇటువంటి ఈ స్తుతిని పఠించేవారు కాలాంతరంలో (ఏతద్దేహావసాన సమయంలో) **"నలమన్దమిల్లదోర్ నాడు"** అయిన పరమపదంలో నిత్యకైంకర్య సామ్రాజ్యాన్ని పొందుతారు. ఈ విభూతిలో వేంచేసి (జీవించి) ఉన్నంతవరకు శ్రీరంగాన్ని కోవెలగా చేసికొన్న శ్రియఃపతి అనుగ్రహానికి పాత్రమై, ఆనందంగా జీవిస్తారు- అని అంటూ ఫలశ్రుతిని పల్కి ఈ స్తుతిని శ్రీదేశికులు పూర్తిచేశారు.

**కవితార్కిక సింహాయ కల్యాణగుణశాలినే ।**
**శ్రీమతే వేంకటేశాయ వేదాన్తగురవే నమః ॥**

